
త్వరలో విడుదల!
జెమినీ వారి
గొప్ప హాస్యరస సాంఘిక చిత్రం
భలే కోడళ్లు
కథ, దర్శకత్వం.. కె. బాలచందర్
మాటలు.. భమిడిపాటి రాధాకృష్ణ • పాటలు.. సి. నారాయణ రెడ్డి -
సంగీతం- ఎం. ఎస్. విశ్వనాథన్
డిస్ట్రిబ్యూటర్లు:- ఆంధ్ర & రాయలసీమలకు - నవయుగ ఫిలింస్.
తెలంగాణాకు - జెమిని పిక్చర్స్ సర్క్యూట్ ప్రైవేట్ లిమిటెడ్, సికిందరాబాదు.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 3—11—'67
ప్లవంగనామ సం॥ కార్తీక మాసం శుద్ధ పాడ్యమి

సంపుటము : 60 సంచిక : 9

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22 40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5 60 |

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'నరకాసుర వధ'
రచన : శ్రీ కె. శేషగిరిరావు.

కథలు :



సీరియల్ నవలలు:



శీర్షికలు, వ్యాసాలు, సినిమా:



## శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య

పాఠకులందరికీ మా దీపావళి శుభాకాంక్షలు దీపావళి కథల పోటీలో పాల్గొన్న వారందరికీ మా కృతజ్ఞతలు! మొదట మూడు బహుమతులు పొందిన కథల రచయితలు, రచయిత్రి ఫోటోలు, వారు పంపిన జీవితవివరాలు ఇక్కడ ప్రచురిస్తున్నాము పోటీలో బహుమతి పొందకపోయినా మాములుగా ప్రచురణకి స్వీకరించిన కథల జాబితాలను ఈ సంచికలోనే మరోకచోట వేస్తున్నాము వీటి విషయమయి ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపలేమని మరోకసారి మనవి చేసుకుంటున్నాము —సం

* * *

శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య గుంటూరులో 15—12—1938 లో జన్మించారు గుంటూరు, విజయవాడలలో విద్యాభ్యాసం చేశారు విజయవాడలో ఉన్న ఆంధ్ర లయోలా కళాశాల తెలుగుశాఖలో గత పదకొండు సంవత్సరాలుగా ఉద్యోగం చేస్తున్నారు

* * *

శ్రీ మొక్కపాటి శివాజీ 7-9-1924 న జన్మించారు మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఎం ఏ డిగ్రీ పుచ్చుకున్నారు జర్మను, ఫ్రెంచి, ఇటాలియన్ భాషలు కొంత పరిచయం, ఉర్దూ భాషలు కూడా వచ్చు పి హెచ్ డి డిగ్రీకి ఆర్థిక శాస్త్ర పరిశోధన చేసూ





## శ్రీ మొక్కపాటి శివాజీ

'వైయక్తిక వ్యతిరేకత వల్ల' పరిశోధనం ఫలితాన్ని 'డిగ్రీకి పంపలేదు '

కొంతకాలం ప్రభుత్వోద్యోగం చేసిన తర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఒకభాగం అయిన హైదరాబాదు సాయం కళాశాలలో అర్థశాస్త్రాధ్యాపకులుగా స్థిరపడ్డారు మొట్టమొదటి రచన 1938 లో 'చిత్రగుప్త' పత్రికలో పడినట్లు జ్ఞాపకం అన్నారు ఇంగ్లీసులో కూడా ఎన్నో రచనలు చేశారు

అభిమాన విషయాలు సాహిత్యం, ఆర్థిక, రాజకీయ, రాజనిర్వాహక శాస్త్రాలు, ఫోటోగ్రఫీ, మృదంగం, మొక్కలు పెంచడం ఆశ ఎప్పటికయినా తెలుగుభాషలో సర్వాంగ సుందరం అయిన సాహిత్యం సాంకేతిక విషయాలపై శరంపర గ్రంథావళి వెలువడితే చూడాలని అసలు రానివి లెక్కలు, ఇచ్చకపు మాటలు, ఇష్టంలేనివి సద్యం చెయ్యటం, పుచ్చుకోవడం నమ్మకంలేనిది కుటుంబనియంత్రణ వివాహం 1947 లో నలుగురు కొడుకులు ముగ్గురు కూతుళ్లు తలిదండ్రులతో కలిసి ఉంటున్నారు

* * *

కుమారి భట్టిప్రోలు బాలాదేవి 1944 జన్మించారు పెద్దాపురం, విజయనగరం, కటక్‌లలో విద్యాభ్యాసం ఆంధ్ర యూనివర్శిటీలో బి ఎస్ సి ప్యాసై ప్రస్తుతం కటక్‌లోని ఉత్కళవిశ్వవిద్యాలయంలో ఎం ఏ ఫైనల్ చదువుతున్నారు

ఈమె ప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి వేల్పూరి సుభద్రాదేవి, రచయిత శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తిగార్ల జ్యేష్ఠపుత్రిక

పరాభవ ఆంధ్రప్రభ దీపావళి కథల పోటీలో వీరికథకు రెండవ బహుమతి లభించింది పేరు "శేషు" అముద్రిత రచన

## ఉత్తరాలు

6—10—67 సంచిక ఉత్తరాల శీర్షికలో 'పూర్వాసంధ్యాప్రవర్తే' 'సీలియల్ మీద ఒక పుస్త



## కుమారి భట్టిప్రోలు బాలాదేవి

కం చూచాను అందులో సంశయాత్మకమైన విషయాలుగా మూడు అంశాల పేర్కొన్నారు

మొదటిది— మూడు గంటల ప్రశ్నాపత్రం బి ఏ కు వుంటుందా అని

1965 వం సెప్టెంబరు వరకూ వున్న పాత నిబంధనల (పోల్డ్ రెగ్యులేషన్సు) డిగ్రీ ఎగ్జామినేషను పరీక్షలోనూ, క్రొత్త నిబంధనల (న్యూ రెగ్యులేషన్సు) లోనూ ప్రశ్నాపత్రం వ్యవధి మూడుగంటలే

రెండవది— ప్రిన్సిపాల్‌కు అడిషనల్ టైము గ్రాంటుచెయ్యగల అధికారము లేదని

ఎగ్జామినేషను చీఫ్ సూపరింటెండెంటుగా ఆయనకు విస్తృతాధికారాలు వుంటాయి అడిషనల్ టైము గ్రాంటు చేయు అధికారమును గురించి నిర్దుష్టముగా ఎక్కడనూ పేర్కొనబడక పోయినను, డిస్క్రిషనరీపవర్సు క్రింద గ్రాంటుచేయగల అధికారము వుంది తమ పొరబాటువల్లగాని, కళాశాల నిర్వహణలోని పొరబాటు వల్లగాని ప్రశ్నాపత్రం ఇవ్వడం ఆలశ్యమయితేను, అడిషనల్ టైము గ్రాంటు చెయ్యవలసిన అవసరాన్ని కలిగించే యితర పరిస్థితులు ఏర్పడినప్పుడూ, చీఫ్ సూపరింటెండెంటు హోదాలో అడిషనల్ టైము ఇవ్వడానికి ఆయనకవకాశం వుంది

మూడవది— బల్లమీది నెంబరు వుండి లిస్టులో లేక పోవడానికి బలమైన కారణం ఏమి టని

ఇలాంటి పొరపాట్లకు బలమైన కారణాలు ఏమీ వుండవు ఎవ్వరూ కావాలని చెయ్యరు హడావుడిలో చిన్నచిన్న పొరపాట్లు జరుగుతుంటాయి అసలక్కడ పొరబాటు ఎందుకు జరిగింది అనేదంత ముఖ్యమైన విషయమని నేననుకోను పొరబాటు ఎవరి వల్లనైనా జరగనీండి పరిస్థితిని సహృదయంతో అర్థం చేసుకుని సానుభూతి చూపించవలసిన వారు ఆ కాలంలో చూపలేక పోడం గమనించాల్సిన విషయం. ఇలాంటి సంఘటనలు అరుదు అయ్యుండవచ్చుగాక అసంభవం మాత్రం కాదు ఈ సంద

(79 వ పేజీ చూడండి)


మొరార్జీ నేపాల్ వెళ్లటం పొరుగువారికి ఆసక్తికరంగా ఉంది.
అజయ్.ఘోష్ మార్క్సిస్టులతో మైత్రిని కొనసాగించడానికే నిశ్చయించుకున్నారు
అజయ్ ఘోష్
కవ్వింపు
మధ్యప్రాచ్యంలో ప్రమాదకరపరిస్థితి
కేరళ ప్రభుత్వం

# మంత్రుల విదేశ విహారాలవల్ల మనదేశానికి జరుగుతున్న మేలు?

మన మంత్రుల విదేశ పర్యటనలని కొలబద్దగా చేసుకుంటే భారతదేశం చాలా అభివృద్ధిలోవున్న దేశంగా అనుకోవలసి వస్తుంది. ప్రధానమంత్రిగారు తూర్పు ఐరోపాదేశాల పర్యటనలో వున్నారు. వారు అక్కడివారి ముఖాలు అలా అలా చూసీ చూడడంతోనే పశ్చిమ ఆశియా, వియత్నాం విషయాలమీద వారు అమెరికాతో ఎంతగా వ్యతిరేకిస్తున్నారో తెలుసుకుంటారు! ఒకానొక దేశ పర్యటన ముగియగానే, ఒకరి భావాలతో ఒకరు ఏకీభవించినట్లు తెలియడానికిగాను సంయుక్త ప్రకటనలు చేస్తున్నారు. ఈ ఘనమైన పర్యటనకి అసలు కారణమేమిటో ఎవరికీ తెలియడం లేదు. ఈదేశం మట్టుకు ఈ దేశానికి పరిష్కారం కాని సమస్యలు గుట్టలు గుట్టలుగా వున్నాయి. ఉదాహరణకి ఆహార ఉత్పాదన విషయం ఒక్కటి తీసుకుంటే చాలు. ఎరువులు లభించడాన్ని బట్టి ఆహారోత్పత్తి పరిమితమైపోయింది.

సింద్రీలోను, రూర్కెలాలోను ఉత్పత్తి చాలా వరకు పడిపోయింది అందుకు కార్మిక వివాదానికి మనం కృతజ్ఞతలు తెల్పుకుందాం! ట్రాంబేలో వున్నదానికింకా రూపురేఖలు సరిగ్గాలేవు. అనుకున్న ఉత్పత్తిని అందుకోవాలంటే దానికింకా కొంత కాలం కావాలి. ఎరువుల్లో ఈ కొరతను తట్టుకోవడానికి విదేశీమారక ద్రవ్యాన్ని దిగుమతుల మీద ఎక్కువగా వెచ్చించవలసి వుంటుందన్న మాట.

ఆహార ధాన్యాల సంపాదనలో కేంద్ర ప్రభుత్వం అసమర్థత తెలిసిపోతూనే వుంది. కాంగ్రెసు రాష్ట్రాల మీద కూడా కేంద్రం అధికారం కోల్పోయిందని అర్థమయింది. జాతీయ ఆహార సమస్యమీద రాష్ట్ర మంత్రుల సమావేశం ఇదివరలో ఒకటి జరిగింది. అప్పటి నుంచి వ్యవసాయ ధరల సంఘం, ప్రణాళికా సంఘం, ఆర్థిక మంత్రిత్వం మూడూ కలిసి ఆహారధాన్యాల సంపాదనలో ధరలు పెంచడం గురించి చర్చిస్తూనే వున్నాయి. వ్యవసాయ ధరల సంఘం సూచించిన రేటుకంటె ఇరవైముప్ఫయ్ శాతం వరకు కేంద్ర ఆహార మంత్రిత్వ శాఖ పెంపువేసింది. ఇది ఈ కథకి అంతం అనుకొంటే అది సరికాదు. ఇంకా వుంది. ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, పంజాబ్ ఈ మూడూ మనదేశంలో మిగులు రాష్ట్రాలు. ఇవే కేంద్రానికి ఆహారధాన్యాలని పంపుతూ వస్తున్నాయి. అవి ఇప్పుడు అధిక ధరల్ని ఆశిస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం నియమించిన ధర కంటే ఇంకా ఎక్కువ ధరని కేరళ కోరింది. మరో కమ్యూనిస్టు రాష్ట్రమయిన పశ్చిమబెంగాల్ మరింత ఆశని వ్యక్తం చేసింది.




### ఢిల్లీ సరిహద్దు దాటని ప్రభుత్వ అధికారం

కేంద్ర విద్యామంత్రిగారి జాతీయ విద్యా విధానంమీద ఉప్పెన ఇంకా సద్దుమణగలేదు.

కార్మికుల గొడవ అంతకంతకు ఎక్కువవుతున్నది. బ్రిటిష్‌వారు నిర్మించిన దుర్గాపూర్ ఉక్కు కర్మాగారాన్ని ధ్వంసంచేసిన కార్మికనాయకులు జర్మనీవారు నిర్మించిన రూర్కెలా ఉక్కుకర్మాగారంమీద విరుచుకుపడుతున్నారు. వీటితో పోల్చిచూస్తే, రష్యావారు నిర్మించిన భిలాయ్ ఉక్కుకర్మాగారంలో కార్మికులకు సంబంధించిన గొడవలేమీ ఉన్నట్టు కనిపించదు.

భారతదేశంనుంచి మొఘల్‌షాహిని పీకి పారేస్తూ ఒక పర్షియన్ లోకోక్తి ఉంది. 'షాహ్-ఇ-ఆలమ్, సుల్తానేట్—ఢిల్లీ టు

పాలెమ్' అనేది ఆ సామెత. అంటే, విశ్వాప్రపంతటినీ పాలించే మొఘల్ సార్వభౌముడు ఢిల్లీ మంచి పాలం వరకు పరుగెత్తగలిగారు అని! శ్రీమతి గాంధీగారి మీద అంతగా అభిమానం లేని ఒక అరబిక్ పత్రిక — పర్షియన్ సామెతలాగానే ఆమె భారతదేశ పరిపాలనని వర్ణించింది అయివుండి కూడా. శ్రీమతి గాంధీగారు విదేశ పర్యటనకి వెళ్ళే ముందు 'కేంద్రం ఎంతో పటిష్ఠంగా వుంది; నిర్బలంగాను, చంచలంగాను ఏం లేదు' అన్నారు.

వాణిజ్య, రక్షణ, ఉక్కు, రవాణా మంత్రులు విదేశ పర్యటనల్లో వుండగా— ఉపప్రధాని, పారిశ్రామిక అభివృద్ధి మంత్రి గారలు ఢిల్లీకి తిరిగి వచ్చారు. వారు. విదేశాల్లో సాధించిన మహత్కార్యా లన్నిటికి సత్ఫలితా లున్నాయనే సంతృప్తిని వెలిబుచ్చారు.

మొరార్జీదేశాయ్‌గారు ఫ్రాన్సు, బ్రిటన్, అమెరికా, కెనడా, పశ్చిమజర్మనీ వగైరా దేశాలు చుట్టివచ్చారు. ఇప్పుడు ప్రధాన మంత్రి తూర్పుయిరోపాదేశాల పర్యటన మన దేశంతోవున్న సంబంధబాంధవ్యాలని ఎంత కట్టుదిట్టం చేస్తుందో, దేశాయ్‌గారి పర్యటన కూడా అంతే చేస్తుంది!

అమెరికా సంయుక్తరాష్ట్రాలు—బ్రిటిష్ రాజ్యాల మధ్య చారిత్రకంగాను, సాంప్రదాయ్యంగాను, సాంస్కృతికంగాను, ఎంతో పొందు వుంది. అమెరికా భారతదేశాలమధ్య అంత పొత్తు ఎప్పుడూలేదు. వుండదు. అలాగని తెలిసివుండి, అమెరికా సంయుక్తరాష్ట్రాల్ని రెచ్చగొడుతూ సోవియట్‌రష్యాను కవుగలించుకుందామని ప్రధానమంత్రి చూస్తున్నారు!

సహాయ సానుభూతులకోసం వెళ్ళిన మొరార్జీదేశాయ్‌గారి పర్యటనా అంతే చేసింది

**కామన్ మార్కెట్— భారత్ విధానం**

మన ఫక్రుద్దీన్ అలీ అహ్మద్‌గారు కూడా తిరిగి వచ్చేశారు. వస్తూ వస్తూ గుండె నిండా ఆశ నింపుకుని వచ్చారాయన. ఆ బరువునంతా పత్రికా విలేఖరుల నెత్తిన పెట్టి వూపిరి పీల్చుకున్నారు ఈ శ్రీవారు శ్రీమతి గాంధీగారి అంతర్‌మంత్రిమండలిలో సభ్యులు. మియ్యాం సాహెబ్‌గారు కలనల్ నాసర్‌తో విద్యుక్తధర్మమైన పరాలనం చేసివచ్చారు. అభివృద్ధి దేశాల 'త్రయం'లో భారతదేశం కొత్త సభ్యత్వాన్ని సంపాయించుకుంది. భారతదేశంవల్ల పొందే లాభాల్లో తగాదా ఏర్పడినప్పుడు అరబ్ రిపబ్లిక్‌గాని, యుగోస్లావియాగాని ఎటువంటి వైఖరి చూపించివుండేదో అన్న ప్రశ్న ఇక్కడ వేసుకోవడం అవసరం. 'కామన్ మార్కెట్' విధానంలో భారతదేశం నాయకత్వం వహించాలని చూస్తున్నది. అరబ్ రిపబ్లిక్‌తో వ్యాపారం చేయడంవల్ల యుగోస్లావియాకు నష్టం అనుకుంటే భారతదేశం వెంటనే విరమించుకుంటుందట!

# న్యూఢిల్లీ లేఖ

మరి యుగోస్లావియా కూడా అంతటి స్వార్థత్యాగం చేస్తుందా?

భారతదేశానికి కొందరు కొత్త ఖాతాదారు లున్నారు. వారు కేవలం భారతదేశాన్ని దృష్టిలో పెట్టుకోకుండా కనీసం అందరి మేలు కోసమైనా వారివారి స్వార్థాపేక్షని పోగొట్టుకుంటారా? ఇదీ ప్రశ్న! కొత్త ఖాతాదారులు సంతకాలు చేసిన ఒప్పందం ఈ ప్రశ్నకి సమాధానం చెబుతుంది.

ఫక్రుద్దీన్‌గారు ఫ్రాన్సు, బ్రిటన్ వెళ్ళినప్పుడు అక్కడ 'పేటెంట్సు బిల్లు' గురించి ఆయన కొంత జగడం వేసుకున్నారు. బిల్లు యథాతథంగా ఉండడాన్ని జపాన్‌వారు అదే విధంగా ఆక్షేపించారు. దేశాయ్‌గారు జపాన్ వెళ్ళినప్పుడు ఆయనతో ఆ విషయాన్ని వారు తెలియపరిచారుకూడా

ఇవన్నీ ఫక్రుద్దీన్‌గారి పర్యటనలో మైలు రాళ్ళు. ఆయన పారిశ్రామిక మంత్రి. వ్యాపారాన్ని అధికం చేయడానికి ఆయన ఎక్కువ శ్రమపడ్డారు! పారిశ్రామికంగా ముందున్న దేశాల్లో భారతదేశానికి పరపతి లేకుండా చేయాలని ఆస్ట్రియా చూస్తున్నది ఆగ్నేయాశియాను అధీనంలోకి తెచ్చుకోవాలని జపాన్ చూస్తున్నది. అమెరికా ఏకాంతవాసము, చైనా అసమర్థత జపాన్‌కి ఈ అవకాశాన్ని కలిగించాయి.

ఆశియాలో ఆర్థికంగా వచ్చగావున్న దేశం జపాన్. అది అభివృద్ధి పథకాల్లో ముందడుగు వేస్తున్నది నాయకత్వం వహిస్తూ, దానిపాత్ర అది చక్కగా నిర్వహిస్తున్నది కూడాను. ఆశియాలోని కమ్యూనిస్టేతర దేశాల్లో ప్రతిఒక్కటి ఏదో ఒక రూపంలో జపాన్ తయారీలను ఉపయోగించుకుంటు న్నాయి. కొద్ది సంవత్సరాల్లో ఈ ఆశియా దేశాలు – కమ్యూనికేషన్ సామగ్రి, రాకెట్లు చోదితాస్త్రాలు, విమానాలు, హెలికాప్టర్లు మందుగుండు సామాను వగయిరాలను జపాన్‌నుంచి కొంటాయి.

బ్రిటన్, తదితర దేశాల్ని కలుపుకుని యూరోపు బలాన్ని చేకూర్చుకుందామని చూస్తున్నది. గత ఏప్రిల్ మాసంలో, లాటిన్ అమెరికా దేశాలు – అమెరికాతో ఆర్థికపరమైన, సాంఘికాభివృద్ధికి సంబంధించిన విషయాల్లో ఒడంబడికలు జరుపుకుని 'కామన్ మార్కెట్'ని ఏర్పాటు చేసుకున్నాయి. అలానే ఆగ్నేయాసియాలోను, ఆఫ్రికా భాగాల్లోను కృషి జరుగుతున్నది.

**కాంగ్రెసువారు—**
**వారి కమ్యూనిస్టు మిత్రులు**

పులిని చూచి నక్కవాత పెట్టుకున్నట్టు మనదేశంలోనే కొన్ని మార్పులు జరిగాయి. జరుగుతున్నాయి. బ్యాంకుల్ని, జనరల్ ఇన్సూరెన్సుని జాతీయం చేయాలని కొందరు కాంగ్రెసువారు ఉవ్విళ్ళూరుతున్నారు. భాషావిషయంలో దేశం విభాజితమైపోయింది. కాంగ్రెసు అజ్ఞలన్నీ శానవాలుగా వున్నాయని గ్రహించిన మొరార్జీ దేశాయ్‌గారు మొదటి తీర్మానాన్ని సవరించవలసిందని అఖిలభారత కాంగ్రెసు కమిటీని కోరారు. కమ్యూనిస్టులకి వారి కాంగ్రెసు మిత్రులకి అధికారాన్ని కైవసం చేసుకోవాలని వుంది. వారు ఈ వాదాన్ని సమర్థిస్తున్నారు. దేశంలో అనిశ్చిత పరిస్థితిని లేకొల్పి వారు ఆశయసిద్ధిని పొందగల్గుతారు. బెంగాల్‌లోను, బీహార్‌లోను వారు దీనిని సాధించారు. ఇంకా తమ చర్యలను వ్యాప్తంచేయాలని తీవ్రంగాకృషిచేస్తున్నారు.

ప్రభుత్వ రంగంలో ఇప్పుడున్న సంస్థలు బాగా పనిచేస్తున్నట్టయితే కొత్తవాటి గురించి ఆలోచించినా బాగుంటుంది. ఉదాహరణకి స్టేట్‌బ్యాంక్‌నే తీసుకుందాం ప్రయివేటురంగంలోని బ్యాంకులంత ఉత్సాహంగా, ఈ బ్యాంకు ఖాతాదార్లను సంతృప్తి పరచలేకపోతోంది. జీవిత భీమాసంస్థ జాతీయం కాకముందు ఇన్సూరెన్సు ఏజెంట్లు నిర్విరామంగా పనిచేసేవారు. ఇప్పుడు వారికి ఉద్రేకం బలిసిపోయి పనిలేకుండా తీరికా లేకుండా ఉన్నారు!

జబల్పూరులో ఏర్పరచిన అఖిల భారత కాంగ్రెసు కమిటీలో కామరాజుగారే గనక లేకపోతే మొరార్జీదేశాయ్‌గారికి బలం వుండేది కాదు. కనీసం మూడు పెద్ద బ్యాంకులు జాతీయం కావాలన్న ఆయన వాదన కొన్ని నిలబడ్డానికి కారణం కామరాజుగారు. అనుభవజ్ఞులు సూచించిన విషయాలు పెద్ద పెద్ద వివాదాల్లో మాటుమణిగి పోడాన్కి ఆస్కారం లేకపోలేదు. భారతదేశం తన వడతను మార్చుకొని జపాన్‌లాంటి అభ్యుదయ దేశాల మార్గాన్ని అనుసరిస్తుందో, లేక ఈ‌ఐప్పు పద్ధతి ఆర్థిక నిర్బరాన్ని అవలంబిస్తుందో కొద్ది నాళ్లో తెలిసిపోతుంది! ●



# అత్తగారూ-అతిథులూ

భానుమతీ రామకృష్ణ

మా యింటి కొక గెస్టురూము కట్టించాలని మావారు చాలా ప్రయత్నం చేశారు...మా అత్తగారు ససేమిరా వద్దన్నారు...ఎందుకంటే ఆమె త్రికాలజ్ఞాని... తిరుపతి వెళ్ళివచ్చే బంధుకోటి మద్రాసు తొంగిమాసి పోతూంటారు...మామూలుగానే బంధువులొస్తే ఓపూట వుండకుండా వెళ్లరు...అలా వెళ్లినా బావుండదు... ఓపూటకైతే ఆ వచ్చినవాళ్లను వంటింటి చావిట్లోనైనా వుంచి పంపించొచ్చు... ఎలాగో సర్దుకుంటారు బంధువులు గనక... యిక ప్రత్యేకంగా గది కట్టించి దానికి బాత్‌రూము వగైరా వసతులన్నీ కల్పిస్తే



యిక వచ్చినవాళ్లు ఓపలంగా వెళ్తారా!—అసలెందుకెళ్లాలి!—ఎక్కడుంటే ఏంలే అనుకుంటారు...పైగా మద్రాసాయె!... వచ్చినవాళ్లు మద్రాసు నాలుగువేపులా చూసి వెళ్లాలి గదా మరి!...గొప్పలకు బోయి ప్రత్యేకంగా గెస్టురూములు కట్టించిన సీతమ్మగారి కొడుకూ, మీనాక్షమ్మ అల్లుడూ, ప్రతిరోజూ తిరుణాళ్లకు మల్లే వచ్చే పోయే గెస్టులతో ఎంత బాధపడిపోతున్నారో మా అత్తగారు కండ్లారా చూసి తెలుసుకున్న సత్యం అది...

పోనీ గెస్టురూములనీ, గెస్టుహౌసులనీ, ప్రత్యేకంగా కట్టించినప్పుడు ఆ గెస్టులు మాత్రం వచ్చివుండి వెళ్తుంటే ఫర్వాలేదు... వాళ్లు వూరికి వెళ్లాక, వాళ్లకు తెలిసినవాళ్లెవరో మద్రాసు వస్తూంటే వాళ్లకు లెటర్లిచ్చి పంపుతారాయె...మావాళ్లింట్లో మంచి గెస్టు రూములున్నాయి...చాలాబాగా కట్టించారు.. మీరు వెళ్లి అక్కడ వుండండి. కావాలంటే మీకు కారు యిస్తాము...అంటూ వాళ్లకు చెప్పింది చాలక ఆ వచ్చే వాళ్లకు కాస్త కారూగట్రా యిచ్చి మద్రాసంతా చూపించి, స్టుడియోలూ, సినిమాస్టార్లనూ చూపించి, అట్లాగే వీలయితే వాళ్లకు మహాబలిపురం కూడా కార్లిచ్చి పంపించి చూపించవలసిందిగా ఆ లెటర్లో వ్రాస్తారాయె.. యీ అవస్థలతోనే గదూ సీతమ్మావాళ్లు చస్తున్నారు!...వాళ్ల కార్లన్నీ వచ్చీపోయే గెస్టులకు తిరగడంతోనేడొక్కులైపోతున్నాయి... తీరా వాళ్లు బయటికి వెళ్లాలంటే కారుండదాయె...యీ విషయాలన్నీ స్వయంగా సీతమ్మ నోట విన్న మా అత్తగారికి బోధివృక్షం క్రింద బుద్ధుడికి కలిగినంత జ్ఞానోదయం కలిగి, జీవితంలో అలాంటిపొరపాటు చేయకూడదని తీర్మానించి, కనిపించిన వాళ్లందరికీ కనికట్టుకుని సీతమ్మ కష్టాలు వినిపించి, ఆ కష్టాలకు కారణాలైన గెస్టురూములు కట్టించవద్దని ప్రచారం చెయ్యడం మొదలెట్టింది... మా వారికి గెస్టురూము లేకుండా యిల్లు కట్టించడం బొత్తిగా యిష్టంలేదు.. కాని వాళ్లఅమ్మగారుండగా అలాంటి ఆధునిక పద్ధతుల్లో యిల్లు కట్టించడం జరగదని వూరుకున్నారు...

మాయిల్లు మొత్తం అయిదు గదులు... అవి గదులుగా కాకపోయినా పెద్ద పెద్ద హాల్స్ అనుకోవచ్చు. మేడమీద రెండు గదులుపోగా, క్రిందిభాగంలో వెనకవేపు ఒక డైనింగ్ హాలూ, డ్రాయింగ్ హాలూ, దాన్ని అంటిపెట్టుకుని చిన్నగది. ఆ చిన్నగది బహుముఖద్వారాలు గలది ... గుంతకల్లు జంక్షన్‌లాగా దానికి విపరీతమైన రాకపోకల తాకిడి ఎక్కువ...ఆ చిన్నగది యింటికి ముందువేపే వున్నది. అంటే సింహద్వారం అనేది ఆరూముకే పెట్టించారు మా అత్తగారు...పిట్టకొంచం కూతఘనం అన్నట్లు రూము చిన్నది, సింహద్వారం చాలా పెద్దది.. అది పడమటివేపు సింహద్వారం కావడంవల్ల ఆ వాకిలి ఎప్పుడూ మూసేవుంచుతారు మా అత్తగారు...దక్షిణంవేపున్న వరెండానుండే రాకపోకలు—సింహద్వారం ముందున్న పోర్టిగోలో కారు దిగుతూనే వరండాలో ప్రవేశిస్తాం...అసలా చిన్నగదికి అంత పెద్ద సింహద్వారం అనవసరం...మా వారూ నేనూ వాకిలి అక్కడ ఒద్దంటే కావాలంటే అనుకుంటూ ఘర్షణపడ్డ సందర్భంలో మా అత్తగారు తీర్పుచెప్పి పెట్టించిన సింహద్వారం అది...

ఆ సింహద్వారంనుంచే స్వాగతసత్కారాలతో అన్నీ లోపలికి తోసింటారు మా అత్తగారు.. మళ్ళీ ఆ తర్వాత వాళ్ళని తెరిచిన పోసిన పోలేరు...

అసలు మా యిల్లు మావారూ, నేనూ, మా అత్తగారూ కలిసి 'చిన్నపిల్లలు కొట్టే చేతులతో చెరిపివేతలతో ఎక్కాలు వ్రాసినట్లు కట్టినయిల్లు ... మొత్తంమీద యిల్లు బాగున్నా, విడివిడిగా ఒక్కోగది ఒక్కో విధంగా వుంటుంది...ప్రతిరోజూ మావారు వణుగుతూండే విషయం అది...మా యిల్లు కట్టినతర్వాత చూచినవాళ్ల వ్యాఖ్యనుబట్టి ఒక్కొళ్లకు ఒక్కొక్క విధంగా కనిపిస్తుంటుంది మాయిల్లు...కొందరికి పెద్దకాలేజీ బిల్డింగల్లే, మరికొందరికి నర్సింగ్‌హోమల్లే, యింకా కొందరికి ఆఫీసు బిల్డింగల్లే, రకరకాలుగా కనిపించినా యిల్లులాగా కనిపించేది మా అత్తగారికిమాత్రమే...

యింటికి వేరుగా వెనకాలవున్న తులసి కోట, యింటి సింహద్వారం ముందున్న లక్ష్మి సిమెంట్ విగ్రహం, ఒకటి కొకటి ఎదురు బొదురుగా వున్నాయేగాని, సింహద్వారం బంధించడంతో వాళ్లిద్దరికీ చూపుల్లేవు... మొత్తానికి వాళ్లిద్దరికీమధ్య మా అత్తగారు వున్నారు గనక అటు తులశమ్మకు పూజలూ, యిటు లక్ష్మీదేవికి మాలలూ అందుతూనే వుంటాయి...

మా యింటికి బంధువులుగానీ, స్నేహితులుగానీ, తెలిసిన వాళ్లుగానీ వస్తే ముందున్న ఒక్కగానొక్క సింహద్వారం గదిలోకి పెట్టె బేడాతోసహా వెళ్లిపోతుంటారు అలవాటుగా... సాధారణంగా మా బంధుకోటికీ, మిత్రకోటికీ, అందరికీతెలుసు మా యింట్లో ఆ ఒక్కరూము తప్ప వచ్చినవాళ్లుండేందుకు వేరేచోటులేదని...

ఆగదికి బహుముఖాలు ఎలా వున్నాయో దాని ఉపయోగాలుకూడా అంతే...ఆగది మా గెస్టురూము, నా మేకప్‌రూము, మా చెల్లెలు పిల్లలు చదువుకునే రూము, అప్పుడప్పుడూ యింట్లో పండుగలూ, పార్టీలూ వచ్చినప్పుడు భోజనాలకు హాల్లో కూర్చుంటారు గనక హాల్లో సోఫాలు కుర్చీలూ, డైనింగ్ హాల్లో వుండే టేబిలూ కుర్చీలూ అన్నీ ఆ చిన్న రూములోకి నెట్టేస్తారు...అలాంటప్పుడా గది గొప్ప గోడౌన్‌లా కనిపిస్తుంటది...



నా మేకప్ టేబిలుపైన పెద్ద అద్దం గోడకు ఫిక్స్‌చేసివుంది...అద్దం చుట్టూ లైట్లు వుంటాయి, మేకప్ వేసుకోడానికి అనువుగా వుండేందుకు...నేను షూటింగ్‌కు వెళ్లాలన్న రోజు తెల్లారుగట్ల మా అత్తగారు లేచి యింటికి వచ్చిన బంధువుల్ని, పిల్లా మేకతో సహా లేపి, యింకా నిద్ర మత్తు వదలక తూగుతూ లేచేవాళ్లను విరారంతా అట్లా బయటికి రండర్రా అది మేకప్ వేసుకోవాలె...అది షూటింగ్‌కు వెళ్లాక మీరు లోపలికి ఒద్దురుగాని అంటూ వాళ్లందర్నీ చెట్టుకొకళ్లనూ, పుట్టకొకళ్లనూ తోట్లోకి తరుముతారు... వాళ్లకూ ఆ ఒక్కరూము తప్ప గత్యం తరంలేదని తెలుసు...పాపం నిద్రకండ్లతో లేచి తూగుతూ నడిచేవాళ్లను చూసి నాకు జాలివేసేది...పోనీండత్త వాళ్లను ఒకవైపు వుండిపోనివ్వండి అన్నాను ఒకసారి మా అత్తగారు ఒద్దంటున్నా వినకుండా...నేను లైట్లువేసి మేకప్ వేసుకోడం చూచి, వచ్చిన బంధుకోటి పిల్లలూ, తల్లులూ నాచుట్టూ చేర్రారు...పిల్లలు నా మేకప్ సామాన్లు, బ్రెష్‌లూ లాగి పోట్లా పెట్టుకోడం, పౌడరూ, పేడూ, అద్దం, అన్నీ కింద పడే త్వరం మొదలెట్టారు...వాళ్ల తల్లులు ముద్దుగా తన్ను అంటూ వాళ్లను దండి స్తున్నట్లే నటిస్తూ ఆ పిల్లలూ, ఒక స్పటకూ ఎక్కడ కొట్టారని తన్ను అడు గుతూ, వాటిని పరీక్షించడం మొద లెట్టారు...మా అత్తగారురాక తప్పులేదు... అద్దంలో అంతమంది కనిపించడం, పిల్లలగోలా, అన్నీ కలిసి నా మేకప్ ఖండాలం జేశాయి...మా అత్తగా రన్నారు... 'నే చెప్పానుగదే! వాళ్లందర్నీ చుట్టూవుంచితే కొత్వాల్‌చావడల్లే వస్తువులన్నీ ఎదబెడతారని అంటూ కైకేయి సీతాలక్ష్మణ సమేతంగా రాముణ్ణి అడవులకు పంపించినట్లు వాళ్లందర్నీ తోట్లోకి తోలే సింది...యిక మాచెల్లెలు పిల్లల చదువు కూడా ఆగదిలోనే...గట్టిగా పాఠాలు చదువు తూంటారు. పరీక్షల పైమైతే మరీ కష్టం...మా చెల్లెలు కూతురు చిట్టికి చదువంటే చాలా అయిష్టత...పలకమ గొంగళి పురుగల్లే చూస్తుంది...దానికొక ప్రైవేటు టీచర్ను ఏర్పాటుచేశాము చదు వంటే శ్రద్ధలేదుగదా అని...ఆ టీచరు పాపం చాలామంచిది, ఓర్పుగలది ... రోజంతా స్కూల్లోపనిచేసి సాయంకాలం చిట్టికి పాఠం చెప్పడానికి వస్తుంది కాళ్లీడ్చుకుంటూ — టీచరు రాగానే ఆడుకుంటూ, నవ్వుతున్న చిట్టిముఖం స్విచ్ ఆఫ్‌చేసినట్లు ముడుచుకు పోతుంది...ఆ టీచరుకూడా దాని తత్వం తెలుసుకుని వస్తూనే దాన్ని చదువుకోమని బాధపెట్టేబదులు, దువ్వెన తీసుకురమ్మని చిట్టిని కూర్చోబెట్టి తల శుభ్రంగా దువ్వి ఒకటో రెండోపేలుంటే ఆనితీసేసి చక్కగా జడవేసేది.. పూలంటే చిట్టికి ప్రాణం...



తీసకొచ్చేసరికి స్కూలుకొని రెడీగా పెట్టేది... టీచరు అప్పాలుకూడా కట్టి తల్లో పెట్టేది.. దీనికంతా ఒకగంట పట్టేది ... మిగతా అర గంటలో పలకవెదకడంతో పదినిమిషాలు తీసు



# అత్తగారూ...

కు నేది — బలపం మంచి అయిదు నిమిషాలు... తర్వాత అతికష్టంమీద టీచరు కెదురుగా కూర్చుండేది చిట్టి ... ఏరోజు పాఠం ఆరోజు మర్చిపోయే చిట్టికి ప్రతిరోజూ చెప్పిందే చెప్పడం టీచరుకు అలవాటు... పాఠం మొదలెట్టేముందు తనకెన్ని తలలు అని అడిగేది టీచరు...మొదట మొదట్లో 'నాలుగు' అనేది చిట్టి...తర్వాత 'రెండు' అంటూ వచ్చింది ... నాలుగునెలల తర్వాత ఒకే తల అంటం నేర్చుకుంది ... మనిషి నోట్లో ఎన్ని పళ్ళుంటాయమ్మా అని అడిగితే 'అయిదు' అనేది చిట్టి తడుము కోకుండా ... చిట్టి చిన్నతమ్ముడు ఫక్కున నవ్వి నానమ్మ నోట్లో కాదే...మనిషి నోట్లో పళ్ళు...టీచరు అడిగేది ... అని గేలిచేసే వాడు...వాడు అఘాయిత్యుడు ... యింటినిండా



బంధువులుండేప్పుడు టీచర్నీ చిట్టినీ ఏ చెట్టుకిందికో తరిమేసేది మా అత్త గారు...వర్షం పడుతూంటే మాత్రం వంటింట్లో చదువుకానేవాళ్ళు—మా యిల్లు తోటలో వుండడంవల్ల వర్షాకాలంలో కప్పల బాధ ఎక్కువగా వుంటుంది...యిల్లు ఎత్తులో కట్టినందువల్ల వేరుగా పోట్లోకి గెంతుతూంటాయి కప్పలు...అయితే యిట్లాంటి కొన్ని ఒకే లాంగ్‌జంప్‌ చేసి సోఫాల్లో ఒచ్చి కూలబడేవి...కొన్ని సోఫాల క్రింద, కుర్చీల క్రింద మరికొన్ని బల్లల క్రింద తలుపుల వెనకమూలల్లో స్థిరనివాసము ఏర్పరచుకున్నాయి...యిక మా రెస్టు రూము నిండా కప్పలుండేవి...వాటితోపాటు బంధువులూ, గెస్టులూ రైళ్ళల్లోంచి మోసు కొచ్చిన నల్లులూ, మా చిట్టి తల్లో పేలూ, ఎప్పుడూ గోడవున లాగా బల్లలూ కుర్చీలూ ఆ గదిలోలోపి పడెయ్యడంవల్ల వాటికింద చేరిన బొద్దింకలూ, సాలెపురుగులూ వాటిని వేటాడే బల్లులూ మధ్య మధ్య రెండు ఎలుకలూ తిరుగుతుండేవి అతిథులకు అలజడి కలిగిస్తూ...వీటన్నిటివీగాదా ఒకపంది కొక్కు తిరుగుతుండేది ఎవరికీ దొర క్కుండా...దాన్ని పట్టడానికి మా అత్త గారు అనేక ఎన్నుగడలు పన్నారు...బోను పెట్టి లాభంలేదని దాన్ని చంపించేందుకు ప్రయత్నించారు ... కాని పందికొక్కును చంపితే ఉబ్బసం వస్తుందని ఎవరో చెప్పారు...దాంతో పందికొక్కు విషయం పట్టించుకోడం మానేశారు మా అత్త గారు...

అమధ్య ఒకసారి యింటినిండా బంధువు లొచ్చారు అన్నివూళ్ళనుంచీ, మా ఆడబిడ్డ చిన్నకొడుకు పెళ్ళికి.. అదేసమయంలోమద్రాసులో చాలామంది బంధువుల యిండ్లల్లో గూడా పెండ్లిళ్ళు ఒచ్చాయి ఒకేసారి ... మా యిల్లంతా కిటకిటలాడిపోయింది బంధువులందరితోనూ ... ముందు నేనున్న రూము నిండుగర్భిణిలా కనిపించింది...ఆ రూమంతా పసిబిడ్డలు, వాళ్ళతల్లులూ,



# అత్తగారూ....

మునలివాండ్లూ, బీరువాలూ, కుర్చీలూ, బల్లలూ వగైరాలతో నిండిపోయింది ... మిగతా బంధువులందరూ హాల్లో సర్దుకున్నారు చాలావరకు ... డైనింగ్‌హాలంతా పెండ్లి సామాన్లతో నిండిపోయింది ... హాల్లో అంతా కూర్చుని భోంచేయాలి గనక అక్కడుండే ఫర్నిచర్ గూడా ముందు రూములోకే తోశారు...ఎలాగో ఆ కుర్చీలకిందా, బల్లలకిందా బీరువాలమధ్య పసిబిడ్డల్తో అవస్థపడుతున్న బంధువులకు, యింకా రైలు దిగివచ్చే బంధువుల్ని చూసి భయం వేసింది ... ఏంజేస్తారు! ఎలాగో సర్దుకోండర్రా! ఒకరోజు రెండురోజులేగా! అంటూ మా అత్తగారంటూంటే బిడ్డల్ని కుర్చీలకిందికితోసి పడుకోబెడుతూ వాళ్ళు

మొట్టికాయ తగుల్తోంది—

పగలంతా ఎండకాచి ఉక్కపోయడం మొదలెట్టింది...ముందు రూములో ఫేన్ కూడా మా అత్తగారు వేయించనివ్వలేదు గెన్నులేగదా వుంటూంటారని. కావాలన్న ప్పుడు టేబిల్ ఫేన్ పెట్టుకోవాల్సిందే... పెళ్ళి సమయం గనక ఆ ఫేన్ యిస్తే యిక 'ఆఫ్' చేయరని తీసి లోపల పెట్టించారు మా అత్తగారు. సాయంకాలానికి నెమ్మదిగా ఉరుములు మెరుపుల్తో వర్షం ఆరంభం అయింది...హాల్లో పిండిముగ్గులూ, రంగవల్లులూ వేయాలంటూ మా అత్తగారు హాల్లో వుండేవాళ్లను గూడా ముందు రూములోకి తోసేశారు ... బయట వర్షం పడుతోంది గనక అలా తోటలోకి వెళ్దామన్నా వీల్లేదు...విధిలేక అడ్డమగా ఒకర్నొకరు తోసుకుంటూ వెళ్ళి పిటీబస్సుల్లో



యింకా ఒదిగి కూర్చోడానికి ప్రయత్నించారు...కుర్చీలు కాస్త వదిలేస్తే కింద పడుకున్న బిడ్డలగతి ఏమవుతుందో నన్నంత భయంగావుండేది ... భోజనాలు చేయడానికి హాల్లో చోటుచాలక చిన్నపిల్లలూ, బిడ్డతల్లులూ ముసలివాళ్లూ ఆ రూములోనే కూర్చుండేవాళ్లూ భోజనాలకు.. ఒకసారి వంటమనిషి వడ్డిస్తూ, నేతిచుక్కమీద కాలుజారి ఎవరి విస్తట్లోనో పడ్డాడు ... మన్నుగావుండే 'మొసైక్‌ఫ్లోర్'మీద పిల్లలు నీళ్ల లోటాలు దొర్లించుకుని ఆ నీళ్ల మడుగుల్లో వాళ్లే జారిపడి ఏడుస్తుంటారు...

యిక పక్కనే వున్న బాత్‌రూము సంగతి చెప్పక్కర్లేదు— ఆ బాత్‌రూము మేడమెట్లకిందకట్టడంవల్లఎత్తు తక్కువగా వుంటుంది ఓవైపు...పొడవుపాటి మనుషులు చూసుకోకుండా లోపలికెళితే టక్కున తలకు లాగా అంగుళం చోటులేని ఆ గదిలో ఒంటికాలు మీద నిలబడ్డారు...ఆ గదికి కిటికీలులేవు వాకిళ్లు తప్ప ... ఆ వాకిళ్లన్నీ బంధించి వుండడంతో లోపల వుండే మనుషుల వేడికి గదిలో ఆవిరిపుట్టుకొచ్చింది... వాకిళ్ల తీయడానికీ లేదు ... అలా తీస్తే బంధువుల సామాన్లన్నీ బజార్లో వుంటాయి.. గాలిలేక అప్పటికే గదిలో సాతిక మంది వుడుకుతుంటే పైన సాతిక మంది హాల్లో నుంచి రావడంతో లోపల పిల్లలు వూపిరాడక అవస్థపడుతూ ఎవరో బయటికి రాబోయారు గదిలో నుంచి ... మా అత్తగారు తక్షణం వాళ్లను లోపలకు తోసేశారు ముగ్గులు తొక్కేస్తారంటూ ... అప్పుడే రెండు టాక్సీల్లో మరి కొందరు బంధువులు... 'రండి, రండి' అంటూ మా అత్తగారు వాళ్లకు స్వాగతం చెబుతూ గెస్టు రూము చూపించారు... ముగులు తొక్క-

కుంటా వెళ్ళమని చెబుతూ ... నాలుగు ట్రంకు పెట్టెల్తో దిగిన ఆ బంధువులు అలవాటు ప్రకారం రూములోకి వెళ్ళారు... వాళ్ళింకా పూర్తిగా రూము లోపలికి వెళ్ళక ముందే తలుపులేసి బయట గడియ బెట్టారు ముగ్గుల కోసం ... సడన్‌గా కరెంట్‌బోయి లైట్లారిపోయాయి... మరుక్షణం రూములో మంచి కెవ్వున పసిబిడ్డ కేక వినిపించింది... దాని వెనకే 'చచ్చాను బాబోయ్' అంటూ యింకోళ్ళరిచారు, 'అమ్మో నా చెయ్యి విరిగింది' అంటూ ఒకావిడ గట్టిగా అరిచింది పిల్లాజెల్లా కేర్ కేర్ మంటూ ఏడుపులూ పెడబొబ్బలూ ఆ కలకత్తా చీకటి గదిలోంచి దబాను కొచ్చాయి...మా అత్తగారు తలుపు తీయకుండానే ఏమిట్రా ఏం జరిగిందీ, ఏమిటా కేకలూ?...అంటూ బయట్నుంచే అరిచారు చీకట్లోకి...

'బాబోయ్ లోపల చచ్చిపోతున్నాం ... తలుపు తియ్యండి మీకు పుణ్యం వుంటుంది' అంటూ ఆడవాళ్ళ ఆర్తనాదం, తలుపులు బాదడం వినిపించాయి.

'అమ్మా' అంటూ మా వారు అప్పుడే బయట్నుంచి వస్తూ కేకేశారు...మరుక్షణం లైట్లు వెలిగాయి... మా వారు పరుగెత్తుకొచ్చి గెస్టు రూము తలుపు గడితీసేశారు.. తక్షణం వందమైళ్ళ స్పీడ్‌లో, లోపలున్న బంధువులంతా వచ్చి మా అత్తగారు కష్టపడి వేయించిన ముగ్గుల మీద పడ్డారు.. అందులో కొందరికి మైకం వచ్చి పడిపోయారు... మా వారు వాళ్ళమ్మగార్ని చాలా కోప్పడ్డారు... తన చేతిలో వున్న పత్రిక చూపుతూ 'చూడమ్మా మీ వెంకన్న ఏం చేశాడో!... నువ్వూ అదే పని చేశావ్ యిప్పుడు... తిరుపతి కొండమీద 'క్యూ'లో పదిహేడుమంది చచ్చిపోయారట... నువ్వు వీళ్ళందర్నీ గూడా అలాగే'... అని మా వారు అంటూండగానే 'అబ్బబ్బ! ఏం మాటల్రా అవి పెళ్ళింట్లో' ... 'ఎంత ఘోరం! ఎంత ఘోరం! ... ఏదో పెద్ద అపచారం జరిగింది ... వెంకన్నకు కోపం వచ్చింది...'

'వెంకన్న కోపం సంగతి అట్లావుంచు... ముందు నువ్వు యింతమంది మనుష్యుల్ని ఈ విధంగా ఒకేరూములోవేసి చంపుతున్నావే! నిన్నేమనాలి ... గెస్టురూము కట్టిద్దామంటే ఒద్దంటివి ... యిట్లా యింతమందిని ఒకేరూములో వేసివుంచావని తెలిస్తే పోలీసులొచ్చి నీమీదకూడా కేసు పెడతారమ్మా! ... అని మావారంటూంటే మా అత్తగారు గుండెలు బాదుకుంటూ 'ఓయమ్మ! పోలీసులే! ... ఓయి నాయనోయ్ యిదేమిట్రోయ్...పుణ్యానికిపోతే పాపం ఎదురొచ్చిందట ... పోలీసులూ రావద్దు పాడూ రావద్దు ... వాళ్ళందర్నీ ఎక్కడైనా విడిది చూసి పంపిద్దాం ఓపూటకు ... యీ పెళ్ళయ్యాక పీయిస్తాం...వెంటనే చుట్టాల గదులు కట్టించు ... యిక నేను ఒద్దంటే ఒట్టు' ... అన్నారు పోలీసులంటే భయపడే మా అత్తగారు గాభరాపడిపోతూ...

'ఆ! ... అదీ ... దేవుడందరికీ ఒకావొక సమయంలో కనువిప్పు కలగజేయడానికే యిలాంటివి... చేస్తూంటాడు...' అంటూ మావారు పెళ్ళికొచ్చిన బంధువులందరికీ విశాలమైన విడిది ఏర్పాటుచేశారు కొద్ది దూరంలో — మొన్నీమధ్యే మా అత్తగారు చెప్పిన చుట్టాల గదులు (గెస్టురూమ్సు) కట్టించడం మొదలెట్టారు యింటి వెనక వేపు మావారు... ●

# దేశమంతటా దివ్యకాంతుల దీపావళి

ఒకో ప్రాంతానికి ఒకో పండుగ పెట్టింది పేరుగా వుంటుంది. ఏ కొన్ని పండుగలు మాత్రమో అందరికీ ఒకేసారి కలిసివస్తాయి. అందులో దీపావళి ఒకటి. వారూ వీరూ అనకుండా దేశప్రజలంతా జరుపుకొనే పండుగ దీపావళి.

**కొత్త సంవత్సరం**

గుజరాతీ వారికి, మార్వాడీ వారికి ఈ పండుగ చాలా పెద్దది వారు దీనిని కొత్త సంవత్సరంగా పరిగణిస్తారు. వ్యాపారస్తులు పాత లెక్కలు కట్టి పెట్టి కొత్త పుస్తకాలు తెరుస్తారు. ఈ ప్రాంతాల్లో బాగా వున్న దుకాణాలతోపాటు కొత్తగా చిరావర్జు పుస్తక దుకాణాలు కూడా వెలుస్తాయి! లక్ష్మీదేవిని పూజిస్తారు. నైవేద్యాలు సమర్పిస్తారు.

కొన్ని ప్రాంతాల్లో ఈరోజున తప్పని సరిగా జూదమాడతారు. జూదంలో నెగ్గినా ఓడినా సంవత్సరం పొడుగునా విజయమేనని, సుఖ సంతోషాలు కలుగుతాయని, అదృష్టం కలిసివస్తుందని వారి నమ్మిక!

**ముగ్గుల పండుగ**

మహారాష్ట్రుల కిది ముగ్గుల పండుగ. వీధి గుమ్మాలు అలంకరిస్తారు. ప్రతి యింటి ముందూ రంగవల్లికలు తీరుస్తారు. కేవలం ముగ్గులే కాకుండా రంగు రంగుల పవుడర్లతో బొమ్మలని చిత్రించి చూడ ముచ్చటగా అలంకరిస్తారు. ఇందుకు బొంబాయినగర వీధులు ప్రత్యేకంగా చెప్పదగినవి. విద్యుద్దీపాల కాంతిలో చిత్ర విచిత్రాలయిన ఏర్పాట్లు మనం అక్కడ చూడ గల్గుతాం.

కాళికాదేవికి అమావాస్యకి దగ్గర సంబంధముంది. కొన్ని ప్రాంతాల్లో కాళికాదేవిని పూజించి, విగ్రహాన్ని నదిలో కలిపి దీపారాధన చేస్తారు.

**ఎవరిది దీపావళి ?**

దీపావళి పండుగను గురించి మన పురాణాలు, ఇతిహాసాలు రక రకాలుగా నిర్వచిస్తున్నాయి అవి చెప్పే ప్రతి కథా దీపావళి విశిష్టతని ఇనుమడింపజేసేదిగానే వుంటున్నది అనేక సందర్భాలు దీపావళికి కలిసి రావడం ఆ పండుగకి మరింత శోభ తీసుకు వచ్చింది.

పాదుకా పట్టాభిషేకానంతరం రాముడు భరతుడ్ని కలుసుకున్న 'భరత్ మిలాప్' దిన మిదేనట!

శ్రీరామ పట్టాభిషేకం కూడా ఈరోజే!

విక్రమాదిత్యుని పట్టాభిషేక మహోత్సవం ఈనాడే!

బలిచక్రవర్తి రాజ్యదానం చేసిన పుణ్య దినం ఇదే!

జైన మతాచార్యుడయిన మహావీరుని నిర్వాణం ఈ రోజునే!

యమునానది సోదరుడు యమధర్మరాజుకు విందు చేసిన రోజు కూడా ఇదే!

**బలిచక్రవర్తి వస్తాడు ?**

'మూడు దినాలు మూడు పాదాలతో నా రాజ్యాన్ని ఆక్రమించావు గనుక, ఈ మూడు రోజులూ బలి రాజ్యంగా ప్రజలు గుర్తించాలి. ఈ మూన్నాళ్లలో దీపదానం చేసిన వారి యిళ్లలో లక్ష్మి కాపురముండాలి' అని బలిచక్రవర్తి విష్ణుమూర్తిని వర మడిగి గ్రహించినట్లు చెబుతారు. మహారాష్ట్రులు ఈ కథకి ఎక్కువ ప్రాధాన్యత నిస్తారు. వారు వాకిళ్లలో ముగ్గుల నలంకరించడం బలిచక్రవర్తి రాకకోసమేనని అనడం కూడా వుంది!

**చెవి కమ్మల దొంగ—నరకాసురుడు**

మన ఆంధ్రులు దీపావళికి నరకాసుర వధ కథానుస్తావు. నరకాసురవధనే చాల రకాలుగా చెబుతుంటారు :

నరకాసురుడు అదితి చెవి కమ్మలని దొంగిలించాడట. శ్రీకృష్ణుడు అతన్ని తెగటార్చి దేవతల్ని సంతృప్తి పరిచాడట! ఇది ఒక కథ.

నరకాసురుడు స్త్రీలోలుడు విశ్వకర్మ కూతురిని కూడా బలాత్కరించాడు. శ్రీకృష్ణుడు కలగజేసుకుని అతన్ని హతమార్చి, విశ్వకర్మ కుమార్తెతో సహా పదహారువేలమంది స్త్రీలను నరకాసురుని చెరనుండి విడిపించాడు. (కృష్ణుని పదహారు వేలమంది భార్యలూ వీరే అయివుండాలి!) ఇది మరో కథ.



'బాణసంచాతో మానవాకృతులు' (ఫోటో: విప్పాటి గిరిధర్, మద్రాసు)

నరకాసురుడు లోకకంటకుడుగా తయారై, దేవతల్ని మానవుల్ని హింసించడం, శ్రీ కృష్ణుడు సత్యభామా సమేతంగా యుద్ధానికి తరలివెళ్ళి పీడవిరగడ చేయడం మనం మామూలుగా చెప్పుకునే కథే!

నరకాసురవధ గురించే ఇన్ని కథలున్నప్పుడు ఈ దీపోత్సవ ప్రాశస్త్యాన్ని దేశమంతా రకరకాలుగా చెప్పుకోవడంలో వింతలేదు కొన్నిటికి ఆధారాలుంటాయి. కొన్నిటికి వుండవు.

## ఆచార వ్యవహారాలు

త్రయోదశి మొదలుకొని విదియవరకు ఈ అయిదురోజులూ దీపావళిగానో, దివాలీగానో లేక దీపోత్సవంగానో సాంప్రదాయానుసారంగా మనదేశంలో పుణ్యదినాలుగా వ్యవహరించ బడుతున్నాయి

త్రయోదశినాడు యముడ్ని పూజించడం, చతుర్దశినాడు దీపదానం చేయడం, అమావాస్యనాడు తర్పణాలు విడవడం, పాడ్యమినాడు పితృగణానికి దారిచూపడానికి పొలిమేరల్లో గడ్డిబొమ్మలు నిలపడం, విదియనాడు మళ్ళీ యముడ్ని పూజించడం – ఒకఆచారం

ఇలా ఆచరించినట్లయితే నరకం వుండదని, పితృదేవతలు సంతృప్తి పడతారని అంటారు. 'నరకాసురుడను దుష్టరాక్షసుడు గలడు. వానిని వధించినందుకు దీపావళి అయ్యెను' అనేదానికంటే, నరక విముక్తి కోసం ఈ పండుగ ఏర్పడిందని అనుకోవడం సబబని కొందరి అభిప్రాయం!

## దివ్యమైన దీపావళి

దీపోత్సవాన్ని గురించిన కథలు ఎన్ని రకాలుగావున్నా - దీపాలు వెలిగించడం, బాణాసంచా కాల్చడం లాంటివి దేశమంతా దాదాపు ఒకేరీతిగా ఆచరిస్తున్నారు.

పదకొండవ శతాబ్దంలో వచ్చిన అల్—బెరూనీ అనే అరబ్ యాత్రికుడు మన దేశంలో దీపావళి గురించి తన గ్రంథంలో ఎంతగానో ప్రశంసించాడు మన దీపావళి విదేశీయులను అత్యంతంగా ఆకర్షించిందని చెప్పడానికి ఇదొక ఉదాహరణ!

పాశ్చాత్యదేశాలలో మనలాగా ప్రమిదలు వెలిగించినా వెలిగించకపోయినా ఏదో ఒక సందర్భంలో ఘనంగా ఈ దీపోత్సవాన్ని జరుపుకొంటున్నారు.

ఇటువంటి పండగలు దేశం ఆరోగ్యానికి, ఐశ్వర్యానికి ప్రతీకగా నిలుచుంటాయి!

—సీతరాజు

# మూన్ రేకర్ -5.

## జేమ్స్‌బాండ్ బొమ్మల సీరియల్




మా 'చీఫ్' డోవర్ దగ్గర జరుగుతున్న ఒక విశేషం గురించి చెప్పాడు. అక్కడ సర్‌హ్యూగో (డ్రాక్స్) ప్రపంచంలో కెల్లా శక్తివంతమైన రాకెట్ కడుతున్నాడు.

సప్లయి మంత్రి శాఖకి చెందిన రక్షక భటాధికారితో ఒక శాస్త్రజ్ఞుడు ఒక 'పబ్' (కొన్ని పానీయాలు అమ్మేచోట)లో పోట్లాట పెట్టుకుని అతన్ని చంపేసినట్లున్నాడు. తర్వాత ఆత్మహత్య చేసుకున్నాడుట.

రాకెట్ స్థావరానికి కార్లో వెడుతూ, 'గాలా' అనే అమ్మాయికోసం ఒక శాస్త్రజ్ఞుడూ, రక్షక భటాధికారీ చచ్చేదాకా యుద్ధం చేసుకోవటం ఏమిటని అనుకున్నాను.




"ఇక్కడ తుపాకి దెబ్బతిని చచ్చిపోయాడే మేజర్‌టాలన్— అసలేమిటి జరిగింది?"

"అందరిలాగే బీర్ తాగుతూ ఉన్నాడు. ఇంతలో ఈ జర్మన్ పెద్దమనిషి అన్నాడు—"

"నేను గాలా బ్రాండ్‌ని ప్రేమిస్తున్నాను. నీకు అది దక్కదు!"

"అందుకని మేజర్ టాలన్‌ని కాల్చి తను ఆత్మహత్య చేసుకున్నాడు."




"అయితే జర్మన్‌రాకెట్ శాస్త్రజ్ఞుడు గాలా అనే అమ్మాయి కోసం మేజర్‌టాలన్‌ని చంపి తర్వాత తనని తానే కాల్చుకున్నాడా?"—

"తమాషా ఏమిటంటే, తనని తాను కాల్చుకునేముందు ఈ జర్మన్ 'హెయిల్' అని అరిచాడు. ఆ తెలివిమాలిన మర్చిపోయేట్లు లేరు వాళ్ళు, [illegible]"—

("ఈ అమ్మాయి గాలా గురించి కనుక్కోవాలి.")




"గాలా అనే అమ్మాయా? (స్కాట్లాండ్) యార్డ్‌లో వాలన్స్‌తో మాట్లాడితే మంచిది—"

యార్డ్‌కి వెళ్ళాను......

"నిజానికి ఆమె మా స్పెషల్ బ్రాంచ్‌కి చెందిన అమ్మాయిలలో ఒకర్తె"—

—"ఈ రాకెట్ వ్యవహారం మొదలయినప్పటి నుంచీ డ్రాక్స్ ప్రయివేట్ సెక్రెటరీగా వేయించాను"




"క్షమించండి, కాని మీ 'ఆపరేటివ్'గా పని చేస్తున్న మిస్ బ్రాండ్ ఇద్దరు మగవాళ్ళు తనని గురించి పోట్లాడుకుని చంపుకుంటే ఎలా ఊరుకుంది?'

పబ్‌లో చనిపోయిన అతను సుఖంగా సంసారం చేసుకుంటున్నాడనీ, అతన్ని చంపిన జర్మన్‌తో తనకి అంతగా పరిచయం లేదనీ గాలా బ్రాండ్ అంటుంది.

"చచ్చిపోయిన రక్షకభటాధికారి బదులు నన్ను వేస్తారని హఠాత్తుగా నాతో చెప్పారు."

ఎందుకంటే, నాలుగు రోజుల్లో మూన్‌రేకర్ రాకెట్‌ని ప్రయోగిస్తారు.




మంత్రివర్గం సమాలోచన సందర్భంలో ప్రధాని మూన్‌రేకర్ ఏ తేదీ ప్రయోగిస్తారో ప్రకటించారు.

"కాని, ప్రధానమంత్రి గారూ, మా సప్లయి మినిస్ట్రీ వారికి ఇక్కడ ఏదో వింతగా ఉంది. అక్కడ ఏదో కనుక్కున్న మా మనిషి నాకు రహస్యంగా రిపోర్టు ఇద్దామని సిద్ధమయ్యాడు. రిపోర్టు ఇచ్చేలోగా అతన్ని చంపేశారు—"

"దానిని గురించి ఒక ప్రత్యేక 'శోధకుడు' పనిచేస్తున్నాడు. కాని, రాకెట్ పయికి వెళ్లి తీరాలి. మన పరువు దానిమీద ఆధారపడి ఉంది!"

(ఇంకా ఉంది)

దీపావళి కథల పోటీలో రెండవ బహుమతి రు. 900 లు పొందిన కథ



# చెయ్యను గాక చెయ్యను

మొక్కపాటి శివాజీ

[illegible] రోజంతా ఆఫీసులో కాగితాలు వ్రాసి వ్రాసి విసిగిపోయిన ఘటాల్ని కూడా, పైకి రావాలనే ఆశ తిన్నగా యింటికి పోనిచ్చేదికాదు. అంతవరకు మనతో పాటే చేసేవారెవరికీ లేవన్ని అర్హతలు సంపాదిస్తే వన్నా, యింతకన్న మంచి ఉద్యోగం దొరుకుతుందేమోనని ఆశ! 'నీకు పై ఉద్యోగం ఇవ్వము' అని చెప్పదలుచుకున్న మహోన్నత వ్యక్తి నోట్లోంచి రాబోయే మాటల్ని మనో అర్హతల బలంతో వెనక్కి నెట్టివేద్దామని...ధ్యేయం. అయితే ఏమి లాభం! శక్తిలేని ప్రజాస్వామ్యంలో, పైకిరావడానికి

కలించవలసినది 'సిఫారసు'మంత్రం ఒక్కటే నని, అది మనదగ్గర లేనప్పుడు, యెన్ని డిగ్రీలు, డిప్లొమాలు యెన్ని ఉన్నా ప్రయోజనం లేదనీ, నాకు తెలిసి వొచ్చేసరికి చాలా కాలం పట్టింది...

ఈ కిటుకు తెలియని రోజులనాటి సంగతి. ఆఫీసునుంచి తిన్నగా యింటికిపోక, యిక్కడికి అక్కడికి వెళ్ళి, ఇవీ అవీ చేర్చుకుని ఆలశ్యంగా యింటికిపోవడం నాకు కొన్ని సంవత్సరాలుగా అలవాటు. ఇల్లు చేరేటప్పటికి ...అందరూ నిద్ర!

మా ఆవిడ! ఆవిడకు అసలే నిద్ర. పట్టపగలైనా, వీలైనంతసేపు నిద్రపోడం ఆవిడ జీవితాశయం. ఈ నిద్రపోవడం అనేది, ఆమె విషయంలో ఒక నియమం... కాపరానికి వొచ్చిన కొత్తలో వాళ్ళనాన్నగారు, రెండ్రోజులకొకసారి అయినా వ్రాస్తూ ఉండేవారు: 'ఇంట్లో ఏకబుర్లో పెట్టుకుని, కాలం వృధాచెయ్యక, చక్కగా నిద్రపొమ్మని. మూర్తీభవించిన పితృవాక్య పరిపాలక అయిన శ్రీరాముడు మరికొంచెం కీర్తి సంపాదిద్దామన్న దురాశతో మా శ్రీదేవిగా అవతరించాడేమోనని నాకు గట్టి అనుమానం. కించిత్తు లింగభేదం, కాలంతో తఫావతు అన్నవే లేకపోతే, రాముడికి కట్టిన ఆ గుళ్ళు, గోపురాలు, మా యింటి ఆవిడకే కట్టించి వుందురు. నేను యెరుగున్నమట్టుకు, పితృవాక్యం, యింత నిర్మలమైన దీక్షతో— ప్రజాభిప్రాయాన్ని లెక్కచెయ్యకుండా—శిరసావహించి ఆచరణలో పెట్టిన వారు స్త్రీ పురుషుల్లోకాని, తదితరుల్లో కాని, లేరంటే లేరు.

పోతే, ... నా పాదధ్వని ... అంటే నా పాదరక్షల కర్కశ ధ్వని— విని అయినా ఆవిడ లేచేదికాదు. అంత కఠోరమైన చెప్పులు జోళ్ళచప్పుడు కూడా నిద్రాసాంద్రమైన ఆమె కర్ణేంద్రియ పరిసరాలకు కూడా పోలేకపోయేది. అందుచేత నాకోసం, వంటయింటిలో దయతో మిగిల్చి వుంచబడిన మెతుకుల్ని నేనే స్వయంగా వడ్డించుకునేవాడిని. ఆ దిక్కుమాలిన మెతుకులు చలికాలంలో బిరబిగుసుకుని తెల్లరంగులో ముంచబడ్డ చిన్న యినుప మేకుల్లా, కొరికితే చప్పుడయేటంత కటువుగా వుంటే ముద్దముద్దకీ ఏ మంచి తీర్థమో మరికొంచెం పుచ్చుకోడం కూడా ఉండేది.

పిల్లలు ... దేవుడిచ్చిన వాళ్ళందరూ... నిద్రవిషయంలో పొత్తుగా తల్లిపోలికే. పొద్దుకూకేసరికి యే కారణంచేతయినా వాళ్ళుపడుకునే ప్రయత్నంలో కనుక లేకపోతే, మాతృదేవతయొక్క రూక్షవీక్షణాలవేడికి మలమల మాడిపోవలసి వొచ్చేది. అయినా యిటువంటి చిన్నవిషయాల్లో, తల్లిమాట జవదాటేరన్న చెడ్డపేరు సంపాదించుకోకుండా, వీలయినంత తొందరలో గాఢసుషుప్తిపాలయే వారు వాళ్ళు— చేసేదిలేక.

అప్పుడప్పుడు, మా పెద్దవాడు మాత్రం, ఏ నీళ్ళకనో, పాలకనో, లఘు శంకకనో వొంకపెట్టి, నేను యిల్లు చేరేదాకా మెలకువగా ఉందామని ప్రయత్నించేవాడు, తండ్రి యందుండే, యింకా స్వార్థం తెలియని, ప్రేమవల్ల!

ఇంతకీ చెప్పవచ్చేదేమంటే: భోజనం, లేక తత్సమం అయినది ముగించుకుని, నా గదిలో లైటువేసుకుని, టేబిలు దగ్గర కూర్చోడం యేమిటి, ఎదురుగా తయారయేది ఒక పిచిక! కప్పుకు దగ్గరగా ఉన్న లైటు ఆ పక్షిమీద స్పష్టంగా పడుతూ వుండేది.

నేను స్విచ్చి వేసే చప్పుడుకో, వెలిగే లైటు వెలుతురుకో, ఒక్కసారి గదంతా తిరిగి తిరిగి మళ్లీ యధాస్థానం చేరుకునేదా పక్షి. మొదట్లో, నా గది పక్షులకు రహదారి అయిందనుకున్నాను. కొద్దికాలానికి పరీక్షగా చూస్తే తేలింది, అది రహదారి కాదు, పూర్తిగా నివాసమే అయిందని.

ఆ పక్షిచేసే హడావిడి మొదట్లో చిరాకు కలిగించినా, క్రమంగా నిత్యకృత్యంలో ఒక భాగం అయిపోయింది. కొన్నాళ్ళకు ఎదురుచూడ్డం కూడా మొదలుపెట్టాను. ఎలక్ట్రిక్ స్విచ్ దగ్గరకు వెయ్యబోయినా నే 'లైటు వెలుగుతుంది' అనే భావంతో బాటు, 'పిచిక ఎగురుతుంది' అని కూడా అనిపించేది.

నిశాచరం అయిన జీవితంమీద సానుభూతిలేని పరిసరాలపై, అడుక్కిపోయిన విసుగు మరికొంచెం అడుక్కి పోయినప్పుడు; ఈ యింట్లో ఎవరికీ నిద్రాభంగం కలిగించని వారాక, ఈ పిచిక్కి ఇబ్బందిగా ఉన్నది కాబోలు' అనిపించేది. కప్పుని అంటిపెట్టుకుని పైన ఎక్కడోవున్న దీపపు వెలుతురు వల్ల పిచికకు ఇబ్బంది కలుగుతున్నదా; లైటు స్విచ్చిచేసే చప్పుడువల్లనా అనే సందేహం, లోలోపల నాకు తెలిసినంతకంటె ఎక్కువగానే మెదులుతూవుండి ఉండాలి. తెల్లవార్లూమేలుకొని పెళ్లాడిన యిల్లాలు (రాత్రిముహూర్తం లెండి), నిద్రాదేవి వశం అయిపోయినా, కించిత్తూ సంబంధం లేని యీ పిచికమాత్రం నాతో సహచర్యం చేయడం ఏమిటో!

ఒకరోజు! బజార్లో నడుస్తున్నాను. ఎక్కడికి వెడుతున్నానో వివరంగా జ్ఞాపకం లేదు. అంతతీరికగా బజారువెంట తిరగడానికి ఎల్లా సాధ్యపడిందో కూడా జ్ఞాపకం లేదు. కాఫీ త్రాగుతున్నాను హోటలులో. సర్వరు వొచ్చేలోపుగా పేపరుతీశాను కాలక్షేపానికి.

'గృహకలహాలను నాశనం చెయ్యండి! మీ చదువువల్ల మీ గృహిణులకు నిద్రాభంగం చెయ్యనక్కరలేదు! రమా టేబుల్ లైటు సహాయంతో వెలుతురు సరిగ్గా పుస్తకంమీద మాత్రమే పడేటట్టు చేసుకోవచ్చును!!!'

...మరునాడు ప్రొద్దున్న భోజనసమయంలో అంటోంది మా ఆవిడ. 'ఉన్న దీపాలన్నీ చాలవుటండీ, ఆ కొత్త దీపం కొన్నారు?'

'సరిపోతే యెందుకు కొంటాను?' అన్నాను కంచంలో చేయి కడుగుకుంటూ...

ఆ రాత్రి యింటి ముఖంగా సైకిలు కొంచెం హుషారుగా నడిచింది. ఏదో అలవాటులేని తొందర కనిపించింది నాకి

పడకలో, సత్కార్యం ఏదో చేసి పట్టు- (స్వంతంగా చందాయిచ్చి ఏర్పాటు చేయించుకొని) సన్మానం పొందబోతున్నట్టు...

చెయ్యి కడుక్కొని నాగదికి మామూలుగా వొచ్చి అంత ఆనందించవలసిన ఘన కార్యం మనం ఏమిచేశామా, అనుకుంటూ మామూలుగా లైటుదగ్గరకు వెళ్లాను కొత్తగా కొన్నలైటు జ్ఞాపకం వొచ్చింది. 'ఓహో! ఈ రోజున పిచికమ్మకు నిద్రా భంగంకాదు!' అనుకుంటూ కొత్తదీపం వెలిగించాను.

యధాప్రకారం పిచికమ్మ తన మకాము నుండి బయలుదేరి గదిచుట్టూ ఒక్కసారి తిరిగి స్వస్థానం చేరుకుంది. నేను చేసిన ప్రయత్నం అంతా వృధా అయినట్టు రుజావు అయిపోయింది 'నలభై సంవత్సరాల జీవితంలో మనం చేసిన ఏపని అక్కరకు వచ్చింది కనుక!' అనుకుంటూ పుస్తకం ముందు వేసుకొని కూచున్నాను.

'కొనుగోలుశక్తి యెక్కువయితే, ధరలు పెరుగుతవి...' ధరపెరిగినా పెరగకపోయినా, పుస్తకంలోని విషయాల అవగాహన మట్టుకు నాలో పెరగటంలేదు. ఒక అరగంట మథనపడి చేసేదిలేక, నేను ప్రత్యేకంగా పిచికమ్మ సౌకర్యంకోసం కొన్నదీపం ఆర్పేసి మంచంమీద వాలాను, ఆనాటి విద్యాభ్యాసంగానికి స్వస్థిచెప్పి!

గదిలో అంధకారం వ్యాపించింది. ఒక్కసారి పిచికమ్మ మళ్లీ గదిచుట్టూ ఎగిరి, కూరుదగ్గర తన స్థానాన్ని చేరుకుంది. దీపం ఉన్నా లేకపోయినా, నేను చదివినా చదవకపోయినా తనతో నాకు సహవాసం మాత్రం తప్పదన్నట్టు!

చాలాసేపు ఇంటికప్పువైపుకు చూస్తూ, కళ్లుతెరుచుకునేవున్నాను. ఏదో ఆలోచన, తీరని ఆలోచన! పిచికమ్మను గురించి. ఏమిటి యీ చుట్టరికం! మానవ మాత్రునితో సహవాసం అంటే ఏదన్నా అర్థం ఉంది. కుక్కల్ని పెంచుకుని తమవాత్సల్యం కర్పించిన వాళ్ళున్నారు. మార్జాలాలమీద కావ్యాలు వెచ్చించినవాళ్ళున్నారు. చిలకలని, గోరువంకలని, మైనాపిట్టలని పెంచి వాటికి మాట — మంతీనేర్పి, ఆ చిలకపలుకులువినీ, వినిపించి ఆనందంలో పరవశులు అయినవాళ్లు అనేకులు. పిచిగాని పెంచిన వాళు — జంతు ప్రదర్శనశాలవాళ్లు తప్ప—

# చెయ్యానుగాకచెయ్యాను

నా యెరికిని యెవరూలేరు.

స్వతః అధికంగా ప్రేమ వ్యక్తీకరించే స్వభావంకాదు నాది. నాయెదుట యెవరైనా బాధపడుతూవుంటే, నా అదృష్టం యేమిటోగాని నాకు చీమ కుట్టినట్టు కూడా వుండదు. ఎవరైనా, ఏపనైనా చేస్తే దానికి విరివిగా కృతజ్ఞతా వాక్యాలు చెప్పుకుంటూ వాళ్లని మంచి మాట ఆడడం కూడా నాకు బొత్తిగా చేతకాని పని నా చిన్నతనంలో కూడా 'నాకోసం ఎంతశ్రమపడి అన్నం వొండావు!' 'ఎంత కష్టపడి నాకు స్నానానికి వేడినీళ్లు అట్టే పెట్టావు' మొదలైన అనునయ వ్యాకాలతో నేను మా అమ్మను ఎన్నడూ తృప్తిపరచిన వాడిని కాదు. అసలు అట్టువంటి మాటలు అవాలనే నాకు తోచేదికాదు.

మా చెల్లెలు నిమిషనిమిషానికీ సానుభూతి ప్రదర్శనలు చాలా విరివిగా చేస్తూ వుండేది. ఆమె అంటే అప్పటికీ, ఇప్పటికీ మావాళ్లకు అభిమానం హెచ్చు.

నేను కూడా కొంత సానుభూతి సంపాదిద్దామని ఒకటి రెండు పర్యాయాలు, 'నాకోసం' అని మొదలుపెట్టి, 'యింత శ్రమపడి' దాకా వొచ్చి, 'అన్నం వొండావా' అని నిరర్థకంగా వచించే బదులు, 'ఏమి వొండావు?' అని సార్థకంగా ప్రశ్నించాను. దానితో మరో నాలుగురోజులు ఆ ఉన్న గోడు కూడా వేడి నేను యెంత కర్కోటకుణ్ణో, ఎంత దయాదాక్షిణ్యాలు లేని క్రూరుణ్ణో, ఎంత కృతఘ్నుణ్ణో, మా అమ్మ విపులంగా, రావణాసురుడు, మొదలైన పురాణపురుషులతో పోల్చి ... నాకు మా చెల్లెలికి గల తేడాకూడా బేరీజువేసి వివరించేది. ఆమె కృతజ్ఞురాలు, నేను పరమ కృతఘ్నుణ్ణి. ఆమె మనస్సు నవనీతం నాదో కటికపాషాణం. రక్తం త్రాగే రాక్షసులు, పుర్రెలు మెళ్లో వేసుకునే కాపాలికులు నయం...మంచిమాట నోటంట రాదు. మూగ!... చెవులకు వినపడదు... చెముడు, చెముడు చెముడు...

'యింత చెముడేమిటి?...'

ఉలిక్కిపడి 'ఏమిటది?' అన్నాను.

'గంటసేపట్నుంచిగావు కేక లేస్తోవుంటే చుట్టుపక్కల వాళ్లు లేస్తున్నారు కాని మీకుమాత్రం మెలకువ రావటమేలేదు...'

'ఏం! మెలకువగానే వున్నానే!...'

'అంటే, నిద్రపోవటంలేదు. పిలిస్తే మట్టుకు పలకడంలేదు. ఏమిటా పరధ్యాన్నం?' మా ఆవిడ, అప్పుడప్పుడు ఉపయోగించే తేనె పూసిన కంఠంతో.

ఒక వ్యక్తి యింతప్రేమ మరొక వ్యక్తి మీద చూపించినప్పుడు, దాని కేదో ప్రబలమైన— ఆ ప్రేమింపబడ్డ వ్యక్తికి ప్రమాదకరమైన కారణం—ఉంటుంది. మా యింట్లో యిటువంటి సందర్భాలకు సాధారణంగా ఆర్థికమైన కారణాలుంటాయి. మా ఆవిడ ఎన్నడయినా సానునయంగా మాట్లాడితే నాకు మా చెడ్డ భయం. ఆ అనునయవాక్యాల ఖరీదు ఎంత ఎక్కువగా ఉంటుందోనని.

'నీకు నిద్దరపట్టడంలేదా యేమిటి పాపం!'

'మీరు యింటికి రానిదే నిద్ర ఎలా పడుతుందండీ, పిల్లలతో చేసిచేసి అలా వొరిగివుంటాను కాని. కళ్ళు మూతపడతాయా యేమిటి?' ధోరణి గట్టిగానే వుంది! ఖరీదు బహుశః ఒక శతమానం దాటుతుంది!

'ఇందాకటినుంచీ లేవకపోతే నిద్రపట్టిందికాబోలనుకుని, రోజూలాగే నా అన్నం నేనే పెట్టుకుని తిన్నాను...'

'తెలియదుటండీ! అన్నీ తెలుస్తూనే వుంటాయి! అయినా మీరు వడ్డించుకున్నారు కదా అని నేను మళ్లీ లేవలేదు.'

'నిద్ర చెడగొట్టుకుని యిప్పుడు మాత్రం యెందుకు వొచ్చినట్టు?'

'అదేమిటండీ చోద్యం! పెళ్లాం మన్నది మొగుడిదగ్గరకు ఏమీ కారణం లేకుండా రాకూడదని ఏ శాస్త్రంలో వున్నది? ఏ 'లా'లో వున్నదో చెప్పండి, మీరు 'లా' కూడా చదువుకున్నారు కదా!'

నేను 'లా' చదువుకున్నానని గుర్తించి, జ్ఞాపకముంచుకుని, దాన్నీ, నన్నూ అతి హారితంగా నన్ను ప్రశంసిస్తూ ఉన్నది ఇల్లాలు, అంటే, పరిస్థితులు చాలా జటిలం అయ్యాయి అన్నమాట. అయినా కడుపుతో ఉన్నమ్మకనకుండా...

'సాధారణంగా నిద్ర చెడగొట్టుకుని మాట్లాడడం నీకు అలవాటు లేదుకదా...'

అని...

'అదుగో! యింతలో మళ్లా దెబ్బ పోదువు! క్షీణపోవడం క్షేమం టూంచేను...'

ఆమె యింకా ఏమేమి అంటున్నదో నాకు గుర్తులేదు. మెల్లిగా నిద్రపట్టింది. భళ్ళున తెల్లవారిన తరువాత కానీ మెళుకువ రాలేదు.

మరో వారం పదిరోజులు చల్లగా పడి పోయి. పదునాల్గు రాత్రి స్విచ్చికి, మా పిచికమ్మకు, నాకూ, యథాప్రకారంగా సహచర్యం సడుస్తూనే వుంది...

ఆ రోజు రాత్రి ..చాలా శ్రమ అయింది. మూడవంపేర కాగితాలు — మరునాటికి తయారు కావలసిన వ్యాసానికి చదవవలసినవి ఎన్నో ఉండబట్టి కానీ, లేకపోతే యింటికి రాకుండా ఏ రోడ్డుమీదో సైకిలు తొక్కుతూ అంచుకుపి నిద్ర పోయి ఉందును

యథాప్రకారం భోజనం చేసి, టేబిలు దగ్గర వున్న కాలు ముందు చేసుకుని చూచుకున్నాను. పుస్తకం తెరిచి, వళ్ళు తెట్టుకునే పుస్తకం కోసం చెయ్యిచాపేను. టేబిలు మీద ఆని కొన్ని సంవత్సరాలుగా ఉండే గ్లాసు ఖాళీ...కళ్ళని చూచినా ఇంతే. క్రితం రోజు గ్లాసులో నగానికే పైగా త్రాగ జ్ఞాపకం. ఇంట్లో దొరకని నా సామానులు వర్షమూ వర్షరూ, ఒకవేళ ఎక్కడైనా దొరికినా పుస్తకాలు మట్టుకు అసలు ముట్టుకోరు. రాత్రి భోజనం కాగానే వళ్ళు తెట్టుకునే అలవాటుకు ఏ మాత్రం అడ్డం వచ్చినా, యింట్లో తుఫాను తప్పక లేస్తుంది అని అందరికీ తెలుసు...

ఒక్క పుల్ల అయినా తెచ్చుకుందామని దిక్కులేనిదిగా లేస్తున్నాను. టేబిలుకు ఎదురుగా ఉన్న పుస్తకాల అలమారు దగ్గర ఆకులు, చెత్త, గుట్టగా పడివున్నాయి. 'పనిమనిషి చేత ఈగది తుడిపించవలసిన అవసరం కూడా ఎవరికీ పట్టలేదు కాబోలును!' అనుకుంటూ లోపలికి వెళ్లాను, పుడక కోసం.

మరి కొంచెం సేపటికి, పుస్తకం కోసం అలమారు దగ్గరకు వెళ్లవలసి వొచ్చింది. నా పుస్తకాల మధ్య — సరిగ్గా అప్పుడే నాకు కావలసిన పుస్తకాలపైన — పిచిక గూడు! 'హర' 'హర' అనుకుని, పుస్తకం తీసుకోబోయాను. ఈ షణ్మాత్రం గూడు

# చెయ్యానుగాక చెయ్యాను

కదిలింది. ఒక్క పరుగున పిచికమ్మ ఆ పేగం కట్టిన పిచిక గూడులోంచి బయట పడి, డేగలాగ యెగిరి స్వస్థానం చేరుకుంది. మామూలు ప్రకారం గది చుట్టూ తిరగ లేదు

ఉలికి పడ్డంతపని అయి, ఉన్నచోటే విల బడి పోయాను. ఏదో చెప్పరాని వ్యధను సూచించే కళ్లతో పిచికమ్మ నాకేసి చూసింది. ఉన్నచోట ఉండలేక, రెక్కలు రెపరెపా కొట్టుకుంటూ, అక్కడక్కడే ఎగురుతూ, మళ్లీ ఆగుతూ, కొండంత హడావిడి చేసోంది. తనకేసే చూడ మన్నట్టు ఒకటే గొడవ...

మరునాటికి తయారు కావలసిన వ్యాసం స్ఫురణ కొచ్చింది. కాలక్షేపానికి వీలులేక తక్షణం పుస్తకం కేసి చెయ్యి చాపాను. పై నించి పిచికమ్మ — యింటి కప్పు ఎగర గొట్టే హడావిడి — చాపిన చెయ్యి వెనక్కి పోయింది.

ఒకసారి తొంగి చూశాను. పిచికగూడు నగం కట్టివుంది. ఆకులు, పుల్లలు — నాపళ్లకుట్టు పుల్లలన్నీ — చిందరవందరగా పడి వున్నాయి అందులోని పద్ధతి కొంత పరీక్షించిన తరువాతనే కనిపించింది. ఆకులు, పుల్లలు, ఈనెలు, చీపురుపుల్లలు మాత్రం వుపయోగించి, తన సంతానానికి నివాసం తయారు చేసింది పిచికమ్మ. గం పెడు సామాను తయారయింది...అలాగే నిలబడి పోయాను.

మరిఒకసారి పుస్తకం కోసం చెయ్యి చాప బోయాను. పిచికమ్మ హడావిడికి అంతు లేదు. ఆ ఎగిరే విసురికి ఇంటికప్పు పోవడమే కాకుండా, తన రెక్కలు గుండపిండి అయే సంగతి కూడా మరిచినట్టుంది.

చెప్పలేనంత విసుగు వచ్చింది నా గదిలో ఉన్నదేకాక, పుస్తకాలమధ్య—సరిగ్గా నాకు అప్పుడే కావలసిన పుస్తకాలమధ్య - తను సంతానం తయారుచేసే ప్రయత్నంచెయ్యడం, నా పుస్తకం నేను తీసుకోబోతే యిలా వల్లమాలిన అల్లరిచెయ్యడం, బాగానేవుంది గొడవ! నా కాగితాల చాయకు వేనుపోతే అల్లరి! చాలా అందంగావుంది! చుట్టమై చూడవచ్చి, దెయ్యమై పట్టుకున్నట్టు... మనుష్యులమీదకంటె యెక్కువ కోపం

వొచ్చింది.

కుర్చీలో కూచుని సిగరెట్టు పూర్తిగా కాల్చినా ఆకోపం పోలేదు—ఏమైనా ఆ కాగితాలు చూచితీరాలి. మరునాటి పొద్దుటికి వెళ్లకపోతే ప్రమాదం. పై అధికారుల నుండి తప్పకుండా మాటవొస్తుంది. వ్యవహారం బొత్తిగా బాగాలేదు కూడాను తనకు మాలిన ధర్మం యేమిటి అసలు! మనవని మానుకుని···ఈ తత్వం అస్సలు ప్రయోజనంలేదు. అదికాక ఈ పిచిక ఎవరు నేనెవరు? మనుషుల వివాదకంటె ఈ నోరు లేని పక్షియొక్క సౌకర్యాసౌకర్యాలమీద యింత శ్రద్ధ యేమిటి? నాకు అమ్మవంక చుట్టమా? అబ్బవంక చుట్టమా?

'రేపటి పొద్దుటికి వ్యాసం వెళ్లితీరాలి' అని మరోసారి జ్ఞాపకంరాగానే యంత్రంలా పుస్తకాల అలమారుదగ్గరికి శరీరం నడిచింది. కదలడం పిచికమ్మ చూస్తూనే ఉన్నట్టుంది. కుర్చీలోంచి లేచేటప్పటికి కొద్దిగా మొదలైన కిచకిచలు అలమారు ప్రాంతానికి వెళ్లేటప్పడికి మరీ యెక్కువై కాగితాలమీద వెయ్యడానికి చెయ్యియెత్తే సరికి బొత్తిగా పట్టశక్యం కాకుండా పోయినవి. కించిత్తు చిరాకుతో అసలుసంగతి పూర్తిగా పరిశీలించడానికి ఒక బల్లను ఆ అలమారుదగ్గరకు లాగాను.

ఆ ప్రయత్నం పిచికమ్మకు బొత్తిగా ఇష్టంలేనట్టుంది. నా చుట్టూ గిరగిరా శరవేగంతో ప్రదక్షిణ చెయ్యడం మొదలు పెట్టింది.

పిట్టగూడు చూడడం నాకు అదే మొదలు. అంతక్రితం ఎన్నడూ చూడలేదు, పుస్తకాలలో కనీసం బొమ్మలుకూడా సరిగ్గా చూడలేదు. పై భాగంలోని గజిబిజికేంగాని, లోపలిభాగం అద్భుతంగావుంది. పిచికమ్మ గడ్డి పరకలతో వెండిగిన్నె తయారు చేసింది. నున్నగా, వొయ్యారంగా గూడు పాలకడలిలా! దానిమధ్య రెండు గుడ్లు— రమావిష్ణువుల్లాగ!

గొడవ చేసిచేసి పిచిక తన స్థానం చేరుకుంది. లాభం లేదని తెలిసినట్టుంది. మెల్లిగా కాగితాలు కదిపి చూచాను. గూడు కదులుతోంది. గుడ్లు కదులుతున్నాయి! 'పిచికమ్మా! నీ పిల్లలకు వచ్చిన భయం లేదు! నా కాగితాలు జాగ్రత్తగా తీసుకుంటా'నని చెప్పాలనిపించింది. ఆమె శ్వాస

అని...

'అదుగో! యింటిలో మళ్లా దెబ్బ పొడుస్తు! నిద్రపోవడం కేటంటూంటేను...'

ఆమె యింకా ఏమేమి అంటున్నదో నాకు గుర్తులేదు. మెల్లిగా నిద్రపట్టింది. తెల్లవారిన తరువాత కాని మెళుకువ రాలేదు.

మరో వారం పదిరోజులు చల్లగా నడిచాయి. పదుర్రాత్రి స్విచ్చికీ, మా పిచికమ్మకు, నాకూ, యథాప్రకారంగా సహచర్యం నడుస్తూనే వుంది...

ఆ రోజు రాత్రి ..చాలా శ్రమ అయింది. చూడవలసిన కాగితాలు — మరునాటికి తయారు కావలసిన వ్యాసానికి - చదవవలసినవి ఎన్నో ఉండబట్టి కాని, లేకపోతే యింటికి రాకుండా ఏ [illegible] ఉందును

యథాప్రకారం భోజనం చేసి, [illegible] పుస్తకాలు ముందు వేసుకొని కూచున్నాను. పుస్తకం తెరిచి, పళ్ళు కుట్టుకునే పుల్ల కోసం వెదుక్కున్నాను. టేబిలుమీద అవి కొన్ని [illegible] ఉండే గ్లాసు ఖాళీ... [illegible] చూసినా అంతే. క్రితం రోజు గ్లాసులో [illegible] జ్ఞాపకం. యింట్లో [illegible] నా సామానులు [illegible] ఒకవేళ [illegible] పుల్లలు ముట్టుకు అసలు [illegible]. రాత్రి భోజనం కాగానే పళ్ళు కుట్టుకునే అలవాటుకు ఏ మాత్రం అడ్డం [illegible], యింట్లో [illegible] తప్పక లేస్తుం [illegible] అందరికీ తెలుసు...

ఒక్క పుల్ల అయినా తెచ్చుకుందామని [illegible] లేస్తున్నాను. టేబిలుకు ఎదురుగా ఉన్న పుస్తకాల అలమారు దగ్గర ఆకులు, చెత్త, గుట్టగా పడివున్నాయి. 'పనిమనిషి చేత ఈగది తుడిపించవలసిన అవసరం కూడా ఎవరికీ పట్టలేదు కాబోలను!' అనుకుంటూ లోపలికి వెళ్ళాను, పుడక కోసం.

మరి కొంచెం సేపటికి, పుస్తకం కోసం అలమారు దగ్గరకు వెళ్ళవలసి వొచ్చింది. నా పుస్తకాల మధ్య — సరిగ్గా అప్పుడే నాకు కావలసిన పుస్తకాలపైన — పిచిక గూడు! 'హార' 'హార' అనుకుని, పుస్తకం తీసుకోబోయాను. ఈ క్షణమాత్రం గూడు

# చెయ్యానుగాక చెయ్యాను

కదిలింది. ఒక్క పరుగున పిచికమ్మ ఆ సగం కట్టిన పిచిక గూడులోంచి బయట పడి, డేగలాగ యెగిరి స్వస్థానం చేరుకుంది. మామూలు ప్రకారం గది చుట్టూ తిరగలేదు.

ఉలికి పడ్డంతపని అయి, ఉన్నచోటే నిలబడి పోయాను. ఏదో చెప్పరాని వ్యధను సూచించే కళ్లతో పిచికమ్మ నాకేసి చూసింది. ఉన్నచోట ఉండలేక, రెక్కలు రెపరెపా కొట్టుకుంటూ, అక్కడక్కడే ఎగురుతూ, మళ్లీ ఆగుతూ, కొండంత హడావిడి చేసోంది. తనకేసే చూడమన్నట్టు ఒకటే గొడవ...

మరునాటికి తయారు కావలసిన వ్యాసం స్మరణ కొచ్చింది. కాలక్షేపానికి వీలులేక తక్షణం పుస్తకం కేసి చెయ్యి చాపాను. పైనించి పిచికమ్మ — యింటి కప్పు ఎగర గొట్టే హడావిడి — చాపిన చెయ్యి వెనక్కి పోయింది

ఒకసారి తొంగి చూశాను. పిచికగూడు సగం కట్టివుంది. ఆకులు, పుల్లలు — వాసళ్ళకుట్టు పుల్లలన్నీ — చిందర వందరగా పడి వున్నాయి అందులోని పద్ధతి కొంత పరీక్షించిన తరువాతనే కనిపించింది. ఆకులు, పుల్లలు, ఈనెలు, చీపురుపుల్లలు మాత్రం వుపయోగించి, తన సంతానానికి నివాసం తయారు చేసింది పిచికమ్మ. గంపెడు సామాను తయారయింది...అలాగే నిలబడి పోయాను.

మరొకసారి పుస్తకం కోసం చెయ్యి చాప బోయాను. పిచికమ్మ హడావిడికి అంతు లేదు. ఆ ఎగిరే విసురికి ఇంటికప్పు పోవడమే కాకుండా, తన రెక్కలు గుండపిండి అయే సంగతి కూడా మరిచినట్టుంది.

చెప్పలేనంత విసుగు వచ్చింది నా గదిలో ఉన్నదేకాక, పుస్తకాలమధ్య—సరిగ్గా నాకు అప్పుడే కావలసిన పుస్తకాలమధ్య - తను సంతానం తయారుచేసే ప్రయత్నంచెయ్యడం, నా పుస్తకం నేను తీసుకోబోతే యిలా పనిమాలిన అల్లరిచెయ్యడం, బాగానేవుంది గొడవ! నా కాగితాల చాయకు నేనుపోతే అల్లరి! చాలా అందంగావుంది! చుట్టమై చూడవచ్చి, దెయ్యమై పట్టుకున్నట్టు... మనుష్యులమీదకంటె తొక్కువ కోపం వొచ్చింది.

కుర్చీలో కూచుని సిగరెట్టు పూర్తిగా కాల్చినా ఆకోపం పోలేదు—ఏమైనా ఆ కాగితాలు చూచితీరాలి. మరునాటి పొద్దుకి వెళ్లకపోతే ప్రమాదం. పై అధికారుల నుండి తప్పకుండా మాటవొస్తుంది. వ్యవహారం బొత్తిగా బాగాలేదు కూడాను. తనకు మాలిన ధర్మం యేమిటి అసలు! మనవని మానుకుని···ఈ తత్వం అస్సలు ప్రయోజనంలేదు. అదీకాక ఈ పిచిక ఎవరు నేనెవరు? మనుష్యుల వివాదకంటె ఈ నోరు లేని పక్షియొక్క సౌకర్యాసౌకర్యాలమీద యింత శ్రద్ధ యేమిటి? నాకు అమ్మవంక చుట్టమా? అయ్యవంక చుట్టమా?

'రేపటి పొద్దుకి వ్యాసం వెళ్లితీరాలి' అని మరోసారి జ్ఞాపకంరాగానే యంత్రంలా పుస్తకాల అలమారుదగ్గరికి శరీరం నడిచింది. కదలడం పిచికమ్మ చూస్తూనే ఉన్నట్టుంది. కుర్చీలోంచి లేచేటప్పటికి కొద్దిగా మొదలైన కిచకిచలు అలమారు ప్రాంతానికి వెళ్ళేటప్పటికి మరీ యెక్కువై, కాగితాలమీద వెయ్యడానికి చెయ్యియెత్తే సరికి బొత్తిగా పట్టశక్యం కాకుండా పోయినవి. కించిత్తు చిరాకుతో అసలుసంగతి పూర్తిగా పరిశీలించడానికి ఒక బల్లను ఆ అలమారుదగ్గరకు లాగాను.

ఆ ప్రయత్నం పిచికమ్మకు బొత్తిగా ఇష్టంలేనట్టుంది. నా చుట్టూ గిరగిరా కరవేగంతో ప్రదక్షిణ చెయ్యడం మొదలు పెట్టింది.

పిట్టగూడు చూడడం నాకు అదే మొదలు. అంతక్రితం ఎన్నడూ చూడలేదు, పుస్తకాలలో కనీసం బొమ్మలుకూడా సరిగ్గా చూడలేదు. పై భాగంలోని గజిబిజికెంగాని, లోపలిభాగం అద్భుతంగావుంది. పిచికమ్మ గడ్డి పరకలతో వెండిగిన్నె తయారు చేసింది. సున్నగా, వొయ్యారంగా గూడుకు పాలకడలిలా! దానిమధ్య రెండు గుడ్లు— రమావిష్ణువుల్లాగ!

గొడవ చేసిచేసి పిచిక తన స్థానం చేరుకుంది. లాభం లేదని తెలిసినట్టుంది. మెల్లిగా కాగితాలు కదిపి చూశాను. గూడు కదులుతోంది. గుడ్లు కదులుతున్నాయి! 'పిచికమ్మా! నీ పిల్లలకు వచ్చిన భయం లేదు! నా కాగితాలు జాగ్రత్తగా తీసుకుంటా'నని చెప్పాలనిపించింది. ఆమె భాష

నాకురాదు, నా భాష పిచికమ్మకు తెలియదు. ఒక్కసారి పిచిక కూర్చున్న చోటికి చూచాను.

ఏ ఉద్యోగానికో మనం దరఖాస్తు చేస్తాం అడిగినకంటె, అందరికంటె అర్హతలు మనకు ఎక్కువవున్నయి మనకే వొచ్చి తీరాలి ఈ ధీమాతో వుండగానే ఎవరో అగస్త్యభ్రాతను, నిశానిని అధికారులు ఏరు కుంటారు. మనకు కోపం వొస్తుంది. 'ఇంత అన్యాయమా!' అని. మనం ఈ కార్యాన్ని ప్రశ్నించి మన హక్కును అమలు పరుచుకోదలచి తీసుకున్న చర్య మన పీకల మీదికి తెస్తుంది మానవకోటినిరాదమనకు కలిగే కోపం అంతులేనిది మనం ఏమీ చేయలేమని తెలుసుకున్నప్పుడు, మన నిస్సహాయత, మన బలహీనత అరని నిప్పులా మనని దహించేస్తితి నాకు జ్ఞాపక మొచ్చింది. అటువంటి సమయాల్లో నా కళ్లు ఆ పిచికమ్మ కళ్లలాగే వుండి వుండాలి.

చెయ్యి ముందుకు సాగలేదు. ఏదో శక్తి నన్ను వెనక్కి తోసివేసింది ప్రక్కమీదకు తీసుకుపోయింది నిద్రలేకుండా తెల్లవార్లూ దొర్లేటట్టు చేసింది ప్రొద్దున ఆఫీసుకు పంపి చివాట్లు తినేటట్లు చేసింది. ఉద్యోగానికి తిలోదకాలు వదులుకునేటంతవరకు తెచ్చింది......

తిండీ తిప్పలు లేకుండా ఏళ్లతరబడి ఉండమంటే.. ఉంటాను జేబునిండా డబ్బు వుండగా, అనుభవించే శక్తి వుండగా, వైరాగ్యం లేకపోయినా, సన్యాసిలా ఉండ మంటే.. ఉంటాను. సంతోషిస్తూ ఉంటాను టొమాటోకంటే మాంసానికి దగ్గరగా ఉండే ఆహారాన్ని కలలోనైనా చూడని నన్ను, పచ్చిమాంసం నవుల్తూ తినమంటే.. తింటాను. నీటిలో దిగుతాను, మంటలో ఉరుకుతాను, ఇంకా ఏమి చెయ్యమంటే అది చేస్తాను. కాని యింట్లో చెత్త పడుతోం దన్న కారణంగా ఆ గూడుని అందులో పిల్లలుకాబోయే గుడ్లనీ అవతల పారవేసిన ఆసామీ కూతురుతో మాత్రం, ఈ కంఠంలో ప్రాణం వుండగా కాపురం చెయ్యను, ఆమె ఉన్న యింట్లో అడుగు పెట్టను, ఆ వూళ్లో ఊపిరి కూడా తియ్యను అంటే తియ్యను...


ఏమిటోయ్? పండగపూట కూడా అన్నం మెత్తగా చేశారూ?
స్పెషల్ గా పరమాన్నం చేసాంసార్! పంచదార వేయలేదంతే!
బాంబు
మందు సామానంతా నువ్వే కాలుస్తావేం- ఓ రెండు టపాకాయలు నా మొహాన్న కూడా పడేయవే అన్నా!
అబ్బ. మీరు మరీనూ- కాకర పూవొత్తి కాల్చడానికి కూడా అంత భయమైతే ఎలాండి?
మందు సామాను కాల్చటం వంటే నాకు భయం- ఇవన్నీ మా ఆవిడ కాలుస్తుంది- నేను సిగరెట్లు కాలుస్తాను!


ఏవోయ్ మందు సామాను కొన్నావా?
రాసిచ్చాడు- రేపు కొనాలి!
అన్నం కూరా వేశాగా ఇంకా నిలబడ్డావేం?
ఏవో రెండు కొత్తర పూవొత్తులు రెండు మతాబులు కూడా పడేయమన్నా!
ఏమిటి గురూ ఆయన మొహం మతాబాలా వెలిగి పోతోంది
కథల పోటీల్లో ప్రైజు వచ్చిఉంది!

మీరు తరుణ్యులు, పెప్సొడెంట్‌ను వాడే ఏ యువతి చిరునవ్వు తిండింపులకు భయపడవక్కరలేదు. ఆమె తియ్యగా నవ్వుతూ. హాయిగా, సంతోషముగా ఉండవచ్చును.

# ఎంతో మంది అందమైన యువతులు పెప్సొడెంట్ టూత్ పేస్టును ఎందుకు వాడతారు?

ఎందుకంటే, పెప్సొడెంట్ పళ్ళను తెల్లగా, మెరిసేలా శుభ్ర పరుస్తుంది. కనుక మీరు నవ్వితే మీ అందమైన నోటికి కొత్త కళ వస్తుంది—పెప్సొడెంట్ మీ నోటిలో ముత్యాల వరుసలు పేర్చిందా అనిపిస్తుంది!




పెప్సొడెంట్‌లో చేర్చబడిన 'ఇరియమ్ ప్లస్' అద్భుతమైన నురుగును ఇస్తుంది. ఇది పళ్ళమీది అశుభ్రపు పొరను పోగొట్టి వాటిని తెల్లగా మెరిసేలా చేస్తుంది!



పెప్సొడెంట్‌తో తోముకొన్న పళ్ల మెరుగు...మీ ముఖానికిస్తుంది సాటిలేని వెలుగు!

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఒక విశిష్టమైన తయారు

HPL-6837

**మేషం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి. పైవారిలో గౌరవం బాగా ఉంటుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు.— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. విలాస వస్తువులు కొంటారు.

**వృషభం.** ఫలితం మాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతిపని సులువుగా నెరవేరుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుకొంటారు. వారం మధ్యలో అన్ని వ్యవహారల్లోను చికాకులు యేర్పడతాయి ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు.— ఆరోగ్యం బాగ ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** వృత్తిలో కొత్తవారితో పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు శ్రమ మీాద ఫలిస్తాయి. రావలసిన డబ్బు మీాద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు.— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగ ఉంటాయి. పైవారిలో గౌరవం లభిస్తుంది.

**కర్కాటకం.** ఇప్పుడు మీారు జరిపే వ్యవహారాల వల్ల ముందు కూడా ఉపయోగం ఉంటుంది. వృత్తిలో వాద ప్రతివాదాలకు దిగడం తగదు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు

స్త్రీలకు.— ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆభరణాలు వస్తువులు కొంటారు.

**సింహం.** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది. ప్రయాణాలు శ్రమ మీాద ఫలిస్తాయి. వ్యాపారంలో మాతవాతాశాలు లభిస్తాయి. సాంఘిక వ్యవహారాల్లో మీా ప్రాముఖ్యత పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం అధికం కాగలదు

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి నూతన విషయాలను తెలుసుకొంటారు.

**కన్య:** వృత్తి వ్యాపారాల్లో మీా కార్యక్రమాలు చురుకుగ సాగుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగ ఉంటాయి. ఆర్థిక వ్యవహారల్లో మొగమాటాలు తగవు. నూతన వ్యవహారాలు లాభదాయకంగా ఉంటాయి. పాటివారితో మాట పట్టింపులు రావచ్చును.

స్త్రీలకు.— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

# వారఫలం

**3-11-1967 శుక్రవారం మొదలు**
**9-11-1967 గురువారం వరకు**

**తుల:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు అనుకూలంగ ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వృత్తిలో అనుకూల వార్తలను వింటారు కోర్టు వ్యవహారల్లో అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయగలరు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం** వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు అధికారులవలన జరగ వలసిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. పైవారిలో గౌరవం లభించ గలదు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు.** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**మకరం:** వృత్తి వ్యాపారాల్లో మీా కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగ ఉంటాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారల్లోను చికాకులు యేర్పడతాయి. మీా తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**కుంభం** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగావుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాల్లో మీా ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారలు వారం మధ్యలో లాభించగలవు.

స్త్రీలకు.— కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి దైవ కార్యాలు నెరవేరుతాయి.

**మీనం:** అన్ని వ్యవహారాల్లోను అనుకూలమైన మార్పులు వస్తాయి. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో మీారు యింతవరకు చేసిన ప్రయత్నాలు ఫలించ గలవు ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. ఆర్థిక వ్యవహారాలు బాగ ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

—మహేష్



నవలల పోటీలో మూడవ బహుమతి పొందిన సీరియల్ ప్రారంభం

సీరియల్

కె. రామలక్ష్మి

'ఈ జ్ఞానం ముందే ఉంటే' తలవంచి చీటీ రాస్తూ అడిగింది డాక్టరు కళ్యాణి.

*'డాక్టరుగారూ, మీరలా అనకండి. మీరు కొంచెం దయ చూపాలండీ. నేనీ నరకం భరించలేను.' గుడ్లనీరు కుక్కుకుంటూ అడుగుతోంది లేదు, ప్రాధేయపడుతోంది ఎదుటి కుర్చీలో కూర్చున్న మనిషి.*

*'ఈ మందు వాడు. ఈ మాత్రలు పదిరోజులు వేసుకుని తిరిగి రా.' అంటూ ఇక మాట్లాడవలసింది లేనట్టు ఊరుకుంది డాక్టరు.*

డాక్టరు కళ్యాణికీ వరస అలవాటై పోయింది. సంతాన నిరోధం గురించి తెలుసుకుందుకు ఏమాత్రం కుతూహలం ప్రదర్శించరు. కాని కడుపొస్తే తీసేయడానికే డాక్టర్లు అన్నట్టు వచ్చి పడతారు. ఇది మామూలయిపోయి, తనపని తను నిర్వహించడం అలవాటు చేసుకుంది డాక్టరు.

గవర్నమెంటు డాక్టరు కావడంతో ఇలా వచ్చే కేసులకి అంతూ పంతూ ఉండదు. ఇక ఇది చాలదన్నట్టు రేప్ కేసుల పరిశీలన, మానవష్టం దాకా సాగిన మానభంగాల పరిశోధన, తాగుడు మొదలైన వాటి నిరూపణ — ఇలాంటి వెన్నో వస్తూ ఉంటాయి. 'పిల్లకి సర్టిఫికెట్టు రాసేసరికే [illegible]' అంటుంది డాక్టరు.

మరణ వాఙ్మూలాలు వ్రాసేటప్పుడు ఉండడం, పోస్టుమార్టం చేసి ముద్ర వేయడం, కోర్టు తగాయిదాలకు సాక్ష్యాలు పలకడం చాలదన్నట్టు అప్పుడప్పుడు జైలు కేసులు పరిశీలించవలసి వస్తూ ఉంటుంది. అలాంటప్పుడే కొన్ని గమ్మత్తయిన కేసులు వస్తూ ఉంటాయి.

నిన్ననే అలాంటి కేసొకటి తటస్థించింది డాక్టరు కళ్యాణికి. ఎంత మరిచిపోదామనుకున్నా ఆ స్త్రీ ముఖం వెన్నంటే ఉంటుంది.

ఆస్పత్రిలో పని చేతినిండా ఉంది. ఉదయం వచ్చినది మొదలు తలెత్తకుండా పనిచేసి అలసిపోయిన కళ్యాణికి జైలు నుంచి అర్జెంటుగా రమ్మని పిలుపు వచ్చింది. పని [illegible]కి అప్పగించి ఆదరా బాదరగా [illegible].

జైలులో ఆమెకంటపడ్డ దృశ్యం—చాలా గమ్మత్తయినది. ఒడిలో పాతగుడ్డల మూట పాపాయిని పట్టుకున్నట్టు పట్టుకుని గోడకి జేరవడి కూర్చుంది ఒక స్త్రీ. పక్కనే జమాజెట్టీలాంటి ఆడవార్డెను ఉంది. పోలీసులు, ఇనస్పెక్టరు ఒకరిద్దరు లాయర్లు అంతా హడావిడిగా ఉన్నారు.

డాక్టరు రాగానే ఇనస్పెక్టరు లేచాడు 'గుడ్ మార్నింగ్ డాక్టర్ ఉదయమే మీకు శ్రమ కల్గించాం' అన్నాడు పలకరింపుగా.

'దానికేంలెండి. ఏమైంది? ఎవరీవిడ' క్యూరియస్‌గా కూర్చున్న స్త్రీవైపు చూస్తూ అడిగింది డాక్టరు కళ్యాణి.

'రండి ఆఫీసులో కూర్చుందాం' అంటూ రిసెప్షను గది దాటి ఆఫీసు గదిలోకి నడిచారు.

'డాక్టరు నిన్ననే ఈ స్త్రీని ఎరెస్టు చేసి తీసుకువచ్చాం. ఉత్త పిచ్చిది. కాని ఖరారైన ఖూని కేసొకటి ఈవిడ మీద పెట్టారు. చాలా బలమైన సాక్ష్యాలు తెచ్చారు. ఈమె నొకసారి మీరు పరీక్షించాలని పిలిచాం డాక్టర్.' అని ఉపోద్ఘాతంగా చెప్పాడు ఇనస్పెక్టరు.

'పిచ్చిదానిమీద హత్యకేసా! అర్థంలేదు' అంది డాక్టరు.

'కేసువింటే మీరలా అనరు.' క్లుప్తంగా బదులుచెప్పాడు ఇనస్పెక్టరు,

'[illegible]

కప్పిపెట్టేసి వెళ్దామా' అంది డాక్టరు కళ్యాణి.

'ఓ ఎనిమిది సంవత్సరాల పిల్లవాణ్ని ఈవిడ చంపిందని కేసు. చంపుతూ ఉండగా చూసినవాళ్ళున్నారు. పిల్లవాడికేక విన్నవాళ్ళు, పిచ్చిదాని చేత గునపం చూసిన వాళ్ళు ఉన్నారు. రక్తం ఉంది. రక్తంతో తడిసిన పిల్లవాడి చొక్కా ఉంది. గమ్మత్తేమిటంటే పిల్లవాడు లేడు! కనీసం వాడి శవం పూడ్చినట్టుగాని, మాయం చేసినట్టుగాని ఎక్కడా ఆధారంలేదు. అదొక్కటే తిరకాసు ఈ కేసుతో.' డాక్టరు నవ్వింది. 'అదేదో చాలా చిన్నవిషయం అన్నట్టు తోసి పారేస్తున్నారే!' హత్యానేరం నిలవాలంటే — శవం కనబడద్దా?' అంది.

'నిజమే, కాని ఇప్పటిదాకా మేం దర్యాప్తు చేసి ఏదీ తేల్చుకోలేక పోయాం. కాని విన్న కోర్టు చూసేవేళకి ఆ పిల్లవాడి తల్లి, తండ్రులే వచ్చి నిలబడ్డారు — తమ బిడ్డడే ఆ పోయినవాడని. ఇక కేసు ఫైల్ చేయక తప్పదు కదా? మీారు చూస్తారా?' అడిగాడు డాక్టరుగారిని. డాక్టరు కళ్యాణి లేచింది బ్యాగు చేతో పట్టుకుని రిసెప్షను గదిలో నుంచి పక్కగదిలోకి తీసుకువచ్చారు ఆ స్త్రీని. 'సరళట పేరు' అంది ఆడవార్డెను.

'కూచోనమ్మ,' అంది సౌమ్యంగా డాక్టరు.

చిన్నపిల్లమాదిరి కూర్చుందా స్త్రీ. జాలివేసింది డాక్టరు కళ్యాణికి.

'నీపేరేమిటి?'

ఒడిలో ఉన్న పాతగుడ్డల మూటని రెండవ వైపుకేసి మార్చిందా స్త్రీ. పాలక మారిన పంటివాడి తల నిమిరినట్టు ఆ గుడ్డలమూట నిమురుతూ తలెత్తైనా పైకి చూడలేదు.

'నీ పేరేమిటమ్మా? తరువాత ఇద్దువు గానిలే పాలు.' అంది డాక్టరు.

'అమ్మయ్య. నన్ను అర్థం చేసుకున్నది ఒక ప్రాణి' అన్నట్టు, ఆత్రంగా తల పైకెత్తిందా స్త్రీ.

'సరళ' అంది సమాధానంగా.

'నువ్విక్కడెందుకున్నావో తెలుసా?' అడిగింది డాక్టరు.

'అవతల చలి పంటాడికి పడదు' అంది క్లుప్తంగా.

'ఫరవాలేదు. నీ పిల్లవాణ్ణి పడుకోపెట్టు. నీ ఆరోగ్యం ఎలా ఉందో చూస్తాను.' అంది డాక్టరు.

ఎంతో జాగ్రత్తగా ఒడిలో బట్టల మూట పక్కనే పడుకోపెట్టింది. జాగ్రత్తగా కప్పి డాక్టరు కేసి తిరిగిందా స్త్రీ.

మామూలు పరీక్షలన్నీ చేసింది. గుండెల మీాద స్టెతస్కోపు ఆన్చనివ్వలేదామె.

డాక్టరు పని ముగించి బయటికి వచ్చింది.

డాక్టరుకి కంట తడివచ్చిందా స్త్రీ మానసిక వ్యధ తలచుకొంటే.

'ఇనస్పెక్టర్, ఆమె నిక్కడ ఉంచకండి. మెంటల్ క్లినిక్‌కి ట్రాన్స్‌ఫర్ చేయమనండి. చాలా మనోవ్యథతో ఉన్న మనిషి. అంతేగాని ప్రమాదకరమైన పిచ్చిలా లేదు.

'ఆ పాత గుడ్డలమూట లాగి చూడంతో' అన్నాడు నవ్వుతూ ఇనస్పెక్టరు.

'మనం ఎందుకు లాగాలి? ఆమె స్థితి మెరుగుపడేదాకా ఎవరూ ఆవిడకి ఆవేశం తెప్పించకుండా ఉండడమే మంచిదని తోస్తుంది. ఆ గుడ్డలమూట పిల్లవాడని ఆవిడ నమ్మకం. అలాగే ఊరుకుంటే ప్రమాదం లేదుగా?' అంది డాక్టరు.

'క్షమించండి డాక్టర్, నేనేదో సరదాకి అన్నాను. ఇందాకా కాన్‌స్టేబులొకడు లాగి చూశాడు చంపేసేటంత గొడవ చేసింది. అందుకలా అన్నాను.' సంజాయిషీ చెప్పాడు ఇనస్పెక్టరు.

'దానికేం లెండి. పిచ్చిదాన్ని చూస్తే అందరికీ ఆడించ బుద్ధే కదా, సరే నేను వెడతాను. కాని ఈవిడని మటుకు ఈవేళే మార్చేయండి.' అంటూ బ్యాగ్ అందుకుంది కళ్యాణి.

ఇనస్పెక్టరు డాక్టరుతో గేటుదాకా వచ్చాడు.

'పిచ్చిదాని కేసుగా రాయించేసి...' ఏదో చెప్పబోయాడు.

'ఆదేం వద్దు ఇనస్పెక్టర్ కేసు నడవనివ్వండి. అసలు కథ బయటికొస్తుంది కదా. నా స్నేహితురాలు శాంతకీరోజే ఫోను చేస్తాను. ఈవిడ తరఫున తప్పక వాదిస్తుంది.' అంటూ డాక్టరు కళ్యాణి కారు ఎక్కింది.

కారు నడుస్తున్నంతసేపూ డాక్టరు కళ్ళలో ఆ మతి తప్పిన స్త్రీ కదులుతూనే ఉంది. జాలితో హృదయం కరిగింది. ఏం మనుషులు? ఎలాంటి పరిస్థితులు, అనుకుంది.

కారు దిగి హాస్పిటల్‌లోకి వెడుతూనే బల్లమీాద ఉన్న టెలిఫోను అందుకుంది కళ్యాణి. తనకు సుపరిచితం అయిన శాంత నెంబరు తిప్పింది. ఆత్రుతగా అవతలి పక్క ఎత్తిన శబ్దం కోసం వేచి చూస్తూనే బల్ల మీాది కాగితాలు తిరగేయ సాగింది.

'హలో శాంత స్పీకింగ్' అన్నమాట చెవిలో పడగానే కుర్చీలో కూలబడింది డాక్టరు.

'శాంతా, నేను కళ్యాణిని, నీతో అర్జెంటుగా మాట్లాడాలని పిలిచాను.'

'ఏమిటే సంగతి? మరీ అంత సీరియస్ అయితే చెప్పు. లేకుంటే సాయంత్రం అయినా నేను వస్తాను. వచ్చి కలుసుకుంటాను' అంది శాంత.



'[illegible] సరే, తప్పకుండా రావాలి. నీకోసం ఎదురుచూస్తూ ఉంటాను. ఏం?' అంది డాక్టరు. సమాధానం సుముఖంగా ఉండడంతో గుప్‌చిప్‌గా ఫోను కిందపెట్టి కాగితాలు మూసుకోవడం ప్రారంభించింది.

గవర్నమెంటు డాక్టరీ అంటేనే ఎంత! కేసుల కంటె కాగితాలు ఎక్కువ. రాసే ప్రిస్క్రిప్షనుల కంటే పెట్టే సంతకాలెక్కువ!

ఎంత లేదన్నా మూడుగంటలకు కాని డాక్టరు పని తెమలలేదు. డ్యూటీ ముగించి ఇంటి ముఖం పట్టింది కళ్యాణి.

ఇంటికి వెళ్ళగానే డాక్టరు తొడుగు తీసిపారేసి, స్త్రీ అయిపోయి విశ్రాంతిగా పడుకుంది కళ్యాణి.

డాక్టరు చదివి ఉద్యోగంలో చేరి పూర్తిగా రెండు సంవత్సరాలు కూడా కాలేదు. ఈ రెండు సంవత్సరాలలోనూ రెండు జీవితాలకు సరిపడ్డ సంగతులు తెలుసుకొంది కళ్యాణి. మానవత్వం అంటే ఏమిటో తెలుసుకొంది. మానవులలోని దానవత్వం అంటే ఎలా ఉంటుందో కళ్ళారా చూసింది తన దగ్గరకి వచ్చే రోగుల ద్వారా. ఇదా ప్రపంచం! అని విస్తుపోయినా, ఇదే ప్రపంచం అని సద్దుకుంది. చేతనయిన సహాయం చేయడం, ఆదరణ కొరవడిన చోట అది పూరించడం, దయాదాక్షిణ్యాలు చంపుకోకుండా డాక్టరుగా ఉండాలని తాపత్రయ పడింది. అలా ఉండకల్గడం కూడా ఎంత కష్టమో అప్పుడప్పుడు కళ్యాణికి అర్థం కాకపోలేదు. అయినా ఇంకా పూర్తిగా కరడుకట్టి పోలేదు — డాక్టరు కళ్యాణిలో ఉన్న స్పందించే హృదయం. అందుకే ఆ హృదయం దారుణాలపట్ల కరిగిపోతుంది. దైన్యంపట్ల సానుభూతితో ఉక్కిరి బిక్కిరవుతుంది. ఆ పిచ్చిస్త్రీ అందుకే కళ్యాణి గుండెలో గూడు కట్టుకొంది. హాయిగా పడుకుని ఏవేవో ఆలోచనలలో తేలుతున్న కళ్యాణికి తల్లి ఎవరితోనో మాట్లాడడం వినిపించి లేచింది.

'ఎవరమ్మా?' అంటూ ఇవతలికివచ్చిన కళ్యాణి కంట శాంత పడింది.

'వచ్చావా? రా, రా,' అంటూ శాంతని తన గదిలోకి తీసుకువెళ్ళి కూర్చోపెట్టింది.

'నువ్వు వస్తావో రావో అని బెంగపడి పోతుంటేనూ.' అని నాంది పల్కింది.

'ఇంతకీ ఈ మిస్టరీ ఏమిటో చెప్పు. కొంపతీసి ఎవరినేనా ప్రేమించలేదు కదా!' వేళాకోళంచేసింది శాంత, కుర్చీలో జేరబడుతూ.

'లేదు శాంతా. ఈరోజు జాలికొలిపే ఒక సంఘటన జరిగింది. దానికి నీ సహాయం కావాలి. [illegible] తెలిసి [illegible] ఫోను చేశాను.

'నేను పైవూరు కేసొకటి ఒప్పుకున్నాను. దానికి రాజమండ్రి వెళ్ళాలి ఆ విషయంలో ఏదో కాగితాలు చూడ్డానికని కోర్టుకికూడా వెళ్ళలేదు ఈవేళ. ఆ కేసు తరపు వాళ్ళె కూర్చుని ఉన్నారు నువ్వు ఫోన్ చేసినప్పుడు' అంది శాంత.

'ఇంతకీ అసలు సంగతి విను. ఒక కేసు పరీక్షించి సర్టిఫై చేయమన్నారు నన్ను. ఆ స్త్రీ పిచ్చిది కాని పూర్తిగా పిచ్చిదానిలా కనబడలేదు ఏదో దెబ్బతిని జ్ఞానం కోల్పోయిన వెర్రిదానిలాగా ఉంది.' అని పిచ్చిదాని వివరాలన్నీ చెప్పింది కళ్యాణి.

'పిల్లలమీద మమకారం ఉన్న స్త్రీ హత్యచేసిందంటావా?' అడిగింది — అంతా చెప్పాక.

'ఏమో చెప్పలేం ఎలాంటి ప్రొవొకేషన్ ఉందో. చూడు అప్పుడప్పుడు రోడ్లమీద పిచ్చివాళ్ళని చూస్తూ ఉంటాం. రాళ్ళు రువ్వుతారు క్రూరాళ్ళు. ఊరుకుంటే దగ్గరగావచ్చి జుట్టు పీకుతారు. బట్టలు చింపుతారు. అదే కొంచెం తీవ్రమైన రకం అయితే పట్టుకు తన్నుతుంది. ఆవేశంలో చంపినా చంపుతుంది - మనం ఎలా చెప్పకలం?' లాయరు కనుక అటూ ఇటూ కాకుండా అంది శాంత.

'ఆ పిచ్చిదాన్ని చూస్తే అలా అనిపించలేదు నాకు. నువ్వీకేసు తప్పకుండా తీసుకోవాలి శాంతా. పాపం దాని తరపున గవర్నమెంటు లాయరు రెండువాదాలుపెట్టి ఊరుకోవడం నేను భరించలేను' అంది ఆవేశంగా డాక్టరు.

'ఇది మరీ బాగుంది! వాదించనీ, వాదనతో నిజానిజాలు బయటపడతాయిగా. చూడు కళ్యాణీ, నువ్విలాంటి ప్రతికేసూ గుండెల కెక్కించుకుంటే ఎంతోకాలం డాక్టరీ చెయ్యలేవు.'

'నువ్వోసారి ఆ స్త్రీని చూస్తే నీకే అర్థం అవుతుంది నాబాధ. రేపు మనిద్దరం కలిసి వెడదాం. ఈరోజే మెంటల్ క్లినిక్‌కి మార్పించమన్నాను నువ్వామెతో మాట్లాడి తరువాత చెప్పు. సరేనా? ఒట్టెయ్యి' అని అమాయికంగా పిల్లలు అడిగేటట్టు అడిగే కళ్యాణిని చూసి నవ్వుకుంది శాంత.

'[illegible]నాడే తప్పకుండా వెడదాం' అయితే

తెలుగు సినిమాలాడే ఊరి మేదరులో వుంటే మనం పస్తులుండి చూడాల్సిందే— మహా బోరటికే పోదాండా!!



యిక్కువ్వాళ్ళు అవని కానివ్వాలి. సాయంత్రం 'నేను ఊరికివెళతాను' అంది శాంత.

అమాత్రం దానికే సంతోష పడింది కళ్యాణి.

'ఓ తప్పకుండాను. ఉదయమే చూసి వద్దాం. అయితే నువ్వు కేసు తీసుకొనేదీ లేనిదీ సాయంత్రం చెప్పి మరీ వెళ్ళాలి.' అంది కళ్యాణి.

'అబ్బ, అలాగే లేవోయ్ ఇదో పెద్ద కేసులా ఉంది నీకు.' అంటూనే లేచింది శాంత.

శాంత ఈమాత్రం అన్నాక ఎంతో ధైర్యం వచ్చింది కళ్యాణికి. గుండెలమీది మంచి బరువు తీసేసినట్టు ఫీల్ అయింది. ఆరాత్రి ఒళ్ళుతెలియని నిద్రపోయింది కళ్యాణి...

ఉదయం ఏడున్నరకల్లా డ్రెస్ చేసుకుని కారుతీసుకు బయలుదేరింది శాంత ఇంటికి దారిలో ఏవేవో ఊహించుకుంటూ వెళ్ళింది. కాని శాంత అన్నమాట ప్రకారం సిద్ధంగా ఉండడంతో అనుమానాలన్నీ గాలిలో కలిసి పోయాయి కళ్యాణికి.

స్నేహితురాళ్ళిద్దరూ కబుర్లు చెప్పు కొంటూ మెంటల్‌క్లినిక్ ఆవరణలో దిగారు. రకరకాల కేకలు, కూతలు, గోల వినవస్తోంది. ఉదయం ఇచ్చే టిఫిను గ్రాటిస్లే అవుతున్నాయి. హాస్పిటల్ అంతా హడావిడిగానే ఉంది. సూపర్నెంటు గదికి దారితీసింది కళ్యాణి కాగితాలు చూసు కుంటున్నారాయన.

'క్షమించండి. నేను డాక్టర్ కళ్యాణి. ఈమె లాయరు. నిన్న ఒకామెను ఇక్కడికి పంపించారు. ఆకేసు విషయంతో వచ్చాం.'

'ఓ ఎస్. నిన్ననే మార్చేశాం ఇక్కడికి. బాగుపెట్టి. చాలా నెమ్మదస్తురాలిలా ఉంది. అసలు ట్రబులే లేదు.' అంటూ గంట కొట్టారు సూపర్నెంటు. ఒక జవాను వచ్చాడు.

'వారిని 'క' వార్డుతో ఆరోనెంబరుకి తీసుకువెళ్ళు!' అని పురమాయించారు.

జవాను వెంట నడిచారు డాక్టరూ, లాయరూ.

(ఇంకా వుంది)



# చిత్ర జగత్తులో కళాదర్శకుని పాత్ర

ప్రస్తుత ప్రపంచంలో సినిమాపరిశ్రమ దినదినాభి వృద్ధి చెందుతుందనడంలో అతిశయోక్తి లేదు. పూర్వంకన్నా సాంకేతికంగా ఎంతో ముందుకొచ్చింది.

తెరమీది పాత్రలను ఎంత గొప్పగా మెచ్చుకుంటామో, తెరవెనుకనున్న పాత్రలను అంతకన్నా అధికంగా శ్లాఘించవలసి ఉంటుంది. న్యాయం కూడాను. కారణం — సాంకేతిక నిపుణుల మస్తిష్కాలనుండి ఉద్భవించిన రసధారలే తెరమీది పాత్రల ద్వారా మనం ఆస్వాదించగలుగుతున్నాము.

తెరవెనుక శ్రమించేవారిలో కవి, దర్శకుడు, కళాదర్శకుడు, ఛాయాగ్రాహకుడు, సంగీతదర్శకుడు ముఖ్యులు. తెరమీద మనము చూచే భవనములు, సుందరమంటపములు, ప్రాసాదములు, దుస్తులు, ఆభరణములు, ఇంకా ఎన్నో దృశ్యములకు మూలపురుషుడు కళాదర్శకుడు. ఒకటేమిటి సినిమాలో కనుపించే ప్రతిదీ కళాదర్శకుని సృజనాత్మకశక్తియే అంటే సృష్టికి ప్రతిసృష్టి సృష్టిస్తున్నాడు దాదాపు కళాదర్శకునకు తెలియని విషయం ప్రపంచంలో లేదేమో అనిపిస్తుంది. కళాదర్శకుడు ఎంత సుందరంగా రూపకల్పన చేస్తాడో అంత అందంగా తయారౌతుంది, చిత్రం

చలనచిత్రాలను పౌరాణిక చిత్రాలు, చారిత్రాత్మక చిత్రాలు, జానపద చిత్రాలు, సాంఘిక చిత్రాలు, అని నాలుగు రకాలుగా విభజించారు.

రామాయణ, భారతాది పురాణగాథలను గురించి తీసే చిత్రాలను పౌరాణికాలనియు, జీవిత, దేశ చరిత్రలను గురించి తీసే చిత్రాలను చారిత్రకాలని, కాశీ మజిలీవంటి కల్పిత కథలను తీసే చిత్రాలను జానపదాలనియు, నేటి సమాజ సమస్యలను గురించి తీసే చిత్రాలను సాంఘికాలని అంటారు.

చిత్ర నిర్మాణానికి ముందు దర్శకుడు, కవి, కళాదర్శకుడు కలిసి తీయబోయే యితివృత్తాన్ని గురించి చర్చించుకుంటారు ఒకరి ఉద్దేశ్యాలను, మరొకరు అవగాహన చేసుకుంటారు ఆ యితివృత్తానికి తగిన వాతావరణాన్ని రేఖలద్వారా రూపకల్పన చేసి చూపుతాడు కళాదర్శకుడు. నిర్మించబోయేది పౌరాణికమో, జానపదమో, సాంఘికమో తెలుసుకొని, దానికి తగినట్లు భవనములకు, దుస్తులకు, తల వెంట్రుకలకు (కేశాలంకరణకు) ఆభరణములకు తగిన స్కెచ్‌స్ వేస్తాడు. ఉదాహరణకు శ్రీ కృష్ణుని జీవితమునే కథావస్తువుగా తీసుకొని నిర్మించబోతున్నాడు, నిర్మాత. అప్పుడు కళాదర్శకుడు, శ్రీ కృష్ణుడు ఎలా ఉంటాడు? ఆయన వేష భూషణాదు లెలా ఉంటాయి? ఇత్యాది విషయాలు తెలుసుకోవాలి అవి తెలియాలంటె ప్రబంధగ్రంథ పరిజ్ఞానం ముఖ్యం. భాగవతంలో ఎలా వర్ణించబడ్డాడో దాన్ననుసరించి మకుటం మొదలుకొని, కాలి అందియవరకూ స్కెచ్‌స్ వేస్తాడు శ్రీ కృష్ణుడు నివసించే సౌధాలు, మంటపాలు, అన్నీ ఆనాటి వాతావరణానికి తగినట్లు రేఖా చిత్రాలు గీయాలి

కథావస్తువు చరిత్రాత్మక మైనదైతే, కథాకాలము ఏనాటిదో, కథానాయిక నాయకులు ఏ సాంప్రదాయానికి చెందినవారో, వారి కాలమున వాస్తు శాస్త్రవిధానము ఎలాగుందో, వారి వేషభూషణాదు లెలాగున్నాయో తెలిసికొని, ఆనాటికి తగినట్లు నమూనాలు ఇచ్చి, ఆ కాలము ప్రేక్షకుల కన్నులకు కట్టినట్లగుపించేలా తయారు చేయించాలి.

ఒక రైతు జీవితాన్ని కథావస్తువుగా తీసుకొని చిత్రనిర్మాణం చేయబూనినప్పుడు, ఆ రైతు గొప్ప ధనవంతుడా, మధ్య తరగతికి చెందినవాడా, లేక పూట నస్తుండే కుటుంబీకుడో తెలుసుకోవాలి. అతని పరిస్థితికి అనుగుణంగా ఇంటి నమూనా యిచ్చి సెట్ వేయించాలి. అప్పుడే చిత్రానికి సహజత్వం ఉట్టిపడుతుంది. ఆదృశ్యం ప్రదర్శ్యమై, ప్రేక్షకహృదయంలో శాశ్వతంగా నిలిచిపోతుంది.

కళాదర్శకు డిచ్చిన సెట్ స్కెచ్‌ని బట్టి, గ్రాఫ్ పేపర్ పై చూపిన కొలతల ప్రకారం కార్పెంటరీ సెక్షన్ వారు సెట్ తయారు చేస్తారు, స్టూడియోలో. మౌల్డింగ్ సెక్షన్‌వారు దానికి నగిషీలు తయారు చేస్తారు పెయింటింగ్ డిపార్ట్‌మెంట్‌వారు, దానికి (సెట్‌కు) తగిన



రంగులువేసి సుందరంగా తయారుచేస్తారు.

తరువాత కళాదర్శకుడు, సహాయ కళాదర్శకునిచేత, ఆ సెట్‌కు తగిన వస్తువులతో (పరికరాలతో) అలంకరింపచేయించి షూటింగ్‌కు సిద్ధం చేయిస్తాడు.

అలాగే (కాస్ట్యూమ్స్) దుస్తులకు తగిన స్కెచెస్ వేసి టెయిలరింగ్ డిపార్ట్‌మెంట్‌వారిచేత తయారు చేయిస్తాడు ఆ తయారైన దుస్తులకు 'చమ్కీవాళ్లు' తగిన నగిషీలు చేసి మెరుగులు దిద్దుతారు.

అదేవిధంగా మేకప్ డిపార్ట్‌మెంట్‌వారు, హెయిర్ డ్రెసర్స్ (కేశాలంకరణవారు) కళాదర్శకుని స్కెచెస్‌ను ఆధారంగా తీసుకొని నటీనట బృందానికి అలంకరణలు చేస్తారు. ఇన్ని డిపార్ట్‌మెంటులవారికి సలహాలిస్తూ తనపని పూర్తి చేయించుకునే బాధ్యత కళాదర్శకుడిది ఎంతో పరిపూర్ణ జ్ఞానం కావలి అందుకే సామాన్య మానవునిలా అన్ని ప్రదేశాల్లో తిరుగుతూ సహజత్వాన్ని అన్వేషించాలి కనుపించే ప్రతి దృశ్యాన్ని చిత్రించుకొని, సంతన చేసుకొని అవసరమైన చోట ఉపయోగించుకోవాలి. ఈ శ్రమతోబాటు గ్రంథపరిచయము, ప్రపంచ జ్ఞానము అవసరము అప్పుడే తాను, తన స్థానానికి, వృత్తికీ న్యాయం చేకూర్చ గల్గుతాడు.

కాని ప్రస్తుతం సినిమా ప్రపంచంలో కళాదర్శకుడే కాదు, దాదాపు ప్రతిసాంకేతిక నిపుణుడూ తన భావాలను, స్వాతంత్ర్యాన్ని కొంత చంపుకొని వ్యాపారరీత్యా (Commercial) నడుచుకోవలసి వస్తుంది నిర్మాత, అల్పకాలంలో అతిచౌకలో సెట్ కావాలని కోరతాడు. విధిగా ఆయన్ననుసరించాలి కళాదర్శకుడు అలాంటప్పుడు ఆ సెట్‌లో గొప్పతనం (Richness) ఎలా కనిపిస్తుంది? సహజత్వానికి దూరమైపోతుంది ఇది కేవలం కళాదర్శకుని దోషంకాదు. నిర్మాతలు వ్యాపారదృష్టితోచూచి కళాదర్శకునిలోని సహజత్వాన్ని ఒక్కోసారి ఉపయోగించుకోలేక పోతున్నారు.

ఐనా తమ ప్రత్యేకతలను ప్రదర్శించుకునే స్వేచ్ఛా కళాదర్శకులింకా ఉన్నారు కాని—సుఖమయ జీవితానికి బహుదూరములో ఉన్నారు.

—గెనిసెట్టి


తన్నయ్యా అభివృద్ధిలోని పరమరహస్యం
"తన్నయ్యా! నీ వింత అభివృద్ధిని ఎలా సాధించావు?"
అదా ...! నాతో రండి. చూపిస్తాను.
ఇదిగో ......నా పొలాన్ని చూడండి .... నా ఎద్దులు ఎంత బలంగా ఉన్నవో! ఎంత కష్టపడి చాకిరి చేయగలుగుచున్నవో! ఎంత ఫలసాయాన్నిస్తున్నవో!
నా ఆవు, గేదె ఎంత ఎక్కువగా మంచి పాలు ఇస్తున్నవో తెలుసా....? నా కోళ్ళు ఎల్లప్పుడూ నీరసపోకుండా ఎంత పెద్దవి, మంచి గ్రుడ్లు పెడ్తున్నవో తెలుసా....!
అదిసరే... ఇందులోని రహస్య మేమిటి?
ఈ రహస్యాన్ని మన ఊరిలో ఎవ్వరికి చెప్పకండేం...
రహస్యం ఏమిటంటే.... .... క్రొత్తపద్ధతిలో ఓ.కె. కంపెనీవారు చెన్నపట్టణం ఫాక్టరీలో తయారుచేయబడిన ఎక్కువ బలమునిచ్చే ఓ.కె. పిండిని విశేషముగా తెప్పించి వాడటమే .... ....
మీ ఎద్దులు, కోడెలు పుష్టి కలిగి ఎక్కువగా పనిచేయాలంటే.... ....
మీ ఆవులు, గేదెలు ఎక్కువగా మంచి పాలు ఇవ్వాలంటే.... ....
మీ కోడిపెట్టలు బలంగా పెరిగి మంచిపీ పెద్దవైన గ్రుడ్లు పెట్టాలంటే... ...
ఓ.కె. విటమినులుగల పశువుల పిండినే విరివిగా వాడండి!
OK
CATTLE FEED
OK
విటమినులుగల ఓ.కె. పశువుల పిండిని విరివిగా వాడి మీ పశుసంపదను అభివృద్ధి చేసుకోండి.... ....
ది ఈస్టు ఏషియాటిక్ కంపెనీ (ఇండియా) ప్రైవేటు లిమిటెడ్, మదరాసు-1.

**అభియోగాలలో వింతలు**

# పెళ్ళి చేసుకోబోతూ తుపాకీగుండ్లనెదుర్కొన్న మహిళ

రాజ్ పాటిసన్ వయస్సు 28 సంవత్సరాలు. ఆగస్ట్ 16 న పెండ్లి చేసుకోడానికి బయలుదేరి వెళుతూండగా దోవలో ఆమెపై ఎవరో కాల్పులు జరిపారు. తుపాకీగుండ్లతోనే రిజిస్ట్రార్ కార్యాలయానికి వెళ్ళింది. పెండ్లి నమోదయినది. ఆమె భుజంలో ఇరుక్కున్న గుండ్లను ఇంకా తొలగించలేదు.

'ఏమిటో గుండుదెబ్బ తగలగానే మరో లోకంలోకి పోయినట్లనిపించింది. రిజిస్ట్రార్ అడిగిన ప్రశ్నలకు గబగబా సమాధానాలు చెప్పేశాను' అన్నది రాజ్ పాటిసన్ విచారణలో

వరుడు శ్రీ కొలిన్ కార్టర్ వయస్సు 27 సంవత్సరాలు నార్‌పోల్క్, ఫించామ్‌లో టెలివిజన్ సంస్థ మేనేజరు. ఇట్లా చెప్పాడు : 'త్వరలో తొలి ప్రణయ విహారానికి వెళ్ళనున్నాము. ఎంత త్వరగా ఇక్కడినుంచి బయటపడితే అంత హాయిగావుంటుంది. మా యిద్దరికీ.'

రాజ్‌పాటిసన్‌మీద కాల్పులు జరిపాడని లొవాల్డ్ బెకెట్‌మీద నేరారోపణ జరిగింది. వయస్సు 39 సంవత్సరాలు. బ్రహ్మచారి. మార్చి స్టేషన్‌వద్ద 'బస' నిర్వహిస్తూంటాడు. బెకెట్‌ను 'నిర్బంధంలో వుంచారు.'

## 'నేను బాలికనే' నన్న 20 సంవత్సరాల మహిళ

బ్రెండా వుడ్ వయస్సు 20 సంవత్సరాలు. వివాహమయింది. విద్యానిబంధనల ప్రకారం 'నేను చిన్నపిల్లనే కనుక నన్ను బళ్ళో చేర్చుకుని ఉచిత విద్యాబోధనల సౌకర్యం ఇవ్వాలని' వాదించింది.

ఉపాధ్యాయశిక్షణ కళాశాలలో ఆమెను చేర్చుకునే వీలు నిబంధనలలో వున్నదా? లేదా అనే అంశాన్ని బెడ్‌ఫర్డ్‌షైర్ విద్యాసంస్థ అధ్యక్షుడు అల్డర్మన్ లెస్లీ బవుల్స్ పరిశీలించారు.

కాని బెడ్‌ఫర్డ్‌షైర్ కౌంటీ కౌన్సిల్ మరొక విధంగా అభిప్రాయపడినది. శ్రీమతి వుడ్ వయస్సు 21 సంవత్సరాలలోపే కనుక ఆమె తల్లిదండ్రులు సంవత్సరానికి పౌ. 73 ల చొప్పున మూడు సంవత్సరాలు చెల్లించాలని కౌంటీకౌన్సిల్ నిర్ణయించింది. అంతటితో ఉపాధ్యాయ శిక్షణ సౌకర్యాన్ని ఆమె వదులుకున్నది.

ఈ వింత అభియోగం గురించి అల్డర్‌మన్ బవుల్స్ చాలా బాకబు చేశాడు. చివరికి ఇట్లా చెప్పాడు: 'మనం చేయగలిగిన దేమీ లేదు. నిబంధనలను విద్యాశాఖ రూపొందిస్తుంది. మన సొంత నిర్ణయాలకు అవకాశం లేదు.'

శ్రీమతి వుడ్ నివాసం డన్‌స్టబుల్, ఓల్మా రోడ్‌లో. రుసుమంతా సహాయంగా లభించే సౌకర్యం వుంటే తప్ప కళాశాలలో జేరి శిక్షణ పొందే స్తోమత లేదామెకు. 'అట్లా కాదు—నా భర్త సంపాదన వారానికి పౌ 15 లే కనుక రుసుం చెల్లించ నవసరంలేకుండానే శిక్షణ పొందడానికి నేను అర్హురాలినే' అంటుంది శ్రీమతి వుడ్స్.

శిక్షణకయ్యే రుసుమంతా ఇస్తామని ఆమె తల్లిదండ్రులన్నారు. కానీ ఆమె అంగీకరించలేదు. చివరికి ఇంతకుముందు తను చేసిన ఉద్యోగంలోనే ఆమె తిరిగి చేరవల వచ్చినది.

## 'ఒక్క నిమిషమాగు ప్రియా'!

బ్రెజిల్, మొరీరా జైలునుంచి తప్పించుకుపోవాలని జోవో కొస్టా తలకు విగ్గు తగిలించుకున్నాడు. జైలు 14 వ వార్షికోత్సవం జరుగుతున్నందున అందరూ హడావుడిగా వున్నారు.

ఈ ఘరానా దొంగ ఆడవేషంలో చిరునవ్వు లొలక బోస్తూ జైలు చూడడానికి వచ్చిన అతిథులలో కలిసిపోయారు. జైలు మూడు గేట్లలో ఒకదాన్ని దాటాడు రెండవగేటువద్ద కావలా పోలీస్ ముద్దు ఇచ్చాడు కావలా పోలీస్ వళ్ళు పులకరించింది. దొంగను వెళ్ళనిచ్చాడు. మరి దొం! అని తెలియదుగదా!

సింహద్వారం మూసివున్నది. తెరిచేవరకూ కొస్టా ఆగవలసివచ్చింది. అంతలో కావలా పోలీస్ కొస్టా దగ్గరకువెళ్ళి నఖశిఖ పర్యంతమూ పరీక్షగా చూచాడు. ఈ 'అమ్మాయి' కాళ్ళనిండా వెంట్రుకలు కనిపించినవి.

'ఏం యిట్లా వచ్చావు ప్రియా! ఏం కావాలి?' అన్నాడు కొస్టా వయ్యారంగా.

'ఓ క్షణం ఆగు ప్రియా. ఆ గుడ్డలు విప్పేయ్. వగలమారీ వదిలెయ్యకపోతే కాల్చేస్తాను' అన్నాడు కావలా పోలీస్.

- వి. ఎస్. అవధాని



గడ్డం క్రింద చేయి ఆనించి వుంచుకుని దూరంగా కొండమీద తెరలు తెరలుగా కురుస్తున్న వర్షం వంక చూస్తూ కూర్చు న్నాడు సింహాచలం. చలిగాలి విసురుగా వేగంగా వస్తున్నది. కొట్టుమీదవున్న రేకుల పైన రాళ్లు కురిసినట్టు దడదడమని ధ్వని వినిపిస్తున్నది. ఎదురుగా గాలికి అటూ ఇటూ వూగుతూ వర్షంలో తడుస్తున్నాయి పొడుగాటి చెట్లు. ఏ సాంద్రారణ్యంలోనో బలిసిన ఏనుగులన్నీ ఒకచోట చేరినట్టు మబ్బులు ఆకాశంలో గుమికూడి గర్జిస్తు న్నాయి. ఆ మబ్బులను చీల్చుకుని అప్పు డప్పుడు కళ్లు మిరుమిట్లు గొలిపేలా ఆకాశంలో గీతగీసినట్టు తళతళ మెరు స్తున్నది మెరుపుతీగ...

'ఛీ! ఎదవ ముసురు...' అనుకున్నాడు సింహాచలం విసుగ్గా...అయిదారు రోజుల నాంచీ ఒకటే ముసురు...ఎడతెగకుండా రాత్రి పగలూ ఒకటే వర్షం.. దూరంగా కనపించే కొండలనూ, అడవులనూ నీళ్లలో ముంచేస్తినట్టయింది. ఎక్కడ చూసినా నీళ్ళు...బురద...

సింహాచలం పాత మఫ్లరు చెవుల చుట్టూ చుట్టుకుంటూ కళ్లు పెద్దవి చేసుకుని చూశాడు. దూరంగా సన్నని తారు రోడ్డుమీద జీపు ఒకటి వస్తున్నది. అతడు లేచినిలబడి వొళ్లు విరుచుకున్నాడు. నోరంతా చేదుగావుంది. పక్కన సీసాలో అడుగున వున్న పిప్పరమంటు తీసుకుని నోట్లో వేసుకుని అతడు చూరు క్రిందికి వచ్చి నిలబడ్డాడు...అవతల చిన్న పాకలో వుండే గురవయ్య కొడుకు వెంకడు అంత వర్షంలోనూ వొంటిమీద చొక్కాలేకుండా చేతిలో రెండుమూడు ఉప్పు చేపలతో, ఒకచిన్న నూనెసీసాతో తడుస్తూ నడిచి పోతున్నాడు.



## పెద్దిభొట్ల సుబ్బరామయ్య

దీపావళి కథల పోటీలో

మొదటి బహుమతి రు. 1600 లు పొందిన కథ

అంతకుముందు తారురోడ్డు మీద దూరంగా కనిపించిన జీపు మలుపు తిరిగి ఎటుపోయిందో, యిప్పుడు కనిపించడంలేదు. మరి కొద్దిసేపాగితేగాని అది మళ్లీ కనిపించదు. సింహాచలం 'వాళ్లేనేమో...' అనుకుంటూ మాసినగడ్డాన్ని చేతులతో తడుముకుంటూ అలాగే నిలబడ్డాడు. లోపల పాకలో ఏదో చప్పుడవుతున్నది.

ఇంతలో బంగారయ్య తాటాకుగొడుగులో వచ్చి 'బీడీలియ్యవయ్యా...'అన్నాడు. సింహాచలం బీడీకట్ట తీసి యివ్వబోతే తీసుకోకుండా తల వూపి 'నువ్వు మన లోకంలో ఉండేట్టులేదే...ఏం కత? ఈ బీడీ లెప్పుడన్నా తాగానా నేను?' అని అడిగాడు.

సింహాచలం వెంటనే 'నీ మార్కు బీడీల్లేవు...ఇయాళ్టికి ఈటితో సరిపుచ్చుకో... ఈ ముసురు తెరిపిస్తే ఎళ్లి సరుకులన్నీ పట్టుకొస్తాను...అన్నీ నిండుకుండయ్...' అన్నాడు.

బంగారయ్య నవ్వుతూ ఆ బీడీకట్ట అందుకుని ఒక బీడీ యివతలికితీసి వెలిగించుకుని 'ఇంక నువ్వేం ఎల్తావులే...బంగారమంటి కోమటి.. సంగీతంతో సెడ్డాడంట... అన్నాను...ఇన్నాను...అంతా ఇన్నానయ్యా... కలికాలం బుద్ధులట్టా ముంచుకొస్తావుంటే విన్నని ఏం లాభం?' అన్నాడు. సింహాచలం బొమ్మలా నిలబడిపోయాడు. బంగారయ్య అంతలో కదిలి 'పద్దు రాసుకో...' అంటూ వెళ్లిపోయాడు

సింహాచలానికి వొళ్లు మండింది. కోపంతో క్రింది పెదవిని కొరుక్కుంటూ నిస్సహాయంగా నిలబడి దూరంగా రోడ్డుమీదికి చూశాడు. అంతలో జీపు మళ్లీ కనిపించింది. రెండుమూడు నిముషాలలోనే అది వేగంగావచ్చి అతని కొట్టు ముందు ఆగింది. దాని చుట్టూ వర్షపుజల్లు పడకుండా తెరలున్నాయి. లోపల ఎవరున్నారో కనిపించడంలేదు. అంతలో ఒకాయన బరువైన బూట్లతో దిగి, గొడుగు విప్పి, విసుక్కుంటూ, నీళ్లను చిందగొడుతూ నడిచి వచ్చి 'ఏమయ్యా! గోల్డ్‌ఫ్లేక్ సిగిరెట్లున్నాయా?' అని అడిగాడు.

సింహాచలం తల అడ్డంగా వూపి వినయంగా 'లేవు బాబూ! చార్మినార్ తప్ప ఏవీ లేవు...పాడు ముసురు...ఎవెల్లేందుకూ ఈల్లేకుండా...'అని చెప్పాడు.

ఆయన జీపువైపు తిరిగి పెద్దగా 'ఫోర్ కొజిల్స్ తప్ప మరేవీ లేవుట...తెమ్మంటారా?' అని అరిచాడు.

ఎవరో చెయ్యి బైటికిపెట్టి 'తెమ్మ'ని సైగచేసి మళ్లీ వెంటనే చేతిని లోపలికి తీసుకున్నారు. ఆయన సింహాచలం వంక తిరిగి 'సరే... నాలుగు ప్యాకెట్లివ్వు...' అంటూ డబ్బు తీశాడు.

సింహాచలం సిగిరెట్ ప్యాకెట్లు ఆయనకు అందించి రూపాయికొయితం తీసుకుని మిగిలిన చిల్లర యిచ్చాడు. ఆయన వాటిని కోటుజేబులో పడేసుకుని మళ్లీ విసుక్కుంటూ నీళ్లను చిందగొడుతూ జీపు దగ్గరికి వెళ్లాడు. ఆయన ఎక్కగానే జీపు కదిలి అంతలోనే కనుచూపుమేర దాటిపోయింది.

సింహాచలం చేతులు రుద్దుకుంటూ కొద్ది క్షణాలు నిలబడ్డాడు. తర్వాత బంగారయ్య మాటలు గుర్తువచ్చాయి. "ఏదో...ఇన్నాడంట...ఆడిబొంద... పొట్టి తాగుబోతు ఎదవ..." అనుకున్నాడు. మొన్న మొన్నటి వరకూ బంగారయ్యకు నిద్దలో నడిచే జబ్బుండేది. రాత్రిపూట అటూఇటూ తిరుగుతూ కనిపించేవాడు...ఒకనాడు అర్ధరాత్రివేళ నిద్దలోనే నడుస్తూవచ్చి ఒక ఎద్దు ముందుకు వెళ్లి నిలబడ్డాడు. అతని అదృష్టం మంచిదికావడాన, అతని పెళ్లాం మెడలో నల్లపూసలతాడు గట్టిది కావడాన సింహాచలం అప్పుడు మేలుకునివున్నాడు. గభాలున లేచి వెళ్లి యివతలికి ఈడ్చుకురాబట్టి బతికిపోయాడు...లేకపోతే ఆనాడు ఆ పోట్ల ఎద్దు అతన్ని కుమ్మికుమ్మి చంపేసివుండేది...

సింహాచలం చిన్నపుస్తకం తీసి అందులో బంగారయ్యపేర బీడీకట్ట పద్దురాసి, ఏమి తోచక ఎవరెవరు ఎంత బాకీవున్నారో లెక్కచూస్తూ కూర్చున్నాడు. గుర్నాధం... ఆయనొక కంట్రాక్టు గుమాస్తా...పది రూపాయల చిల్లరయివ్వాలి. రంగడు...వీడు ఎరువుల ఫ్యాక్టరీలో కూలీ...అయిదురూపాయల పదిపైసలు. అప్పలస్వామి...కొండ మీది బంగళాలో వాచ్‌మన్...పదిహేను రూపాయలు. పోతరాజు.. వీడికి పనీపాటూ లేదు...పెళ్లాం అడవిలో పుల్లలేరుకుని కట్టలుకట్టి కైలాసగిరి దగ్గర అమ్ముకొచ్చి పెడుతుంటే తిని జలాదూరు తిరుగుతూ వుంటాడు...ఎనిమిది రూపాయల యిరవై పైసలివ్వాలి...పైగా పెళ్లానికి చెప్పొద్దని కాళ్లు పట్టుకుంటాడు. సుబ్రమణ్యం... ఈనకు వెలజీతం ఎంతో తెలీదు...గోల్డ్‌ఫ్లేక్ తప్ప మరొకటి కాల్చడు... పద్దెనిమిది రూపాయలివ్వాలి...

సింహాచలం ఆ చిన్నపుస్తకంలో పేజీలు తిప్పుతున్నవాడల్లా ఒకచోట ఆగిపోయాడు. తర్వాత నిట్టూర్చాడు. ఆ పేజీలో పైన వంకరటింకర అక్షరాలతో 'సింగారవేలు' అని పేరు వ్రాసివుంది. క్రింద కాతా... తర్వాత ఒక గీత...పేజీ చివర మూడు రూపాయల పదిపైసలు లెక్క...

సింగారవేలు అతని కళ్లలో మెదిలినట్టయింది. సింగారవేలు సన్నగా పొడుగ్గా చువ్వలా వుండేవాడు...ఎల్లప్పుడూ లుంగీ పైకి కట్టుకుని నవ్వుతూ తిరుగుతూ వుండేవాడు...వచ్చీరాని తెలుగులో మాట్లాడుతూ అందర్నీ నవ్విస్తూ వుండేవాడు... అక్కడే బల్లమీద కూర్చుని మద్రాసును గురించీ, అక్కడి సినిమాలను గురించీ ఎడతెగకుండా కబుర్లు చెబుతూ వుండేవాడు...

సింహాచలం ఆలోచనలకు అడ్డుకట్టవేసి పక్కకు చూశాడు. అప్పలస్వామి చిరుగుల గొడుగులో వచ్చి చూరుక్రింద నిలబడి దాన్ని నెమ్మదిగా మూసి ఒక పక్కనవుంచి 'ఏమయ్యా! సివ్వాచలం — జేరం లేదనుకుంటానే బొత్తిగా...' అన్నాడు కూర్చుంటూ.

సింహాచలం తల అడ్డంగా వూపి నిట్టూర్చి 'ఇట్టా ముసురు పట్టింది గదా! ఏంచెయ్యను చెప్పు ... ఒక్క సరుకు లేదు కొట్లో...'అన్నాడు.

'అవునవును...ఇది గాలివానంట...బంగళాలో పెద్దోళ్లనుకుంటావుంటే ఇన్నాను. ఇప్పట్లో తగ్గదంట...' అని చెయ్యి చాపి 'ఏదీ? బీడీకట్ట అందుకో...! అన్నాడు అప్పలస్వామి...

సింహాచలం లేచి బీడీకట్ట యిచ్చి పద్దు తీసి పదిహేన్రూపాయలైంది నీ పద్దు... బొత్తిగా డబ్బులేదు...ఎప్పుడిస్తావు?' అని అడిగాడు.

అప్పలస్వామి బీడీ ముట్టించి అగ్గిపుల్లను విలాసంగా ఆర్పి అవతల పారేస్తూ

'ఛా...మావ్యా! డబ్బు లాసేయ్...' అన్నాడా తర్వాత ఒక్క క్షణం ఆగి లోపలికి చూసి అదోకరకంగా నవ్వుతూ 'అయినా నీకిప్పుడు డబ్బు కు కొదవేంటిలే...ఇలే పిట్టను పట్టావు.. నాకు తెలుసుగా దాని మెడ నిండా బంగారమే...అన్నట్టు కధ ఎందాకా వొచ్చిందేం? అయినా నా పిచ్చిగాని నువ్వు చెప్తావా? ఏదో చాదస్తం కొద్దీ అడిగా నంతే...' అని ఊరుకున్నాడు.

సింహాచలం కళ్ళు ఎర్రబడ్డాయి. కోపం పొంగివచ్చింది అయినా తమాయించుకుని ఏమీ మాట్లాడకుండా అలాగే నిలబడి పోయాడు. అప్పలస్వామి కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చుని తీరిగ్గా బీడీ కాల్చుకుని లేచి నిలబడి తలగుడ్డ విదిలించి చుట్టు కుంటూ 'తిరపతిగాడు...అదే నీ మావ... కోపంతో చిందులు తొక్కుతున్నాడయ్యోయ్.. లచ్చి కూడా మొన్న కనబడింది. ఒకటే ఏడుపంట రాత్రీపగలూ.. తండ్రీ కూతుళ్ళు నీ పేరు ఇంకోసారి మండిపడిపోతా వుండారు...అయినా నువ్వు నాకు నచ్చావు... ముందు మన లాభం చూసుకోవాలి.. లేక పోతే ఈ లోకంలో బతకలేం. మంచిపనే చేశావ్...కానియ్. కానియ్...' అంటూ గొడుగు తెరుచుకుని వెళ్ళిపోయాడు.

సింహాచలం నిస్సహాయంగా చూస్తూ కొయ్యబొమ్మలా నిలబడిపోయాడు. ఒక్క నిముషం ఆగి ఎవరో తరుముకు వచ్చినట్టు లోపలికి పరుగెత్తుకు వెళ్ళాడు. లోపల పెరియనాయకి దుప్పటిమీద తడిచీరను ఆర బెడుతున్నది. అడుగుల చప్పుడు విని వెను

# ముసురు

దిరిగి సింహాచలం వంక చూసింది. ఆమెని చెంపకు చేరడేసి కళ్ళు...ఆ కళ్ళలో స్పష్టంగా కనిపించేది అమాయకత్వం...చామన చాయ వొంటిరంగు...ప్రత్యేక శ్రద్ధతో తీరిగ్గా కూర్చుని ఎవరో శిల్పి మలిచి నట్టుండే చక్కని విగ్రహం....

మనసులో అనుమానం తీరగానే సింహాచలం మళ్ళీ వెనుదిరిగి కొట్టుమీదికి వచ్చాడు. అతనికి ఈ అయిదారురోజుల నుంచీ కంటిమీద కునుకులేదు. మనసులో ప్రశాంతత లేదు ఆమె పరాయిమనిషి మన భాష తెలీదు...కళ్ళు పెద్దవి చేసుకుని అమాయకంగా చూడ్డం తప్ప మరేమీ చేతకాదల్లేవుంది ఆమెకు. నిశ్శబ్దంగా ఏడుస్తూ ఒకమూల కూర్చున్నదీ అయిదారురోజులనుంచీ సింహాచలం ప్రతి నిముషమూ జాగ్రత్తగా వున్నాడు అతని మనసులో అనుమానం...ఆమె తన కన్ను గప్పి ఏ నిముషంలో ఏ అఘాయిత్యం చేస్తుందో అని దిగులు.. అందుకే కొట్లో సరుకులన్నీ నిండుకున్నా అతడు ఎక్కడికీ వెళ్ళలేదు. నిజానికి ఆ గుక్కెడు ప్రాణాలూ పోవడానికి ఎంత కావాలి? ఒక మూరెడు గుడ్డపేలికగాని తాడుగాని చాలు దొడ్లో బావి ఉండనేవుంది. అదీ గాకపోతే కొంచెం కిరసనాయిలూ...ఒక అగ్గిపుల్లా.. అన్నీ ఆమెకు అందుబాటులోనే వున్నాయి అందు వల్లనే అతడు రాత్రిపూట కూడా కంటి మీద కునుకులేకుండా మేలుకుని గడిపాడు.

ఎప్పుడన్నా కొన్ని నిముషాలసేపు కునుకు పడితే మెలకువరాగానే ఉలికిపడిలేచి చావిలున లోపలికి వెళ్ళి చూసేవాడు. తీరా చూస్తే ఆమె లోపల నేలమీద కొంగు పరుచుకుని పడుకుని నిద్రపోతూ వుండేది... పగటిపూట ధైర్యంచేసి ఆమెను వొంటరిగా వొదిలి సరుకులకోసం వెళ్ళినా ఆమెను గురించి, ఆమె మెడలో నగలను గురించి దిగులు తప్పదు...

అతడు కాళ్ళు ముడుచుకుని బల్లమీద కూర్చుని తాను అన్ని వివరాలతో ఉత్తరం వ్రాయించి ఎన్నాళ్ళయిందో వేళ్ళు మడిచి లెక్క వేసుకున్నాడు. ఎంత ఆలస్యంగా చేరినా వాళ్ళకు ఆ ఉత్తరం ఈపాటికి అందివుండాలి. వాళ్ళు ఈపాటికి బయలు దేరి రావాల్సిందే మరి.. అయినా ఆవాడు బంగళాలో ఉండే ఆ ముసలిపంతులు వాళ్ళ అడ్రసు సరిగ్గా రాసేడో, లేదో...అసలు ఆమె చెప్పిన అడ్రసు సరి అయినదో, కాదో.

అంతలో తిరపతి వానచినుకులలో తడుస్తూ తడబడుతూ నడుస్తూ వచ్చాడక్కడికి సింహాచలం లేచినిలబడ్డాడు తిరుపతి నుదుటినీ, కనురెప్పలనూ తుడుచుకుంటూ కూర్చుని ముందు అదోకరకంగా నవ్వాడు సింహాచలం ఏం మాట్లాడాలో, ఏం చెయ్యాలో తెలీని వాడిలా నిలబడివుండిపోయాడు.

తిరపతి సగానికి పైగా తాగి నట్టున్నాడు మనిషిలో నిలకడలేదు అతడంతలో సింహాచలం వంక క్రూరంగా చూస్తూ కొన్ని క్షణాలు ఏమీ మాట్లాడలేదు. తర్వాత హఠాత్తుగా 'ఏరా! నా ముద్దుల అల్లుడూ...అది లోపలే వుందా యింకా?' అని అడిగాడు.

సింహాచలం తల వూపి ఊరుకున్నాడు.

'అవును.. ఉంటదిలే...ఉండక మరింకెయాడికి పోద్ది పాపం...మంచి మొగోడివి దొరికావు ..అదింక నిన్ను వొదిలిపెట్టుద్దా ...అసలు మేమంతా తెలివితక్కువ నన్నాను లంరా. నువ్వొక్కడివే ఈడ తెలివిగల మొగోడివి. అంతే మరి.' అన్నాడు తిరపతి ఎగతాళిగా...

సింహాచలం తిరపతికి దగ్గరగా వచ్చి 'మావా! నువ్వు సెప్పుడుమాట లిన్నావు. తప్పుడు మాట లిన్నావు...అటిని నమ్మకు...తల్లితోడు...నే నే పాపం ఎరగను



...ఆ పిల్ల పాపం కష్టంలో వుంది. ఆళ్ల పెద్దోళ్లకు కార్డు రాయించి పడేసినాను. ఆళ్లొచ్చి ఆ పిల్లను తోలుకెళ్లిపోతారు... నా మాట నమ్ము...' అన్నాడు.

తిరపతి ఉన్నట్టుండి పెద్దగా నవ్వడం మొదలుపెట్టాడు. లేచి వంగిపోయి పొట్ట పట్టుకుని మరీ నవ్వాడు. తర్వాత అకస్మాత్తుగా గంభీరంగా మారిపోయి 'ఒరేయ్! నాకు యాభై ఏళ్లురా...ఇట్టాటి మోసపు మాటలీ సెవుల్తో ఎన్ని యిన్నానో లెక్కలేదు... గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించిందంట ...నాకు సదువులు నేర్పుతావురా దగాకోర్ ...లచ్చికి నీ సంగ తెల్తీదురా...పాపం పిచ్చిపిల్ల... నిన్ను నమ్మింది...ఇప్పు డందరికీ నీ ద్రోహం తెలిసిందిరా...అదురుష్టమంతు ఓడిలే మంచోళ్ల మద్దెనున్నావు... ఇంకో సోట అయితే పిచ్చికుక్క నాగా కొట్టి తరిమేసేవాళ్ళు...సరే...నీ కిప్పుడే చెప్పేత్తే మంచిది... లచ్చి మీన ఇంక ఆశలు పెట్టుకోమాకు.. దానికీ కోటిగాడికీ నిన్ననే మనువు కుదిర్చేసినాం...' అంటూ లేచాడు.

సింహాచలం నివ్వెరపోయాడు. విషయం యింత దూరం వొస్తుందని అతడు కలలో కూడా అనుకోలేదు. అతని నోట మాట రాలేదు. అవాక్కయి శిలాప్రతిమలా నిలబడి పోయాడు.

తిరపతి విజయం సాధించినవాడిలా లేచి నిలబడి లోపలికి చూస్తూ మెటికలు విరిచి 'అమ్మా! మహాతల్లీ! నువ్వెవురివో నాకు తెల్దు...కాని గొప్ప తెలివిగల్దానివి.. సుకపడ తావు...నా ఉసురు కూడా పోసుకు బతుకు' అంటూ కొంత దూరం వెళ్ళి ఆగి 'ఇది లోకంరా.. ఈడ తెలివి తక్కువోళ్లు ఎవురూ లేరు ..పైన దేవుడుండాడా ... అంతా సూస్తానే వుంటాడు. నీకూ, దానికీ కనా కష్టపు బతుకు రాసిపెట్టే వుందిలే... ఇంతకింత అనుబవిస్తారు ... ఎగిరి పడమాకండి...' అని తిడుతూ వెళ్ళిపోయాడు.

సింహాచలం సర్వస్వం కోల్పోయినవాడిలా ఒక్క నిముషం దీనంగా కూర్చున్నాడు. తర్వాత ఉన్నట్టుండి అతనికి కోపం ముంచుకువచ్చింది. లోపలచేరి యిరవైనాలు గ్గంటలూ ఏడుస్తూ ఈ పిల్ల అతని కొంపమీదికి తెచ్చింది అతని బతుకులో నిప్పులు పోసింది. ఆమె నిహ యిక్కణ్ణుంచి తరిమివేస్తే తప్ప లాభంలేదు. అతడంతలో కోపంతో మొహం కందగడ్డలా చేసుకుని పెద్ద పెద్ద అడుగులువేస్తూ లోపలికి వెళ్లాడు. పెరియనాయకి ఏం గుర్తువచ్చిందో ఏమో — పెరటి గుమ్మంలో కూర్చుని మెమ్మదిగా ఏడుస్తున్నది.

సింహాచలం చప్పగా చల్లబడిపోయాడు. అంతలోనే 'అయ్యో పాపం' అనిపించిందతనికి. దగ్గరికి వెళ్లి నిలబడి ఓదార్పుగా 'ఊరుకో అమ్మా! నువ్విట్టా కళ్లల్లోత్తలు పడేట్టు ఏడిత్తే మాత్రం ఆపోయినోడు తిరిగొస్తాడా? గుండె రాయిచేసుకో ... నా మాటినుకో...' అన్నాడు.

ఆమె కతని మాటలలో ఎన్ని అర్థమయ్యాయో అతనికి తెలియదు. అయినా కొంగుతో కళ్లు తుడుచుకుని ఏడుపు మానేసి దూరంగా కొండల వంకా, కొండల మీద దట్టంగా ఉన్న చెట్ల వంకా, చూస్తూ ఉండిపోయింది.

అంతలో వాకిట్లో ఎవరిదో నవ్వు వినిపించింది. అతడు వెంటనే యివతలికి వచ్చాడు. గుర్నాథం నెత్తిన గుడ్డ కప్పుని నిలబడి వుండి నవ్వుతూ సింహాచలం వంక చూసి 'రెండు సిగిరెట్లియ్యవయ్యా!' అన్నాడు. అతడు సిగిరెట్లు తీసుకుని తన దారిన తాను పోకుండా, 'ఓహ్! ఏం వాన! ఏం వాన! ప్రాణాలు తీసేసిందే...ఎప్పుడు తెరిపి యిస్తుందోగాని...సూర్య భగవానుడి దర్శనమే కాలేదు అయిదారు రోజుల నుంచీ.. నేను పుట్టి బుద్దెరిగిన తర్వాత యింతటి గాలి వాన చూళ్లేదనుకో...' అన్నాడు.

తర్వాత మళ్లీ ఒక్క క్షణం ఆగి 'అయినా నీకిదంతా పట్టదులే...హుషారుగా వున్నావు... నేనంతా విన్నాన్లే... మంచి పనే చేశావు....ఆపదలో వున్న ఆడపిల్లను రక్షించినట్టూ అయింది. నీకు మంచి లాటు దొరికినట్టూ అయింది. అంతే మరి...ఏ పని చేసినా ఇహ పరాలు రెండూ చూసుకోవాలి...' అంటూ విరగబడి నవ్వాడు. తర్వాత తన దారిన తాను వెళ్లిపోయాడు.

సింహాచలం మతిపోయిన వాడిలా కూలబడ్డాడు. తర్వాత వొణుకుతున్న వ్రేళ్లతో చెక్కబల్ల మీద కాస్సేపు తబలావాయించాడు. వెంటనే ఉన్నట్టుండి ఒక సోడా కొట్టుకుని గడగడా తాగి బీడితీసి ముట్టించాడు! అలవాటు లేనందువల్ల ముందు పొగ గుండెల్లోకి పోయి దగ్గు వచ్చింది. వెంటనే తమాయించుకుని కాళ్ళు బల్ల మీదికి జాపి కూర్చుని పారాతాగిన వాడిలా ఉద్రేకంగా 'ఒరేయ్! మీరందరూ మదుసుల్కారు...పసర్రాలా... ఆపిల్లకూ నాకూ రంకు కడతార్రంట్రా... ఒక్కొక్కడూ ... రండ్రా...మీ అంతు తేల్చేస్తాను...రండ్రా... ఒక్కొ దెబ్బతో అందర్నీ సఫా చేసేస్తాను... రండ్రా...' అని అరిచాడు పెద్దగా...

పెరియనాయకి లోపలి నుంచి వచ్చి చూసింది. అక్కడ చుట్టుపక్కల ఎవరూ లేరు. అతడెవరితో అలా ఉద్రేకంగా మాట్లాడుతున్నాడో ఆమె కర్థం కాలేదు.

అంతలో అతడు వెనుదిరిగి చూసి సిగ్గుపడిపోయాడు. బీడి అవతల పారేసి మామూలుగా కూర్చుని కూనిరాగం తీయడం ప్రారంభించాడు...కొన్ని క్షణాలు ఆగి వెనుదిరిగి చూస్తే ఆమె అక్కడలేదు. అతడు గుండెల నిండా గాలి పీల్చుకుని కళ్ళు మూసుకుని అలాగే కూర్చున్నాడు.

—అంతకుముందు చాలాసార్లు సింగారవేలు తనను గురించిన వివరాలూ, తన యిబ్బందులూ అన్నీ చెప్పుకున్నాడు. అతడక్కడికివచ్చి మూడునెలయిందేమో! వచ్చి రాగానే ఎరువుల ఫ్యాక్టరీలో పనిలో చేరి ఒక పాకలో కాపురం పెట్టాడు. అతన్నీ, పెరియనాయకినీ చూసి అందరూ మొగుడూ పెళ్లాలనే అనుకున్నారు మొదట్లో...కాని అసలు విషయం ఎవరికి, ఎలా తెలిసిందో మరి, ఉన్నట్టుండి అందరూ 'అరవ్వాడు ఆ పిల్లను లేవదీసుకొచ్చాడంట...' అని చెప్పుకోడం ప్రారంభించారు. ఆ విషయం అందరికీ తెలిసింది. సింగారవేలు ఆ మాటలను విని కూడా పట్టించుకోలేదు. మామూలుగానే నవ్వుతూ తిరిగేవాడు. సింహాచలంతో ఒకసారి 'అవును తంబీ! ఆళ్లంతా అనుకునేది నిజం!' అని చెప్పాడు కూడా...ఆ సందర్భంలోనే తమ కథ అంతా చెప్పుకొచ్చాడు...పెరియనాయకీ,సింగారవేలూ చిన్నప్పటినుంచీ ప్రేమించుకున్నారు. అయితే కొన్నేళ్ల తర్వాత ఆ రెండు కుటుంబాల మధ్యా కోర్టులో ఒక వ్యవహారం నడిచింది... అది తేలేందుకు చాలాకాలం పట్టింది. చివర కెప్పుడో వ్యవహారం ముగిసింది. ఒకరు గెలిచారు. మరొకరు ఓడిపోయారు.

ద్వంతరాలయినా వారి మధ్య ఉంటూవచ్చిన ద్వేషాలూ, పగలూ తగ్గలేదుసరికదా మరిం తగా ఎక్కువయ్యాయి. ఈ యింటిమీది కాకి ఆ యింటిమీద వాలడానికి వీల్లేదు... ఈ యింటి పిల్లలు ఆ యింటి పిల్లలతో ఆటలాడుకోరాదు...వారూ, వీరూ ఎదు రైతే మూతులు ముడుచుకుని, మొహాలు మాడ్చుకుని వెళ్ళిపోవడం...అప్పుడప్పుడు పిల్లులమీదా, ఎలుకలమీదా పెట్టుకుని ఒకరినొకరు తిట్టుకోడం, ఆడిపోసుకోడం, ఎక్కువైంది......అంతలో పెరియనాయకి తండ్రి ఆమె కొక సంబంధం కుదుర్చుకు వచ్చాడు. పెరియనాయకి ఏడ్చింది. తల్లితో తనకా పెళ్ళి యిష్టంలేదని చెప్పింది. తండ్రితో చెబుదామనుకున్నదిగాని భయం వల్ల చెప్పలేకపోయింది. తల్లి మాత్రం కూతుర్ని నాలుగు తిట్టి వూరుకున్నది. అంతలో యింట్లో పెళ్ళిపనులు ప్రారంభ మైనాయి. పెరియనాయకి యిక సహించలేక పోయింది. చాటుగా సింగారవేలును కలుసు కుని మాట్లాడింది. అతడు ఆమెకు ధైర్యం చెప్పాడు. మాటిమాటికీ 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను...నువ్వు లేకపోతే బతకలేను...' అన్నాడు. తర్వాత ఇద్దరూ ఒకచోట కూర్చుని ఉపాయాలు ఆలో చించారు. ఎవరికి తోచింది వారు చెప్పారు. అనుకుని, కాదనుకుని చివరకు ఒక నిర్ణ

# ముసురు

యానికి వచ్చారు. తెల్లవారితే పెళ్ళి అనగా పెరియనాయకి ఆ ముందటి రాత్రి బయలు దేరి సెంట్రలుస్టేషనుకు వచ్చేట్టు... అప్పటికి సింగారవేలు అక్కడ టిక్కెట్లతో సిద్ధంగా వుండేట్టు నిర్ణయమైంది. తర్వాత గప్‌చిప్‌గా యిద్దరూ రైలెక్కి వెళ్ళిపోవ డమే అన్నమాట...అంతా అనుకున్న ప్రకా రమే జరిగింది......ముందు యిద్దరూ గుంటూరు వచ్చారు. అక్కడ ఎవరో చెప్పగా, ఇక్కడ కొత్తగా ఎరువుల కంపెనీ పెట్టారని తెలిసి యిక్కడికి వచ్చేశారు. వచ్చీరాగానే సింగారవేలు వారి కాళ్ళా వీరి కాళ్ళా పట్టుకుని ప్రాధేయపడి పని సంపా యించాడు. అతడు రోజూ ఉదయంనుంచీ సాయంకాలంవరకూ ఆ మట్టిలో, దుమ్ములో ఘాటైన వాతావరణంలో పనిచేసేవాడు పొద్దు గూకుతూవుండగా తల కొక గుడ్డ చుట్టుకుని దుమ్ము కొట్టుకున్న బట్టలతో ఉసూరుమంటూ యింటికి చేరుకునేవాడు. అలా ఎన్నాళ్ళో గడవలేదు. అతని ఆరోగ్యం దెబ్బతిన్నది. వారం రోజులపాటు జ్వరం మూలంగా అసలు లేవలేకపోయాడు. జ్వరం తగ్గిన తర్వాత నీరసంగానడిచి ఫ్యాక్టరీకి వెడితే అతన్ని పనిలోనుంచి తీసేశాం పొమ్మ న్నారు. అతడు దిగాలుపడి తిరిగివచ్చాడు.

పెరియనాయకి అతనికి ధైర్యం చెప్పింది. 'అంతగా అయితే నాదగ్గరున్న నగలు అమ్ముదాం...' అన్నది. కాని అతడు వినలేదు. రోజూ ఏదో కాయకష్టంచేసి రూపాయో, అర్ధో సంపాయించుకొచ్చేవాడు. లేనినాడు అదీలేదు. ఇద్దరుగుట్టు చప్పుడు కాకుండా కడుపునిండా నీళ్ళుతాగి గడిపివేసే వాడు—

...సింహాచలం కళ్ళుతెరిచాడు...ఎదురుగా కోటమ్మ నిలబడివుంది 'ఏమయ్యా! వుగాకుందా?' అని అడుగుతున్నది.

సింహాచలం ఆవులించి 'లేదు' అన్నాడు.

ఆమె 'సరే...బాగుందయ్యా...వుగాకు వేకపోతే కొట్టేందుకు తెలిసినావు? మూసుకుని లోపల తొంగోకపోయావా? వుగాకు తీసుకెల్లకపోతే మా ఆయన ఎముక లిరగ్గొడతాడు ... ఎట్టాగబ్బా...' అని గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

ఆకాశానికి చిల్లిపడినట్టు వర్షం నిలిచి కురుస్తున్నది. ఒక రంగురంగుల బుల్లిపిట్ట వర్షంలో చప్పగా తడిసి ఎగురుకుంటూ వచ్చి తడికెమీద నిలబడి రెక్కలు విదిలించు కుంటున్నది. దూరంగా కొండలన్నీ ఆ ముసు రులో మసకమసగ్గా మాత్రమే కనిపిస్తున్నాయి.

సింహాచలం మళ్ళీ కళ్ళు మూసుకు న్నాడు. అతనికి అయిదారు రోజులక్రిందట జరిగిన వృత్తాంతం అంతా కళ్ళముందు పునరావృతం అయింది.

—ఆనాడు సింహాచలం రైలుదిగివచ్చి, నరుకులన్నీ సర్దుకున్నాడు. అంతలోనే కొండలమీదా, క్రింద అడివిలోనూ, సమస్త ప్రపంచంమీదనూ చీకటి చిక్కగా వ్యాపిం చింది. సింహాచలం హరికెన్‌లాంతరు వెలిగించి తెచ్చి తీగకుతగిలించాడు. పక్కనే తడికెవెనక అతడు ఉదయం బయలుదేరి వెళ్ళేముందు ప్రారంభమైన పేకాట యిప్పుడే ముగిసి నట్టున్నది. పేకలు అవతలపారేసి వాళ్ళం దరూ కబుర్లలోపడ్డారు. సింహాచలం అటు వెళ్ళిచూశాడు, సింగారవేలు ఒకపక్కన మొహంమీద గుడ్డవేసుకుని పడుకుని వున్నాడు అక్కడ మధ్యలో దీపం వెలుగు తున్నది. కొందరు గోడకు ఆనుకుని కూర్చుని, మరికొందరు పడుములువార్చి ఏవేవో విషయాలు మాట్లాడుకుంటున్నారు. అంతలోనే సంభాషణ తాగుడుమీదికి



**విశేషం మొదలైపోయింది.**

ఒకడు బీడీ ముట్టించుకుంటూ 'అఁ! ఇప్పుడీ 'లా' వొచ్చింతర్వాత తాగుడు తగ్గిందా ? వన్నడిగితే ముసపటికంటె ఎక్కువైపోయిందంటాను. మునుపెవుడో తాగదల్సుకున్నోడు తాగేవోడు. ఇప్పుడు వొద్దనే తలికి మరింత పెరిగింది. ఇప్పు డంతా నుక్కేసుకుంటూనే వుండారు...' అన్నాడు.

'అవునోస్ ! మునుపే నయం .ఆమాట కొస్తే...ఇప్పుడు ఇంటింటికీ సారా బట్టీ... పోయివేడు ఆ ఎంకటేశంగాడి పాక 'గుప్పు'న ఎట్టా తగలబడింది ? సారాకాయిలుండ బట్టేగా ?'

'అప్పుడు డబ్బులు పారేత్తే మంచిసరుకు దొరికేది. ఇప్పుడట్టా కాదు అందరూ పచ్చి అవేగానియతా సరుకు తాగుతా వుండారు. 'లా' వొచ్చి మంచి చేసిందంట .. ఏం మంచి ?'

'అంతే మరి. .నిషాకోసం ఏదిబడితే అది తాగేత్తావుండారు...ఆపక్క పాకల్లోకి ఎల్లి సూడు తెలుసుద్ది. ఆ జహాన్‌గాడు స్పిరిట్ తాగుతాడంట..'

'వ్యసనమంటే అదేరా నాయినా! ఆయాల్టికి ఏం దొరక్కపోతే కిరసనాయిలు కూడా తాగేత్తాడు. .'

'కిరసనాయిలు తాగితే కిక్కురుమన కుండా సచ్చి ఊరుకుంటాడు—'

సంభాషణ ఈ దశలో వుండగా సింగార వేలు ఒక్కసారిగా లేచి 'కిరసనాయిలుతాగితే సచ్చిపోతారా ? ఎవురా మాట అనేది ?' అన్నాడు ఛాలెంజి చేస్తున్నట్టు.

'నేను...నేనే అన్నానా మాట... ఏం ? నువ్వు తాగ్గలవా ?'

'తాగుతాను... కాయికిరసనాయిలు తాగుతాను...ఎంత పందెం?'

'అబ్బో! గొప్ప మొనగాడు బయల్దేరా డయ్యా! సరే... పాతిక రూపాయలు పందెం ..కానియ్ తాగు...'

అప్పుడు సింగారువేలు కళ్ళు మెరిశాయి. అతని చూపులలో తెగింపు కనిపించింది. కళ్ళు ఎగరవేసి లేచి, సరిగా కూర్చుని 'సరే...తెప్పించండి...' అన్నాడు నిశ్చయంగా.

అంతలో ఒకడు దీపం పెద్దది చేశాడు. ఒకణ్ణి డబ్బులిచ్చి కిరసనాయిలుకోసం పంపించారు. వాడు వెళ్ళి ముందు అందరికీ ఈ విషయం దండోరా వేశాడు. క్రమంగా అక్కడ జనం మూగారు. అంతా రణగొణ ధ్వనిగా వుంది. ఎదుటివాడు చెప్పేది వినిపించుకోకుండా అందరూ ఒకటే రొదగా మాట్లాడుతున్నారు.

అంతలో అందరూ నిశ్శబ్దంగా ఆత్రంగా నిలబడి చూస్తూవుండగా సింగారవేలు సీసా కిరసనాయిలూ గుక్కెడు గుక్కెడుగా తాగేశాడు. చివరి గుక్క మింగి సీసా వంచి చూపించి వొణికే కాళ్ళతో లేచి నిలబడి చెయ్యిజాపి 'డబ్బు లే...' అని అడిగి ఆ వ్యక్తి చేతిలోనుంచి నోట్లు అందుకున్నాడు. గోడకాను కుని నిలబడి నెమ్మదిగా లెక్క పెట్టుకున్నాడు తర్వాత జనాన్ని తప్పించు కుని యింటికి వెళ్ళిపోయాడు. జనం తర్వాత చాలా సేపు అతన్నిగురించి మాట్లాడుకున్నారు. మొత్తానికి అతడు గజ తాగుబోతు అయివుండాలనే నిర్ణయానికి వచ్చారు...

ఆనాటి రాత్రి ఆకాశంలో మబ్బులు దట్టంగా కమ్మాయి. దళసరి నల్లని తెరను ప్రపంచంమీద కప్పినట్టయింది... చల్లని గాలి దిగంతాలనుండి వేగంగా వీచింది. దానితో ఆ మబ్బులన్నీ 'ఝుల్లు'న జలదరించాయి. దాదాపు అరగంటసేపు పెద్ద వర్షం కురిసింది.

తెలతెలవారుతూ వుండగా సింహాచలం లేచి కళ్ళునులుముకుంటూ యివతలికి వచ్చి కొయ్యబారిపోయాడు. సింగారవేలు పాకముందు జనం మూగివున్నారు... ఒకడు కత్తితో వెదురుబొంగులను చీలుస్తున్నాడు. మరొకడు వాటిని రెండు పొడుగాటి వాసాల మధ్య వుంచి తాటితో గట్టిగా బిగిస్తున్నాడు... ఆ చిన్నపందిరిలో సింగారవేలు శవాన్ని పడుకోబెట్టారు...పైనుంచి కిందిదాకాగుడ్డ కప్పారు. ఆ అరవపిల్ల పెరియనాయకి శవం పక్కన కూర్చునివుండి నోట్లో కొంగు కుక్కుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నది. సింహాచలం అంతా చూసి నిలువునా వొణికిపోయాడు.

తర్వాత నలుగురూ తలా ఒక చెయ్యివేసి పనులన్నీ ముగించారు. ఏమీ మిగిలిపోలేదు. ఆ చిన్న పాకలో ఆ అరవపిల్ల మాత్రం సన్నగా ఏడుస్తూ మిగిలిపోయింది. ఆ రాత్రి పన్నెండు గంటలవేళ మళ్ళీ ప్రకృతి పగబట్టినట్టు వర్షం ప్రారంభమైంది ఆకాశం జల్లెడలా తయారైంది. ఉరుములు మెరుపులతో రొదచేస్తూ అప్పుడే మొదలు ఈ కుంభవృష్టి...అప్పుడే ఎక్కడో పిడుగు పడిన ధ్వని... పెరియనాయకి హడలిపోతూ నిలువెల్లా వొణికిపోతూ పరుగెత్తుకు వచ్చిం దిక్కడికి . .అంతే...అలా మొదలైన గాలివాన యింతవరకూ తెరిపి యివ్వలేదు—

...సింహాచలం హఠాత్తుగా కళ్ళు తెరిచాడు. లేచి చేతులు వెనక్కు కట్టుకుని కొంచెంసేపు అటూ యిటూ పచార్లు చేశాడు. తర్వాత మొహం తుడుచుకున్నాడు. అతనికి లచ్చి జ్ఞాపకం వచ్చింది సన్నగా శలాకలావుండి ఎల్లప్పుడూ నవ్వుతూ వుంటుంది వెన్నలాంటి మనసు మనిషి చామనచాయ మొహంలో ఎంత కళ! ఆమె ఎదుట నిలబడి కబుర్లు చెబుతూ వుంటే సింహాచలం పరవశించిపోయేవాడు. ఒకసారి తొందరపడి చెయ్యి పట్టుకోబోతె లేడిపిల్లలా ఛెంగున గెంతి తప్పించుకుని కొన దేలిన సన్నని ముక్కుమీద వేలు వేసుకుని 'తప్పు.. తప్పుడే కాదు ..' అంటూ మాటిమాటికీ వెనుదిరిగి చూస్తూ నవ్వుతూ వెళ్ళిపోయింది

అతడు హఠాత్తుగా నీరసపడిపోయాడు. ఇక లచ్చి తన మొహం చూడదు కాబోలు! దాని పెట్టుబడల తనకు తెలీదు గనుకనా? ఇక జన్మాంతమూ లచ్చి తనకు దూరమైపోయినట్టే. అందులో ఏ మాత్రమూ అనుమానం లేదు...

సింహాచలం ఉలికిపడి లేచి నిలబడ్డాడు. ఎదురుగా గొడుగుల్లో యిద్దరు నడివయసు వ్యక్తులు నిలబడి వున్నారు. వారిలో ఒకాయన నోట్లోని తమ్మిని ఉమ్మివేసి 'సింహాచలం యారప్పా నీవ్.' అని అడిగాడు.

సింహాచలం ఒక్క ఉదుటున లేచి 'రండి బాబూ, రండి. నేనే సింహాచలాన్ని...మీ అమ్మాయి లోపలుంది . రండి...' అన్నాడు. ఆ యిద్దరూ హడావిడిగా గొడుగులు ముడిచి లోపలికి వచ్చారు.

పెరియనాయకి హఠాత్తుగా లేచి నిలబడి 'అప్పా' అని పెద్దగా ఏడుస్తూ తండ్రిని కౌగిలించుకున్నది. అతడు కూడా కళ్ళనీళ్ళు పెట్టుకుని ఆమెను సముదాయిస్తూ చాలాసేపు మాటా పలుకూ లేకుండా నిలబడిపోయాడు, తర్వాత ఆ

ముగ్గురూ ఉండిఉండి కళ్ళు తుడుచుకుంటూ అక్కడే కూలబడ్డారు. పెరియనాయకి మధ్యమధ్య ఏడుస్తూ అన్నివిషయాలూ చెప్పింది. ఆ రెండో వ్యక్తి సింగారవేలు తండ్రిఅనీ, సింగారవేలు ఆయన కొక్కడే కొడుకనీ అర్థంకాగానే సింహాచలం తల్లడిల్లిపోయాడు. వారు ముగ్గురూ మాట్లాడుకుంటూ వుండగా బాగా అర్థం కాకపోయినా ఏదో కొంతకుకొంత అర్థం చేసుకుంటూ సింహాచలం అలాగే చాలాసేపు నిలబడ్డాడు. తర్వాత సంభాషణ తన మీదికి మళ్ళిందని అర్థం చేసుకోగానే ఇవతలికి వచ్చి బల్లమీద నిశ్శబ్దంగా కూర్చుండిపోయాడు.

వర్షపుజల్లు తగ్గింది. చల్లనిగాలి మాత్రం అడివిలోనూ కొండల మీద సుళ్ళు తిరుగుతూ వేగంగా వీస్తూనే వుంది. మబ్బులు బలహీనపడిపోగానే మందంగా చంద్రుడి కాంతి వ్యాపించింది.

అంతలో ఆ వ్యక్తులిద్దరూ యివతలికి వచ్చి వచ్చీరాని తెలుగులో అతన్ని చాలాసేపు పొగిడారు అతడు చాలా మంచివాడన్నారు. అతడు లేకపోతే పెరియనాయకి కూడా తమకు దక్కేది కాదన్నారు. అతని రుణం ఈ జన్మలో తీర్చుకోలేమన్నారు. చుట్టుపక్కలవారి మాటలను గురించి పెరియనాయకి చెప్పిందనీ వాటిని అసలు పట్టించుకోవద్దనీ అన్నారు. ఏనుగులను చూసి కుక్కలు మొరుగుతాయి, అంతలో ఏమీ మునిగిపోదన్నారు...

సింహాచలం ఏమీ మాట్లాడలేక అలా బొమ్మలా కూర్చుని అంతా విన్నాడు. తర్వాత వెనుదిరిగి చూస్తే పెరియనాయకి కళ్లనిండా కృతజ్ఞత నింపుకుని చూస్తూ నిలబడి వున్నది.

మరోగంటలో అందరూ ప్రయాణానికి సిద్ధమైనారు. సింహాచలం కొట్టుకట్టేసి గుమ్మానికి తాళంవేసి వారి వెంట మైలు దూరమూ నడిచి స్టేషనుకు వచ్చాడు. నడుస్తున్నంతసేపూ ఉండి ఉండి ఆ పెద్దమనుషులు తమ కృతజ్ఞత తెలియబరుచుకుంటూనే వున్నారు.

వారు ఆ చిన్న స్టేషన్‌కు చేరుకున్న అయిదు నిముషాల వ్యవధిలోనే రైలు వచ్చింది.



ఆ ముగ్గురూ చివరి పెట్టెలో ఎక్కి కూర్చున్నారు గార్డు ఈలవేయగానే ఆ పెద్దమనుషులిద్దరూ చేతులు జోడించి 'వస్తాం సామీ ...' అన్నారు. పెరియనాయకి కూడా రెండు చేతులూ జోడించి ఏదో అన్నదిగాని, ఆ మాటలు రైలు కదులుతున్న రొదలో అతనికి వినబడలేదు. అతడు కొద్ది క్షణాలు చేయి వూపుతూ అలాగే నిలబడిపోయాడు.

అంతలో ఎక్కడలేని ఒంటరితనం అతన్ని ఆవహించింది అతడు జేబులు తడువుకున్నాడు. చొక్కాచేతుల మడతలువిప్పి మళ్లీ పెట్టుకున్నాడు. చేతివేళ్లతో జుట్టును పైకి తోసుకున్నాడు. తర్వాత నెమ్మదిగా నడిచి యివతలికివచ్చి రోడ్డుఎక్కాడు. ఆ రోడ్డు తెల్లగా కొండనుచుట్టిన తెల్లని కొండచిలువలా వుంది.

అతడు చాలదూరం నడిచివచ్చి ఒకచోట ఆగాడు ఆ పాకలోనుంచి నవ్వులు వినిపిస్తున్నాయి. లచ్చి గలగల నవ్వుతున్నది ఆరెండో గొంతు కోటిగాడిదికదూ! వాడు పాతబాకీ రెండు మూడు రూపాయలివ్వాలి ... రేపు పలుగురిలో నిలబెట్టి అడిగి వసూలు చెయ్యాలి...

అతడు కాలికి అడ్డంవచ్చిన రాయిని కాలితో ఒక్కతన్నుతన్ని విసురుగానడవటం ప్రారంభించాడు. అంతలో ఒకచోటఆగి ఆకాశంలోకి చూశాడు. ఇన్నాళ్లనుంచీ అసహ్యంగా అల్లకల్లోలంగావున్న ఆకాశం యిప్పుడు స్వచ్ఛంగావుంది. చంద్రబింబం పెద్ద మంచి ముత్యపు ముక్కవలె రెండు చిన్న మబ్బు తునకల మధ్య ప్రకాశిస్తున్నది.

సింహాచలం నోటివెంట అప్రయత్నంగా ఈల వచ్చింది. ఈ కొద్దిరోజుల ముసురుతో తాను చాలా కోల్పోయాననిఅనుకున్నాడింతసేపూ ... ఇప్పుడు తమాయించుకున్నాడు. ఇక ఆపకుండా ఈల వేసుకుంటూ హుషారుగా నడిచి యిల్లుచేరుకుని ఆరుబయట కుక్కిమంచం వేసుకుని పడుకుని గుర్రుపెట్టి నిద్రపోయాడు. అతనికి కలలో అన్నీ రంగు రంగుల మంచి ముత్యాలూ గంధపు చెట్లూ అరణ్యాలూ కనిపించాయి ●



కొత్త సీరియల్ ప్రారంభం

# జీవనరాగం

ఉన్నవ విజయలక్ష్మి



కోర్టుకి వెళ్లడానికి తయారవుతున్న నిరంజనం 'టెలిగ్రాం' అన్న కేక వినిపించి గదిలోనించి వరండాలోకి వచ్చాడు. అప్పటికే గుమస్తా శంకరయ్యా సంతకం చేస్తున్నాడు. నిరంజనం కవరు విప్పి చూస్తూంటే...

'బెజవాడనుండేనా. ఎప్పుడు వస్తున్నాడట?' అంటూ ఆత్రంగా గుమ్మందాకా రాబోయిన సీతమ్మగారు అల్లుడి మొహం చూచి తెల్లబోతూ అక్కడే ఆగిపోయింది.

'ఉహూ. వాళ్ల దగ్గర్నుంచి కాదు. పెద్దక్కకి బాగా ఎక్కువగా వుందిట.' చెప్తూనే కాగితం మడిచి గబగబ ఆఫీసు గదిలోకి వెళ్లాడు— అతనిమాటలు విని పించి,

'అయ్యో పాపం' అనుకుంటూ ఇవతలకి రాబోయిన శంకరయ్యా ప్లీడరగారిని చూసి గుమ్మందగ్గరే ఆగిపోయి

'మళ్లీ తిరగబెట్టింది కాబోలు' అన్నాడు సానుభూతిగా.

'ప్చ్. ఏమిటో.' నిరాశగా నిట్టూర్చాడు నిరంజనం.

'ఫరవాలేదు. కులాసాగానే వుంటుంది.' [illegible]




గుమస్తాకి తను వచ్చేలోగా చెయ్యాల్సిన పనులన్నీ పురమాయించి లోపలికి వెళ్ళి పోయాడు.

అప్పటిదాకా అమ్మమ్మతో ఖబుర్లు చెప్తున్న వసంత తండ్రిని చూసి గదిలోకి వచ్చింది 'కాస్త కులాసాగావుందని మొన్ననేగా వుత్తరం వచ్చింది. మళ్ళీ అంతలోనే ఈ టెలిగ్రాం ఏమిటో...'

'మొన్న వుత్తరం వచ్చిందీ అంటే అది అంతకు ముందెప్పుడో వ్రాసింది కదా. జబ్బుతో తీసుకుంటున్న మనిషి పరిస్థితి విషమించటానికి ఎన్నాళ్ళుకావాలి' బీరువా తెరిచి హడావిడిగా బట్టలుతీసుకుంటున్న విరంజనం కూతురుమాటలువిని వెనక్కి తిరక్కుండానే అన్నాడు.

వసంత మాట్లాడకుండావెళ్ళి చిన్న సూట్‌కేసు తెచ్చింది. రెండు జతల బట్టలు అందులో సర్దేస్తూ, 'సూరన్న ఏం చేస్తున్నాడో పిలు. త్వరగా ఓ రిక్షా తీసుకు రమ్మను' అన్నాడు.

'శంకరయ్య వెళ్ళాడు. ఈపాటికి తీసుకొస్తుంటాడు.' అంది అవతలి గది గుమ్మంలో నిలబడిన సీతమ్మగారు.

'ఇంకా టైముస్నట్టుంది లెండి—వెళ్ళ గానే ఉత్తరం వ్రాయండి అత్తయ్య కెలాగుందో' అంది వసంత.

'ఆవిడక్కాస్త కులాసాగావుంటే వెంటనే వచ్చేస్తేసరి, అంతగా కావలిస్తే మళ్ళీ వెళ్ళొచ్చు— ఈ సంబంధం ఏదో చూసు కోవాలి' నసుగుతూనే చెప్పింది సీతమ్మగారు.

'అక్కడి పరిస్థితి చూడందే నేనేం చెప్పగలను—వాళ్ళ దగ్గర్నించి ఖబురేమయినా తెలిస్తే, నేను వూళ్ళోలేనని కొద్దిరోజుల

పోయాక రమ్మని వ్రాయించండి శంకరయ్య వుండవేవున్నాడు — ఎల్లుండి అబ్బాయికూడ వస్తాడుగా' చిరాకు వ్యక్తం కానివ్వకుండా పాడిగానే సమాధానంచెప్పి సూట్‌కేసు తీసుకుని వరండాలోకి వచ్చాడు.

రిక్షావచ్చి వీధిలో ఆగింది. శంకరయ్య లోపలికివచ్చి నిరంజనం చేతిలో సూట్‌కేసు అందుకున్నాడు. వీధిలోకి నడవబోయిన నిరంజనం వూరుకోలేక ఊరికే మాచిస్తున్నట్లు ... 'పోనీ, నువ్వుకూడా రారాదా అమ్మా,' అన్నాడు కూతురితో.

'నేను తెమిలే సరికి ఆలశ్యం అయిపోతుంది — ఈ రైలు దాటిపోతుందేమో. మీరు వెళ్లిరండి...' వసంత మాటలు పూర్తి కాకుండానే,

'ఆఁ. ఇప్పుడు పెళ్ళా, పడుగా. ఓమూల అవిడ అలావుంటే చిన్నపిల్ల ఇదెందుకూ ? ఏద్దైనా అయితే మరీ బెదిరిపోయి బెంగ పెట్టుకుంటుంది' అనేసింది సీతమ్మగారు.

నిరంజనం ఒకసారి కూతురువంక చూసి వీధిలోకి వెళ్లిపోయాడు.

తనమాటలు అతనికి కష్టం కలిగించాయని గ్రహించి, తనలో తనే అనుకుంటున్నట్లు,

'ఏమిటో పాపం ఎలావుంటుందో — మొదటే ఇక్కడికి తీసుకొచ్చి ఏపెద్ద డాక్టరుకయినా చూపించారు కాదు — అయినా అంత లేవలేనిమనిషిని ఎలా కదుపుతారు ? అక్కడమాత్రం డాక్టర్లు లేరూ —' పానుభూతి సంతాపం అన్నీ కురిపిస్తూ అన్నా వీధి గుమ్మందాకా వచ్చింది సీతమ్మగారు నిరంజనం ఏం మాట్లాడకుండా రిక్షాఎక్కి కూర్చున్నాడు.

'వెళ్లగానే వుత్తరం వ్రాయండి' అంది వసంత.

'ఏమాత్రం నయవుగావున్నా వెంటనే వచ్చేయి.' సీతమ్మగారు మరోసారి చేసిన హెచ్చరిక వెనకనుండి దూసుకువచ్చి బయలుదేరుతున్న రిక్షా మువ్వల గలగలలతో కలిసిపోయింది.

ఇద్దరు అన్నయ్యలకి ఇద్దరు అక్కయ్యలకీ ముద్దుల తమ్ముడు నిరంజనం. ఎప్పుడూ ఇంటిపనితో సతమతమయే తల్లి పసివాడికి పాలుపట్టటం, నీళ్లుపొయ్యటం లాంటి అతిముఖ్యమయిన పనులేవో చూసేది కాని అతను పెరిగిందంతా పెద్దక్క చేతులలోనే. అతనికి అంతబాగా గుర్తులేదు కాని పెద్దక్క పెళ్లిలో పెళ్లికూతురు పెళ్లికొడుకుతోపాటు పల్లకీలో ఊరేగాడు కూడ.

'ఒక్కక్షణం అయినా ఆ అక్కని విడిచి పెట్టి వుండలేవు రేపు అక్క అత్తవారింటికి వెళ్లిపోతే బెంగపెట్టుకుంటావా?' అని అందరూ హాస్యం చేసేవారు. అప్పుడేం మాట్లాడలేదు కాని కొన్నాళ్లతరువాత ఆ అక్క అత్తవారింటికి వెళ్లిపోతూంటే నిరంజనం కళ్లల్లో నిజంగానే నీళ్లు తిరిగాయి.

'ఆడపిల్లలా ఏడుస్తున్నావా?' అని అన్నయ్యలు వెక్కిరించటంతో కళ్లుతుడిచేసుకుని చాటుకి వెళ్లిపోయాడు.

తనని అంత అపురూపంగానూ చూసుకునే చిన్నక్కకి కూడ ఆఏడే పెళ్లి తలపెట్టటం అతనికి అసలు నచ్చలేదు. అందులో ఆ పెళ్లిలో పెళ్లికొడుకు తండ్రి ఏదో కోపంవచ్చి బాజావాడిని పట్టుకుని చావగొడుతూంటే,

'అయ్యొ బాబోయ్, ఈయనెప్పుడైనా మా అక్కనికూడ ఇలాగే కొడతాడేమో' అనే ఊహవచ్చి భయంతో బిగుసుకుపోయాడు.

'నలుగురూ కలగజేసుకుని ఆ వెర్రివెధవని విడిపించారు. లేకపోతే వాడి ప్రాణం తీసేవాడేమో. మరీ అంత ఆపుకోలేని అహంకారం ఏమిటో' అంటూ ఆ సంఘటనని చాలరోజులు తలుచుకుంటూండేది అతని తల్లి.

అయితే ఆవేళ లేచిన వేళావిశేషమో ఏమో ఆలా జరిగింది కాని పాపం ఆయన కోడల్ని ఎన్నడూ పల్లెత్తుమాట అయినా అన్నట్లు నిరంజనం వినలేదు.

అన్నయ్యలూ వదినలూ, అక్కయ్యలూ బావలూ వాళ్ల పిల్లలూ అంతా రావడం పోవడం ఎంతో సంతోషంగా అతని చిన్నతనం అంతా గడిచిపోయింది. తరువాత క్రమంగా అందరి సంసారాలూ పెరగటం వల్లా ఇంకా అనేక కారణాలవల్లా కూడ ఆ రాకపోకలు కొంత ఎడం అయ్యాయి. ఎంతయినా రక్తసంబంధంకదా, తమ్ముడి అభిమానం, అతని సంపాదన, మేనగోడలి అందచందాలు ఇవన్నీ ఇద్దరు అక్కలూ గతంలో జరిగిందంతా మరిచిపోయేలా చేశాయి.

'ముక్కు మొహం తెలియని సంబంధాలు చేసుకుంటే ఇంతకన్నా ఒరిగిపోతుందేమిటి? మనలో మనమయితే ఎలాగో సర్దుకుపోవచ్చు' అనిపించి, ఒకటి రెండుసార్లు అమాటే తమ్ముడితోకూడ అన్నారు వాళ్లు.

'ఈ రోజుల్లో పెద్దవాళ్ల పెత్తనం ఏముంది. వసూ ఇష్టపడితే నా అభ్యంతరం ఏంలేదు.' అన్నాడతను తన మాట ఎలాగూ పొగదని తెలుసు కనక.

'ఇప్పుడు తమ్ముడి డబ్బుచూసి సంబంధం కావలసి వచ్చింది. వాళ్ల సంగతి నాకు తెలియదూ — అయినా ఏం చూసి పిల్లనిస్తాం. బంగారంలాంటి నా మనవరాలికి రాజాలాంటి సంబంధం తీసుకురావాలి కాని —' అని అందరితోటీ అనే సీతమ్మగారు,

'ఇద్దరి దగ్గరా పిల్లలున్నారు. వసూని చేసుకోవాలని ఇద్దరు మేనత్తలూ ముచ్చటపడుతున్నారు. ఒకరికిస్తే రెండవ వాళ్లని చులకన చేసినట్లవుతుంది. అందరితోనూ మంచిగా వుండాలంటే అయిన సంబంధాలు కలుపుకోకూడదు' అంది అల్లుడితో.

వసంత మొదటి నుండీ వాళ్లందరికీ దూరంగానే పెరగటం వల్ల ఆ పిల్లకి పెద్దతండ్రులూ మేనత్తలూ అంటూ అభిమానం ఏంలేదు. నిరంజనం ఎవ్వరినీ బలవంతం చెయ్యదలుచుకోలేదు. అందుకే పై సంబంధాలే చూస్తున్నాడు

పెద్దక్కకి జబ్బుగావుందని తెలిసి పదిహేనురోజులక్రిందటే ఓసారి వెళ్లాడు. 'ఇక్కడ సరిఅయిన వైద్యం సాగదేమో. మావూరు తీసుకువెళ్లి పెద్ద డాక్టర్లకి చూపిస్తా' అనికూడ అన్నాడు.

'అంతమాటన్నావు అదేచాలు. ఇక్కడికీ అక్కడికీ ఎందుకు, ఇదయినా అడవికాదు కదా. డాక్టర్లు ఇక్కడా వున్నారు. ఆయుర్దాయం వుంటే ఎక్కడున్నా బ్రతుకుతాను' అంది ఆవిడ తమ్ముడిని శ్రమ పెట్టటం ఇష్టంలేక.

రెండురోజులుండి అతను వచ్చేశాడు. కులాసాగానే వుంటోందని వుత్తరాలు

# ఎమెస్కో పాకెట్ బుక్స్ వారి దీపావళి '67 నవంబరు విడుదలలు

POCKET BOOKS EMESCO

**(5) విచిత్రనళోయం**
చలం గారి కథలు
మనోహరమైన హాస్యరచనల సంపుటి
రు 2/-





**పిడికెడు ఆకాశం (6)**
గొల్లపూడి మారుతీరావు
విభిన్న ప్రకృతులుగల వ్యక్తుల ప్రవర్తనను ఆకర్షణీయంగా ప్రదర్శించే సాంఘిక నవల
రు 2/-

**(7) హౌస్ సర్జన్**
కొమ్మూరి వేణుగోపాలరావు
వైద్యవృత్తి మొదటిమెట్టున ఉన్న యువకుని ఆత్మకథ
రు 2/-





**నిరీక్షణ (8)**
ఉన్నవ విజయలక్ష్మి
సమకాలిక మధ్యతరగతి జీవిత విశేషాలను యథాతథంగా చిత్రీకరించే నవల
రు 2/-



మీదగ్గరలోవున్న బుక్‌షాప్ లోగాని, పత్రికలు అమ్మే న్యూస్ ఏజంటునిగాని అడగండి. వారివద్ద లేవంటే తెప్పించి పెట్టమనండి. అదీ వీలు కాదంటే సరాసరి ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్‌కి వ్రాయండి
విడి ఆర్డర్ల కూపను

పాఠకులు నాలుగూ ఒక్కసారిగా తెప్పిస్తే పోస్టేజ్ ఉచితం సొమ్ము పూర్తిగా ముందే మనియార్డరు చెయ్యాలి. విడిగా కావాలంటే ఒకో ప్రతికి పావలా పోస్టేజి అవుతుంది. ఇదీ, పుస్తకం ఖరీదూ ముందుగా M.O. ద్వారా పంపాలి. రిజిస్టరు అయితే ప్యాకెట్‌కి 60 పైసలు.

పుస్తక విక్రేతలకు
ఆకర్షణీయమైన టరమ్స్
వివరాలకు నేడే వ్రాయండి!
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతి రోడ్
సికిందరాబాద్

To ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతి రోడ్ సికింద్రాబాద్

అయ్యా- మీ ఎమెస్కో ప్రచురణలు 5,6,7,8, దిగువ అడ్రసుకి వెంటనే పంపండి. మీ నిర్దేశం ప్రకారం వీటికయ్యే మొత్తం సొమ్ము ఇవాళే మనియార్డరు చేశాను.

ఇట్లు

పేరు

అడ్రసు

**అక్టోబరులో విడుదలైన ఎమెస్కో పాకెట్ బుక్స్**

(1) దిండుక్రింది పోకచెక్క * విశ్వనాథ సత్యనారాయణ * రు 2/-
(2) బ్రతికిన కాలేజీ * పాలగుమ్మి పద్మరాజు * రు 2/-
(3) సాక్షి * ముళ్ళపూడి వెంకటరమణ * రు 2/-
(4) ప్రవాహం విడిబింది * ద్వివేదుల విశాలాక్షి * రు 2/-

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతి రోడ్
సికిందరాబాద్

తెస్తూనేవున్నాయి. అంతలోనే హఠాత్తుగా ఈ పెళ్లిగ్రాం.

'ఇతగాడు వెళ్ళి, ఇక్కడి ఆస్పత్రిలో చూపిస్తానంటూ ఆ జబ్బు మనిషిని తీసుకు వచ్చారాడు కదా ఆవిడని చూడ్డానికి వచ్చే పోయేవాళ్ళందరికీకూడ చెయ్యలేక నేను చావాలి.' అని కాస్త భయం ఏమూలో పీకుతూనేవుంది సీతమ్మగారిని.

* * *

భయపడి అందరికీ పెళ్లిగ్రాంలు ఇచ్చారే కాని నిరంజనం వెళ్ళేసరికే ఆవిడకి ప్రమాదం గడిచిపోయింది. ఆ మర్నాడు అన్నగార్లిద్దరూ కూడ వచ్చారు. రెండు రోజులుండి ఎవరిదారిన వాళ్ళు ప్రయాణం అయ్యారు.

'ప్రాణంమీదికి రావటం కాదు. ఏంకాదు. ఇతన్ని పిలిచి కష్టం సుఖం చెప్పుకుని మందుఖర్చులకయినా ఏదో డబ్బు అడగాలని — పదిమంది పిల్లలతో గుమస్తా బ్రతుకులు వెళ్లదీస్తున్న ఆ అన్నగార్లు ఏంసాయం చేస్తారు. అందరి కళ్లకీ కాస్త పచ్చగా కనిపిస్తున్నవాడితనొక్కడే—ఆ మధ్య అన్న కూతురు పెళ్లికి వెయ్యిరూపాయలు మా కెవరికీ తెలియకుండా పంపించాడు. తరువాత అది బయటపడింది అనుకోండి — ఇంతకీ మా వసూ సంబంధం చెడగొట్టడానికి వచ్చి నట్టుగా వచ్చిందా పెళ్లిగ్రాం. ఇతనూ అలా వెళ్ళాడు ఇలా వాళ్ల దగ్గర్నించి ఉత్తరం వచ్చింది, వస్తున్నాం అంటూ. అసలు మనిషిలేకుండా ఎలా. ఇత నెప్పుడు వస్తాడో తెలియదు. అందుకే ఇలాంటి సంగతి అని శంకరయ్యచేత వాళ్లకి వ్రాయించాను—అల్లుడు రాగానే మళ్లీ వాళ్లకి తెలియపరిస్తాంలెండి' ప్రక్కింటి ముసలమ్మగారితో తన యింటిగోడు వెళ్ల బోసుకుంది సీతమ్మగారు —

'నేనింక ఎన్నాళ్లో బ్రతకను. పిల్ల పెళ్లి అయినా ఈ కళ్లతో చూడాలని వుంది' అంటూ నాలుగేళ్లనుంచీ పోరటం మొదలుపెట్టిందావిడ.

'దానికిప్పుడే పెళ్లేమిటి? — మీ ఆరోగ్యానికేం భయంలేదు. వసూ పిల్లల్నికూడ ఎత్తుకుని ఆడిస్తారు' నవ్వుతూ నిరంజనం

# జీవనరాగం

చెప్పిన సమాధానంకావిడ,

'అవును బాబూ, పాపీచిరాయువు అన్నట్లు నేనిలా బ్రతికేవుంటాను. ఉన్న ఒక్క కూతుర్ని మింగి కూర్చున్నందుకు నా హృదయం ఎంతగా క్షోభించిపోతోందో ఎవ్వరికీ తెలియదు. దానికా అదృష్టం లేకనే పోయింది. నేనయినా రెండక్షంతలు వాళ్ల నెత్తిన వేద్దామని నా దేవులాట— ఎంత మంది ఎన్నిరకాలుగా అనుకుంటున్నా నోరు మూసుకుని పడుతూ పిల్లల్ని వదల్లేక ఇక్కడే పడివున్నాను. నా మాటంటే అందరికీ లోకువే అందరికీ వేళాకోళమే నాబిడ్డ పోయిననాడే నా మాట విలువపోయింది.' అంటూ సన్నగా గొణగటం ప్రారంభించి, కూతుర్ని తలుచుకుని మెల్లిగా శోకాలు ప్రారంభించింది.

నిరంజనం తెల్లబోయి 'ఇప్పుడు అమ్మాయి పెళ్లికి తొందరేమిటని అన్నానే కాని మిమ్మల్ని హేళన చెయ్యాలని కాదు. పది హేనేళ్లయినా రానివ్వండి. ఈలోగా కాస్త చదువూ వస్తుంది' అని సర్దేశాడు.

మధ్యమధ్య ఆవిడ అదే ప్రస్తావన తీసుకు వస్తున్నా అలాగే సమాధానం చెప్తూ ఓ రెండేళ్లు నెట్టుకువచ్చాడు. వసంత స్కూలుఫైనల్ పరీక్షలు వ్రాసిం తరువాత మాత్రం ఇంక ఒక్క క్షణం అయినా ఆవిడ వూరుకోలేదు. అప్పుడు ఇంక నిరంజనం కూడ అభ్యంతరం చెప్పలేదు.

బోలెడు కట్నం ఇవ్వగలిగిన తనకి అల్లుడు నిమిషాలమీద దొరుకుతాడు అను కున్న అతని వూహలు తల్లక్రిందే అయ్యాయి.

మనవరాలికి స్థిరపరచాల్సిన సంబంధం గురించి సీతమ్మగారికి కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలున్నాయి. అభిప్రాయాలు అనే కంటే షరతులు అంటే ఇంకా బాగుంటుం దేమో!అవి ఏమిటంటే — తమ హోదాకి ఇంకా కాస్త పై అంతస్తులోనే వున్న సంబంధం కావాలి. పెళ్లికొడుకు అమ్మాయి అంద చందాలకి తగినవాడుగా వుండాలి. ఎంత ఆస్తివున్నా ఉద్యోగం పురుషలక్షణం అంటూ ఓ వ్యావృత్తి వుండాలి కనక బాగా చదువు కున్నవాడై వుండాలి అదీ వట్టి బి. ఏ. కాకుండా ఏ డాక్టరో అయితే బాగుంటుంది. సరే వీటన్నింటిని మించినది, వాళ్ళు మరీ దూరదేశం వెళ్లిపోకూడదు. మనవరాలిని చూడాలని తనకి అనిపించినా, లేక వసంత అమ్మమ్మకోసం బెంగపెట్టుకున్నా నాలు గైదు గంటల ప్రయాణంతో పిల్ల తన కళ్ల ముందు వుండేంతదూరం మించ కూడదు—అలాంటి లక్షణాలున్న పెళ్లి కొడుకుకోసమే వలలువేసి గాలిస్తున్నాడు నిరంజనం. తనకి అన్నివిధాల నచ్చారను కున్నవారిని పెళ్లిచూపులకి రమ్మని ఆహ్వా నించేవాడు. అలా వచ్చినవాళ్లని సీతమ్మ గారు శల్య పరీక్షచేసేది. సర్వసాధారణంగా పెళ్లికొడుకుతోపాటు తల్లీ తండ్రీ కూడ వస్తారు కనక ఆ కాబోయే వియ్యపురాలి మాటతీరు మంచీ మర్యాద అన్నీ కని పెట్టడానికి ప్రయత్నించేది ఆవిడ.

'అయ్య బాబోయ్ ఆవిడ ఎంత మాట కారి! అసలు ఆవిడ మాటలకి సమాధానం చెప్పగలమా. వసూని రాచిరంపాన పెట్టే స్తుంది. ఏమయినా సరే నే నీ సంబంధానికి ఒప్పుకోను' అనేది ఒకోసారి.

'ఆవిడ అతిశయం చల్లగా వుంటే! మాట్లాడితే నోటి ముత్యాలేమయినా రాలి పోతాయేమో నన్నట్లు మూతి ముడుచుకు కూర్చుంది. ఓ మంచి మర్యాదా ఏమీ వుండక్కర్లేదా. తనకే మూడు మేడలున్నా యని అంత గర్వంగా వుంటే, ఇవతలి వాళ్లేనా అంత గతిలేకుండావున్నది. ఏమో నాకేం నచ్చలేదు. అనక మీ ఇష్టం. అంటూ తన అయిష్టతని వ్యక్తం చేసేది ఒకోసారి.

ఆవిడ ధోరణికి విసిగిపోయిన నిరంజనం 'ఇంక ఈవిడ బ్రతుకుండగా నా కూతురికి పెళ్లికాదు.' అని లోలోపలే విసుక్కునే వాడు. కాని సంబంధాలు వెతకటం మాత్రం మానలేదు. అలాంటప్పుడే జరిగింది ఓ చిత్రం.

(ఇంకా వుంది)




(క) చెరిగిపోయిన అంకెలు :

ఏడవ తరగతికి లెక్కలుచెప్పే రామనాథం మేష్టారు ఇంటర్‌వెల్‌లో బోర్డుమీద ఏదో గుణకారంవేసి, తరువాత జరుగబోయే తన క్లాసులో దానినిగురించి చెప్దామనుకున్నారు. మంచి పనిమంతుడైన ప్యూను, సుబ్బయ్య మరికొంతసేపటికి అక్కడికివచ్చి బోర్డును — క్లీనుగా ఉంచుదామనే సదుద్దేశంతో గుడ్డ పుచ్చుకుని బల్లమీద తుడువసాగేడు. అంతలో చటుక్కున మేష్టారు కేకవేయగా సుబ్బయ్య తుడవడం ఆపేశాడు. తప్పుపని చేసేశానని ఇది అవుతున్న సుబ్బయ్యను 'ఫరవాలేదులే' అని లెక్కల మేష్టారు పంపించేశారు. తరువాత ఆయన బోర్డుమీద సగం సగం చెరిగిఉన్న అంకెలకేసి నిశితంగా చూశారు. చిత్రమైన ఆలోచన ఏదో వచ్చింది. పిల్లలంతా క్లాసులోకి వచ్చాక, మేష్టారు ఇల్లా అన్నారు,

'బోర్డుమీది గుణకారం చూశారుగా. అందులో కొన్ని అంకెలు చెరిగిపోయి ఉన్నాయి. చెరిగిపోయిన చోట్ల ఉండవలసిన అంకెలు ఏమిటో మీరు కనుక్కోవాలి. ఇదే ఈ వేళకి మీకు పాఠం.'







పిల్లలు అసలు ఆ లెక్క చేయడం అసాధ్యం అనుకున్నారు ముందర. కాని, ప్రయత్నించారు. ఒక్కొక్క అంకే పాగమంచులోనుంచి వస్తువుల్లా బయటపడసాగేయి. ఆఖరికి పూర్తిగా సాధించగలిగేరు.

ఏడవ తరగతి పిల్లకాయలు చేయగాలేనిది మీ రెందుకు చెయ్యలేరూ ? ప్రయత్నించండి.




(చ) కత్తిరింపులు :

ఇక్కడి బొమ్మలో చూపిన వంకర




టింకర బల్ల చెక్కను రెండేరెండు తిన్నని కోతలతో 2 అడుగుల చదరపు బల్లగా తయారుచేయడం ఎల్లాగ ?




(ట) గడియారపు ముళ్ళు తారుమారు :

ఒకడు గడియారాన్ని శుభ్రపరచి, ముళ్ళు మళ్ళీ పెట్టడంలో నిమిషాల ముల్లును గంటలముల్లు ఇరుసుమీద, గంటలముల్లును నిమిషాలముల్లు ఇరుసుమీద పెట్టి, టైము సరిగ్గా 2 గంటలకు దిద్ది, 'షోకేస్' లో పెట్టేశాడు. కొంతసేపు అయాక యదాలాభంగా చూస్తే కాకతాళీయంగా ఆ గడియారం సరియైన టైమునే చూపిస్తోంది ! అప్పుడు టైము ఎంత అయిఉంటుంది ?

* * *

(త) (1) ఎనిమిది 8 లతో 1000 తయారుచేయడం ఎల్లాగ ?

(2) మూడు 2 లతో 24 చేయడం ఎల్లాగ ?

(3) మూడు 3 లతో 24 చేయడం ఎల్లాగ ?

(4) మూడు 3 లతో 30 చేయడం ఎల్లాగ ?

* * *

## జవాబులు

(క) గుణించవలసిన అంకెలు 7,43,69,053 ; 87,956.

ఇవి తెలిసేక మిగిలిన ఖాళీ స్థలాలు పూరించడం చాలా సులభం.

* *

(చ) ఇక్కడి బొమ్మలో చూపినట్లు క, చ అనే ముక్కలుగాకోసి పైన అతుకులు




పెడితే చదరం ఏర్పడుతుంది.

(ట) ఈ సమస్యలో ముళ్ళు తారుమారు అయాయి కనుక గంటల ముల్లు నిమిషాల ముల్లుకన్న 12 రెట్లు వేగంతో తిరుగుతూ ఉంటుంది. 2 గంటల నుంచి 3 గంటలవరకూ ఆ గడియారం తప్పు టైమునే చూపించి ఉంటుంది. పెద్దముల్లు XII నుంచి I మీదికి జరిగితే, చిన్నముల్లు ఈ గంటలోనూ ఒకసారి పూర్తిగా వలయం తిరిగి మళ్ళీ II మీదికి వచ్చి ఉంటుంది. మూడుగంటలకీ, నాలు గంటలకీ మధ్యని చిన్నముల్లు మరోసారి పూర్తి వలయం తిరుగుతుంది. ఈ మూడు నాలుగుగంటల మధ్యని ఎప్పుడో ఒకసారి ఆ గడియారం సరియైన టైముము చూపించి ఉండాలి. II కీ ఈ సమయానికీ మధ్య దూరం 'గ' అనుకుందాం. ఇదే వ్యవధిలో పెద్దముల్లు I నుంచి 'ని' దూరం ఎగరక జరిగి ఉంటుందనుకుందాం. ముళ్ళు తారుమారు అయాయి కనుక గ=12 ని అని సమీకరణం వ్రాయాలి.

సరియైన గడియారంలో అయితే ఇదే స్థితిని చేరుకునేసరికి గంటల ముల్లు III నుంచి చివరకు (గ−5) దూరమూ నిమిషాలముల్లు XII నుంచి (ని+5) దూరము జరిగి ఉంటాయి.

కనుక (ని+5)=12 (గ−5) ఈ రెండు సమీకరణాలను సాధిస్తే 3 గంటల 5 5/11 నిమిషాలకు ఆ తప్పుడు గడియారం సరియైన టైమును చూపించిఉండాలి.

(ఠ) (1) $888+88+8+8+8=1000$

(2) $22+2=24$

(3) $3^3-3=24$

(4) $3^3+3=30$

లేక $33-3=30$.



# అవేదన్ ప్రత్యేకత ఏమిటి ?



# ఆశ్చర్యకర ఎపెప్

**తలపోటు, రొంపా, ఫ్లూలనుంచి మీకు సత్వర, సురక్షిత, నిశ్చిత నివారణ యిచ్చేటందుకు.**

ఎపెప్ చేర్చడం మూలంగా, అవేదన్‌కు, బాధలూ, నొప్పులూ తొలిగించడంలో ఒక విశేషశక్తి సమకూడి వుంది. అవేదన్‌లో కలిపిన ఎపెప్ తక్షణం పనిచేస్తుంది, సత్వరం నివారణకలిగిస్తుంది. అంతేకాక, తలపోటు బిళ్లలన్నింటికంటె అవేదన్ను సురక్షితమైనదానిగా చేస్తుంది. పెద్దఫలితాలు కనబడవు ఆశ్చర్యకర ఎపెప్ గల అవేదన్ అంటే, సత్వర, సురక్షిత, నిశ్చయ నివారణ.

అందుచేతనే—ఇప్పుడు చాలామంది డాక్టర్లు తలపోటు, పంటిపోటు, వీపుపోటు, కండరాల నొప్పులు, రొంపా, ఫ్లూ, స్త్రీల కష్టదినాలలో, తదితర సాధారణ నొప్పులూ బాధలకు ఎపెప్‌గల

# అవేదన్‌ను

సూచించడంలో ఆశ్చర్యంలేదు.

మోతాదు: 1-2 టాబ్లెట్లు

• ఎన్-ఎసిటిల్-పి-ఎమినోఫినాల్




SQUIBB® సారాభాయ్ కెమికల్స్

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్, ఇన్కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్కు చిహ్నం. దీని లైసెన్సు ఉపయోగదారులు కరంచంద్ ప్రేమచంద్ ప్రయివేట్ లిమిటెడ్.

# ధాన్యం ధర



## మల్లన్న మంత్రి

కౌటిల్య

ఒక వర్తకుడు వెయ్యి ధాన్యం బస్తాలను బండ్లమీద వేసి మల్లన్న మంత్రి ఉండే నగరానికి అమ్మకం నిమిత్తం తీసికొనివచ్చాడు. నగరానికి చేరుకొన్నతరువాత బండ్లవాళ్ళ నాయకుడు, ఆ బస్తాలు తనవేననీ. వర్తకుడు తమను కోరడంవలన దయతలచి బండ్లమీద రానిచ్చేమనీ పేచీ పెట్టాడు. బండ్లవాళ్ళందరూ తమ నాయకునిపక్షాన్నే వహించారు.

వర్తకుడు యీ విషయాన్ని రాజు వద్ద ఫిర్యాదుచేశాడు. ఈ తగాయిదాను పరిష్కరించవలసినదిగా రాజు మల్లన్నమంత్రిని కోరేడు. మల్లన్న మంత్రి తగాయిదాను విచారణచేశాడు. వర్తకుడి తరఫున సాక్ష్యం యేమీలేదు, బండ్లవాళ్ళందరూ- తమ నాయకుడి తరఫున సాక్ష్యం యిచ్చారు. ఆబండ్లలో వెయ్యి ధాన్యం బస్తాలు ఉన్నాయని అందరూ అన్నారు.

మల్లన్నమంత్రి అప్పుడు యిలాగ తీర్పు చెప్పాడు: "ధాన్యం బస్తాలు బండ్లనాయకుడివేనని రుజువు కావడం వలన బస్తాలను అతను తీసికొని వెళ్ళవచ్చును కాని, ఆ బస్తాలను తీసికొని తెల్లవారేలోపున యీ పట్టణాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోవాలి. అబద్ధపు ఫిర్యాదు చేసినందుకుగాను వర్తకునకు కారాగారశిక్ష విధించడమైనది."

రాజభటులు వర్తకుని బంధించి చెరసాలకు తీసికొని వెళ్ళిపోయారు. బండ్లనాయకుడు తీర్పునకు సంతోషించి, బండ్లను తోలుకొని నగరం నుంచి వెళ్ళిపోవడానికి బయల్దేరాడు. మర్నాటి ఉదయమే మల్లన్నమంత్రి మారువేషంలో నగరం బయట ధాన్యం బళ్ళను కల్సుకొన్నాడు.

'ధాన్యం యెలాగయిస్తార'ని మల్లన్న మంత్రి బండ్ల నాయకుణ్ణి అడిగాడు. 'బస్తా మూడు వరహాలు అవుతుంద'ని చెప్పాడు బండ్ల నాయకుడు. 'అర వరహా చొప్పున అయితే తీసికొంటా నన్నాడు మల్లన్నమంత్రి. ఆఖరుకు బస్తా ఒక వరహా చొప్పున యివ్వడానికి అంగీకరించాడు బండ్ల నాయకుడు.

మల్లన్నమంత్రి అప్పుడు యీల వేయగానే ఆ చుట్టుపక్కల దాగివున్న రాజభటులు బండ్లను చుట్టుముట్టి, బండ్లనాయకుణ్ణి రాజసభకు తీసికొనివచ్చేరు. రాజసభలో మల్లన్న మంత్రి తన మారువేషాన్ని తీసివేసి యిలాగ చెప్పాడు:

'నిన్నటిదినం వర్తకుడి తరఫున సాక్ష్యం యేమీ లేనందున అలాగున తీర్పు చెప్పవలసివచ్చింది. నిన్న సాయంత్రం బజారులో ధాన్యంధర విచారించగా బస్తా రెండు వరహాలు ఉన్నట్లుగా తెలిసింది. నేను యీదినం బండ్లనాయకుణ్ణి ధాన్యం ధర అడగ్గా మొదట బస్తా మూడువరహాలు చెప్పి, తరువాత ఒక వరహాకు యివ్వడానికి అంగీకరించేడు. ఈ ధాన్యం తన స్వంతమే అయినట్లయితే బజారులో ఉన్న ధరలో సగానికే యిచ్చివేయడానికి యెవరూ అంగీకరించరు. అందుచేత యీ ధాన్యం అతనిది కాదని రుజువైంది. ధాన్యం బస్తాలను నిన్నటి దినమే యెవరికీ అమ్మివేయకుండా తెల్లవారేలోగా ధాన్యం బస్తాలను తీసికొని యీ నగరంనుండి వెళ్ళిపోవాలని తీర్పుచెప్పేను.'

'నిన్నటి తీర్పు నిజమేననుకొని వర్తకుడు యెక్కడికైనా వెళ్ళిపోతాడేమో నని అతన్ని చెరసాలలో ఉంచేమని చెప్పగానే భటులు వర్తకుణ్ణి కూడా అక్కడకు తీసికొనివచ్చేరు. అప్పుడు ధాన్యం బస్తాలను వర్తకుడికి అప్పగించి బండ్లనాయకుణ్ణి, బండ్లవాళ్లను తగినట్లుగా శిక్షించాడు మల్లన్నమంత్రి.

దీపావళి కథల పోటీలో మూడవ బహుమతి రు. 500 లు పొందిన కథ

# కోడలైనా మనిషే!

*భట్టిప్రోలు బాలాదేవి*



**తల్లి :**

గడియారం ఏనిమిది గంటలు కొడుతూంది. ఇందాక కొడుకు తెచ్చి వేసిన నల్లమందు మాత్ర ప్రభావంతో సీతమ్మకి కళ్ళు బాగా బరువెక్కి మూసుకుపోతున్నాయి. మూడువరకు గంటలు లెక్కపెట్టింది కాని ఆ తరువాత ఆ సంగతే మర్చిపోయి లోపలికి ఊపిరి పీల్చినప్పుడు మొదటి రెండు అక్షరాలూ, పైకి వదిలినప్పుడు మిగిలిన రెండక్షరాలూ అంటూ నారాయణ నామస్మరణం నీరసమైన గొంతుతో కొంతసేపు చేసుకుంది. చిన్నప్పుడు నేర్చుకున్న శ్లోకాలూ, పద్యాలూ సంవత్సరం కిందటివరకూ జ్ఞాపకం ఉండి మరెవ్వరికీ ఇబ్బంది కలిగించని హీనస్వరంతో పాడుకొనేది ఆవిడ. కాని ఇప్పుడసలు అవన్నీ తనకు వచ్చును అన్న స్పృహే లేదు. ఒకప్పుడు బాగా భారీమనిషి అని పేరుపడ్డ ఆవిడ ఒళ్ళు ఇప్పుడు బాగా శుష్కించిపోయి ఆ మంచంమీద మూడడుగులకన్నా ఎక్కువస్థలం అవసరంలేకుండా పక్కకి తిరిగి, మీదకప్పిన బొంతకింద ముడుచుకుని ఉంది. తన పెళ్ళినాడు అత్తవారు పెట్టిన పట్టుచీర, తొలిచూలువేళ కొనుక్కున్న గళ్ళగళ్ళ ఎన్నెమ్మచీరా, పదిహేనేళ్ళ వయస్సులో పోయిన మొదటిపిల్ల వేసుకున్న వోణీ, భర్త ఆఖరురోజుల్లో కప్పుకున్న రగ్గూ, కట్టుకున్న పంచా. ఇలాటివాటి పోలికపట్టలేని భాగాలన్నీ ఆ బొంతలో ఉన్నాయి. ఇదివరకు దాన్ని ఎవరన్నా ముట్టు

కుంటేవాలు కన్నుమని విరుచుకుపడేది కాని ఇప్పుడుమటుకు అది తనదిఅన్న ధ్యాసగాని వానిలోని బట్టల గురించిన ఏ జ్ఞాపకాలు కాని ఆ మనస్సులో లేనేలేవు. అయినా కొడుకుమటుకు తన మనసులోని సెంటిమెంటు తృప్తికోసం రోజూ రాత్రి ఆ బొంత ఆవిడకి కప్పి వెళ్లిపోతాడు,

పులిహోర, బూరెలు, పోళీలు, చేగోడీలు, జంతికలు మొదలైన వాటికోసం ఒకనాడు తహతహలాడిపోయి నాలికకి సందేశాలు పంపించి ఊటలూరించిన పేగుల్లో ప్రస్తుతం పాలలో తడిపిన నాలుగైదు చిన్న బన్ను రొట్టెముక్కలూ: ఒక అరగళాసు గోధుమ నూక జావ మటుకే అయిష్టంగా పైకి వస్తున్న జీర్ణకోశపు రసాలతో పేచీ పడుతున్నాయి. బాగా వాచిపోయిన కాళ్లూ, పట్టేసిన కీళ్లూ, వాలిపోయిన వెన్నూ మొదలైన శరీరంలో భాగాలు బాధాకరమైన సందేశాలు పంపి మెదడును వేధించి నోటిని మూలిగించేవి ఇదివరకు. కాని డాక్టరుగారు తన మందులేవీ మరి ఆవిడ తత్వంమీద పని చేయకపోవడంవల్ల చివరికి నల్లమందు వెయ్యమని సలహా ఇచ్చినప్పటినుంచి మూలుగులేకుండా ఎడెనిమిది గంటలపాటు నిద్రపోతూంది రాత్రిళ్లు ఈ రోజుల్లో ఆవిడ.

తొలికోడి అరుస్తున్నప్పుడు మెలకువ వస్తుంది ఆవిడకి. ఒక్కొక్క రోజు కొద్దిగా ముందే మేలుకొంటుంది. కష్టపడి కష్టపడి ఎలాగో లేచి మోకాళ్లని చేతులతో పట్టుకొని మంచంమీద కూర్చుంటుంది. తెలతెల వారుతున్నప్పుడు కోడలు పడకగది తలుపులు తెరుచుకునివచ్చి వీధి తలుపు గడియ తీయడమూ, వంటింట్లోకి వెళ్లి అంట్లగిన్నెలూ చెంబులూ పెరట్లో పడెయ్యడమూ, కుంపటి అంటించి విసన కర్రతో విసరడమూ ఇలాంటి చప్పుళ్లన్నీ ఆవిడ చెవిదొప్పల్లోకి చొరబడుతూనే ఉంటాయి కాని వాటి అర్థం ఆవిడకి బోధపడడం మానేసి చాలా రోజులైంది. పని మనిషి రంగమ్మవచ్చి ఆవిడ పడుకున్న నడవలోంచి పెరటిలోనికివెళ్తూ 'మామ్మగారూ ఈవాళ ఒంట్లో కులాసాగా ఉందండీ?' అన్నప్పుడు మటుకు ఒక్కసారి మెరపులా తన అశక్తత ఏదో అస్పష్టంగా ఆవిడకి స్పృహతగిలి, రంగమ్మవైపు చూడకుండానే ఎడమచెయ్యి మోకాలుమీదినుంచి తీసి కొద్దిగా పెదవి విరుస్తూ ఆ వేళ్లు కదిలిస్తుంది.

కోడలు సాయంతో సూర్యోదయం వేళకి ఒక్కస్నానం తప్పించి మిగతా కాల కృత్యాలన్నీ నెరవేరాక మళ్లీ మంచంమీద కూచుని అరగళాసు కాఫీ తాగుతున్నప్పుడు డాక్టరుగారి ఆంక్షవల్ల అందులో అసలు పంచదార లేకపోవడాన్ని ఏదో లోటుగా అనిపించి కోడలువైపు కళ్లెత్తి చూస్తుంది ఆవిడ. కోడలు జాలిగా ఆవిడవైపుచూసి 'ఏం చేస్తాం. తాగెయ్యండి' అన్నట్లుగా సైగచేస్తుంది. మళ్లీ కళ్లు దించుకుని తాగేస్తుంది ఆవిడ. కోడలు పడుక్కోబెట్టి దుప్పటికప్పి, బొంత మడతపెట్టి కాళ్ల గట్టునపెట్టి వెళ్లిపోతుంది. ఇంకా తనని నిలబెట్టి ఉంచినందుకు కృతజ్ఞతా సూచకంగా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు నారాయణుడిని తలచుకోడానికి నోటిని సాయం అడుగులాయి. అయిష్టంగా నీరసపు పెదవుల్ని ఎరువిస్తుంది నోరు కొంతసేపు.

బాగా ఎండ ఎక్కాక కోడలువచ్చి ఆవిడని తీసుకెళ్లి స్నానం చేయిస్తుంది. చిన్నప్పుడు కన్నవారి ఊళ్లో ఏటి నీట్లో రోజూ స్నానం చెయ్యడం ఏదో లీలగా జ్ఞాపకం వస్తుంది ఆవిడకి. ఒకసారి పెదవి విరిచి అంతలోనే మరిచిపోతుంది. గంగాళంలో కోడలు చెంబు ముంచి నీళ్లు పైకి తీసినప్పుడల్లా ఏదో తోతునుంయ్యా, గిలక తాలూకు కిర్రుబుర్రు చప్పుడూ పెద్దపెద్ద వేరాకులలాటి తాళ్లూ ఆవిడకి అస్పష్టంగా స్పృహకి తగిలి అంతలోనే జారిపోతాయి.

మడిబట్టకట్టి నెమ్మదిగా కోడలు తనని భోజనాల గదికి తీసుకువెళ్తున్నప్పుడు దేవుడి గదివైపు ఒకసారి చూసి ఎందుకో తనకు సరిగా తెలియకపోయినా ఒకసారి తలవంచుతుంది ఆవిడ కొద్దిగా. ఒకప్పుడు రోజూ గంటసేపు తడిబట్టతో తాను పూజచేసే దాన్నిఅన్న జ్ఞాపకమే లేకపోయినా మోకాళ్ల గుంట్లు స్వాధీనం తప్పడాన్ని నేలమీద కూచునే వీలులేక చిన్నస్టూలుమీద కూర్చుని భోజనం పూర్తిచేసుకుంటుంది. ఒకప్పుడు ఎన్నో వస్తువులు కావలసిన ఆ జిహ్వ ఇప్పుడు తనకి దొరికేవి కారంలేని చింతపండు పచ్చడి పిసరూ, చారూ అన్నం, మజ్జిగా అన్నం మటుకే అయినా ఏ విధమైన పేచీ అల్లరీ పెట్టదు.

మళ్లీ మంచంమీద పడక సాయంత్రం నాలుగువరకూ. నడవలోంచి ఎవళ్లెవళ్లో వెళ్తూ వస్తూ ఉంటారు. కాని కొంతసేపు నిద్రలో కళ్లుమూసుకునీ, కొంతసేపు మేలుకునే కళ్లుమూసుకునీ, కొంతసేపు కళ్లు తెరుచుకునీ కాలం గడిపే ఆవిడ అవేమీ పట్టించుకోదు. ఎవరన్నా పైవాళ్లో లేక కొడుకో కూతురోవచ్చి 'ఎలా ఉంది ఒంట్లో?' అని అడిగినప్పుడుమటుకు కళ్లు బాగా తెరచి వాళ్లవైపుచూసి తల కొద్దిగా ఆడించి 'ఇక ఇంతే' అన్నట్లు చేతితో సైగచేస్తుంది ఆవిడ.

నాలుగు గంటలకి కోడలు తనని కూచోపెట్టి అందించిన కాఫీ తాగుతూన్నప్పుడు తన ఇహలోక యాత్రకి సంబంధించిన మనుషులు వీళ్లు: ఏదో అనుబంధంఉంది వీళ్లకీ నాకూ అనిపించి 'అంతా బాగానే ఉన్నారుగదా?' అన్నట్లుగా ఏదో నీరసంగా గొణిగి కళ్లతోనూ చేతితోనూ ప్రశ్నిస్తుంది. కాని కోడలు సమాధానం చెప్పేటప్పటికప్పుడే ఆ ప్రశ్నసంగతే మరుపుతెరల వెనక్కి వెళ్లిపోతుంది.

దిళ్లకానుకుని అలాగే ఆ ఇంటి కప్పువైపు చూస్తూ కూర్చుంటుంది రాత్రి భోజనంవేళవరకూ ఆవిడ. సాయంత్రం చీకటి పడుతున్నప్పుడు కూతురు మందుడబ్బాతెచ్చి రాయమన్నావా అని అడుగుతుంది ఒక్కొక్క రోజు ఆవిడ ఎక్కువగా మూలుగుతూ ఉంటే; నెమ్మదిగా అలాగే తలగడాలమీద బోర్లా పడుక్కొని వెన్నులో ఆ మందు ముద్ద రాయించుకుంటుంది ఆవిడ. అంతకుముందు డబ్బాలకిడబ్బాలు ఖర్చులయ్యేది. కాని నల్లమందు మొదలైనప్పటినుంచీ దాని అవసరం బాగా తగ్గిపోయింది.

# రేపు లేదు...

విడుస్తున్నరకి నాలుగైదు చిన్నచిన్న బన్ను రొట్టెముక్కలూ— అభగళాను గోధుమజా జావా...
కొడుకు :

తొమ్మిదిగంటలు కొడుతూంది గడియారం. దానివైపు ఒకసారి చూసి చేతిలో పేపరు మధ్యకి మడిచి బల్లమీద పెట్టి రేడియో స్విచాన్ చేసి ఇంగ్లీషులో వార్తలు విన్నాడు సీతారాం. ఆ తరువాత రేడియో ఆపి మళ్ళీ పేపరు విప్పబోతూ అవతలి గదిలో ఇంగ్లీషు పాఠం చదువుతున్న కొడుకు ఒక మాట తప్పుగా పలకడం విని గట్టిగా 'డైర్ కాదురా చిట్టీ, డెయిర్ అనాలి' అన్నాడు. ఆ వెంటనే 'డెయిర్' అని రెండుసార్లు అని చదువుకుపోతూ చిట్టి మరోకచోట ఆ మాట రాగా మళ్ళీ 'డైర్' అనే పలకడం ఎడిటోరియల్ పూర్తిచేస్తున్న అతనికి వినిపించలేదు. చదవవలసినవన్నీ చదివేసి మామూలు అలవాటు ప్రకారం చివరని మధ్యపేజీలో కార్టూను చూసి రోజూలాగే ఒకసారి చిరునవ్వునవ్వాడు కనీ కనిపించకుండా.

పేపరు మడిచి బల్లమీద పెడూ కేశాలంకరణకి ఏదో నూనె వాడమని ప్రోత్సహించే అడ్వర్టైజ్‌మెంటులో ఉన్న అమ్మాయి బొమ్మ కళ్ళబడి దానిపైనే రెండు మూడు క్షణాలు చూశాడు అతడు. కాలేజీలో తనకు రెండేళ్ళు జూనియర్‌గా చదివిన బారిష్టరు రాధాకృష్ణగారి అమ్మాయి లలిత పోలికలు అందులో గోచరించాయి అతనికి. ఆ అమ్మాయిని తాను ప్రేమించానని అనుకోవడమూ, కాలేజీలో అన్ని విషయాల్లోనూ చురుకుగా ఉండే తనని మెప్పుకోలు నిండిన కళ్ళతో ఆ అమ్మాయి అప్పుడప్పుడు చూడడం మానీ, ఎప్పుడో లలిత అన్ని సాంఘికపుటంతస్తులూ మరిచిపోయి తల్లిదండ్రుల నెదిరించి తనతో వచ్చేసి తనని పెళ్ళాడి జీవితాంతం వరకూ సహచారిణిగా ఉంటుందని తాను కలలు కనడమూ, చివరికి ఆ అమ్మాయికి తన మనస్సు విడదీసి చెప్పే అవకాశమే ఎప్పుడూ కలగక తాను ఆ కాలేజీ వదలడమూ, ఆ తరువాత ఆ అమ్మాయి ఎవరో ఐ. సీ. యస్. ఆఫీసర్‌గార్ని పెళ్ళాడిందని వినడమూ అన్నీ జ్ఞాపకం వచ్చాయి ఒకసారి. ఇప్పుడెక్కడుందో లలిత అనుకున్నాడు, అప్పుడప్పుడు ఆ అమ్మాయి జ్ఞాపకం వచ్చినప్పుడు అనుకున్నట్లుగానే. నిజానికి తన భార్య సుశీల లలిత కన్నా ఎంతో అందంగా ఉంటుంది. అయినా లలిత జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఎందుకో గుండె కలుక్కుమనడం మానదు ఒకసారి. ఆ వెంటనే సుశీల అత్తగారికి చాకిరీ చేసినట్లు లలిత చేస్తుందా, తానెంతో అదృష్టవంతుడు, అందుకే సుశీల లాంటిది భార్యగా తనకి దొరికింది అని మనసులో అనుకోవడమూ మానదు.

సీతమ్మ మూలుగుతూ నారాయణ అనుకోవడం మరి వినపడలేదు నడవలోంచి. అమ్మ నిద్రపోయింది అనుకుంటూ లేచి వెళ్ళి మూలని స్టూలుమీద ఉన్న ఆఫీసు ఫైళ్ళ కట్ట తెచ్చుకుని విప్పి ఆ కాగితాలు చూసుకోవడం మొదలు పెట్టాడు. మొదట్లో మొదట్లో విసుగుగా అనిపించేది కాని ఇప్పుడు మటుకు అలా అనిపించడం మానేసింది. ఒక్కొక్క రోజు ఆఫీసులో టైము ఉన్నా కూడా రాత్రికి మరి ఎలాగ అనిపించి కొన్ని కొన్ని వెనక్కి ఉంచి ఇంటికి తెచ్చుకోవడం కూడా అలవాటు అయింది. తాను ఇంటికి వస్తున్న వేళకి సరిగా క్లబ్బుకి వెళ్తున్న ఆఫీసర్‌గారికారు దారిలో ఎదురవుతుంది. తన సైకిలు కేరియర్ మీద ఫైళ్ళు కట్టిన గళ్ళగుడ్డదస్త్రం చూసి ఆ ఆఫీసర్ రోజూ ఒకసారి నవ్వుతాడు మెచ్చుకున్నట్లుగా. సర్వీసు మొదలైన ఎనిమిదేళ్ళకి వచ్చిన అప్పర్ డివిజన్ స్థాయి నుండి మరోక మెట్టు పైకి వెళ్ళడానికి ఆ మెప్పుకోలు నవ్వు సాయపడి తీరుతుంది అన్న నమ్మకంతో తాను ఇంటికి చేరుకుంటాడు.

వంటింట్లో పనులు ముగించుకుని సుశీల వచ్చి బల్లమీద పళ్ళెంలో తాను వేసుకోగా మిగిలిపోయిన తమలపాకులు సున్నం రాసివేసుకోవడం ఓరగంటితో చూశాడు. అయిదోనెల కావడాన్న ఆమె ఒళ్ళు కొద్దిగా బరువుగా కనిపించింది అతనికి. కాపురానికి వచ్చిన తొమ్మిదేళ్ళలోనూ అప్పుడే ఇది అయిదోసారి అయినా మొదటి పిల్లవాడు తరువాత పుట్టిన ముగ్గురూ సంవత్సరంలోపుగానే కన్ను మొయ్యడంతో భార్య గర్భవతి అంటేనే ఏదో బెదురుగా ఉండడం మొదలుపెట్టింది అతనికి. రోజూ లాగే ఒకసారి అనుకున్నాడు ఈ సారి పుట్టిన నలుసన్నా ఏ ఆపదా రాకుండా పెరిగి పెద్ద కావాలని. పెద్దయి తననేదో ఉద్ధరిస్తారని కాదు— ఆ సంగతి కొస్తే తానే మాత్రం తనని కన్నవాళ్ళని ఉద్ధరించాడు కనక! మంచిగా ఉండాలి అనుకుంటూ తల్లిమీద విసుక్కునేవాడు ఇదివరకు — ఆవిడ మతి సరిగ్గా ఉండకుండా పోయిన దగ్గర నుంచీ ఈ మధ్య అది తగ్గిపోయింది గానీ, పెద్దవాళ్ళు కాగానే పిల్లలూ తండ్రీ ఎవరికి వారే. ఏ తాశీల్దారుగానో రిటైరయేంత వరకూ తన బాధ తనకెలాగూ తప్పదు.

తాంబూలం వేసుకోవడం పూర్తిచేసి తన వైపు ఒకసారి చూసి భార్య తక్కువ వాల్యూంలో రేడియో వేసుకుని వింటున్న ఏదో వాద్యసంగీతం చెవుల్లో పడింది. రోజూ రాత్రి ఒక పావుగంటో అరగంటో సుశీల రేడియో వేసుకున్నప్పుడల్లా అతనికి పెళ్ళిలో ఇవ్వకుండా వెనక్కి బాకీఉంచిన కట్నం సంగతి అత్తగారికి తాను ఉత్తరం రాయడమూ, భర్త పోయినతరువాత మిగిలిన సామగ్రిలో కొద్దిగా విలువైన వస్తువు ఒక్క రేడియోయే కావడాన్ని దాన్ని అల్లుడికి ఆవిడ పంపడమూ జ్ఞాపకం వచ్చి గుండె కలుక్కుమంటుంది ఏదో తప్పుచేసినవాడిలా. ఆ రేడియోమీద కన్ను పడే తాను రాశాడు ఆ ఉత్తరం. రేడియో నాబ్సుమీద సుశీల చేయి పడ్డప్పుడల్లా తన ఒంటిచుట్టూ కట్టుకున్న మంచితనపు దడిలో ఎక్కడో చెదలుపట్టి పుచ్చిపోయిన రాటమీద చేయి వేసినట్లుగానే అనిపిస్తుంది అతనికి.

రేడియో ఆపేసి భార్య అన్నదానికి సమాధానంగా 'ఇప్పుడే వస్తాను, ఇది పూర్తిచేసి. నువ్వెళ్ళి పడుక్కో అలిసిపోయావు' అని తానడమూ ఆమె నవ్వి 'నాకేం అలుపు? పొద్దున్న పదినుంచి సాయంత్రం అయిదువరకూ అక్కడ సతమతమై మళ్ళీ ఇక్కడ కూడా బాధపడుతున్నారు, మా కోసం!' అనడమూ మామూలు ప్రకారమే జరిగింది.

సుశీల వెళ్ళి అవతలిగదిలో అప్పుడే చదువు మానేసి పడుక్కున్న కొడుకునీ, మంచంమీద కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటున్న మరదల్నీ ఒకసారి పలకరించి నడవలో పడుక్కున్న అత్తగారి దగ్గరకు వెళ్ళి మంచినీళ్ళ చెంబూ, గ్లాసూ మంచం పక్కన పెట్టివచ్చి తలుపులు లోపల గడియవేసి మంచమెక్కి అటు పక్కకు ఒత్తిగిలి పడుకోవడం అతడు గమనించాడు. చేస్తున్నపని అంత ముఖ్యమైనది

# రేపు లేదు...

కాకపోయినా అలవాటు ప్రకారం పదింపావు అయితేగాని అక్కడినుంచి లేవడం ఇష్టం లేక ఆ కాగితాలు తిరగేస్తున్న అతనికి మరునాడు సాయంత్రం చెల్లెల్ని చూడడానికి ఎవళ్ళో పెళ్ళి సంబంధంవాళ్ళు వస్తారు అన్నమాట జ్ఞాపకం వచ్చింది. మొదట్లో మొదట్లో ఇటువంటి సందర్భాల్లో ఎంతో ఆశపడి నానా హడావుడీ పడేవాడుగాని ఇప్పుడిప్పుడు అసలేమాత్రమూ హుషారు కలగడంలేదు అతనికి. చెల్లెలు ఇలా చామనచాయగా లేకుండా తెల్లగా ఉంటే ఎంత బావుండేది! మొహం ముక్కూ ఎంత తీరుగా ఉన్నా, మనిషి ఒళ్ళు వంపు సొంపులతో ఎంత నిండుగా ఉన్నా ఏమిలాభం? తానెలాఉన్నా ప్రతీ పెళ్ళికొడుక్కీ తెల్లపిల్లే కావాలి. పళ్ళు పెద్దవైనా, కళ్ళు మిడిగుడ్లయినా, ఒళ్ళు చీపురుపుల్లలా ఉన్నా తెలుపుదనంతో అన్నీ కప్పుకుపోతాయి. ఆ తెలుపుదనమే తక్కువైనప్పుడు మామూలుగా వెయ్యవలసిన వరదక్షిణరేటుకి, తగ్గిన ఒక్కొక్క చాయకీ ఒక్కొక్క వెయ్యి చొప్పున పూటు చేయగలిగితే మరి బాధలేదు. కాని మామూలు రేటుకే తనకి శక్తి పూర్తిగా చాలనప్పుడు పూటు సంగతి ఎలా చూడగలడు! అందువల్ల తను తాశిల్దారు అయిననాడూ చెల్లెలు ఇంట్లో ఉండడం తప్పదు. ఈ సంగతి తెలుసును తనకి అయినా వీలుంది అన్నప్పుడల్లా ఈ సంబంధాల వ్యవహారం మానలేదు, తన విద్యుక్తధర్మం తాను నెరవేరుస్తున్నాను' అన్న సంతృప్తికి. అందుకే 'నీ సంగతి మరిచిపోయాడనుకోకు విూ అన్నయ్య' అన్నట్లుగా ఇందాక భోజనాల ముందు కాళ్ళు కడుక్కునేటప్పుడు నీళ్ళు అందించిన చెల్లెలుతో అన్నాడు.

'వాళ్ళెవళ్ళో రేపు సాయంత్రం వస్తారట' అని ఆమె ఏమీ మాట్లాడకుండా తనకి తువ్వాలు అందించింది. వాళ్ళెవళ్ళో ఏమిటో తానూ చెప్పలేదు. ఆమే అడగలేదు. 'దానికీ తెలుసును ఇదేవిూకాదని,' అని అనుకున్నాడు మనస్సులో.

ఫైళ్ళన్నీ కట్టకట్టి స్టూలు విూద పెట్టి డ్రాయరులోంచి ఒక చుట్ట తీసుకుని అంటించుకున్నాడు సీతారాం. ఆ లంక పొగాకు కాలిన పొగవాసన నోరూముక్కూ, గొంతూ, రోజూ ఒకసారి ఆ రాత్రివేళ అనుభవిస్తేగాని లేకపోతే కలతనిద్ర అయిపోతుంది అతనికి.

చుట్ట కాల్చినప్పుడల్లా ఆఫీసులో హెడ్ గుమాస్తా జ్ఞాపకం వస్తాడు తనకి. చస్తే డబ్బిచ్చి చుట్టముక్క కొనడు. ఏవో ఏవో పనులమీద తన దగ్గరికి వచ్చిన పైవాళ్ళందరిదగ్గరా తలా ఒక చుట్ట చొప్పున పుచ్చుకోవడమే కాకుండా తనకింద పనిచేసే గుమాస్తాలని కూడా అడుగుతాడు. 'ఏమోయి సీతారాం, ఏమోయి వెంకట్రావు స్టాకు ఏమన్నా ఉందా రా చుట్టలు?' అని

దేవుడు మంచివాడైనా పూజారినికూడా మంచి చేసుకోవాలన్న సంగతి తెలిసిన తాను మటుకు తక్కిన గుమాస్తాలలా ఇచ్చినవాడు ఇచ్చినట్లు లేనివాడు లేనట్లు కాకుండా రోజూ ఒక మంచిచుట్ట తప్పకుండా హెడ్ గుమాస్తాకి ఇస్తాడు. కుడివైపు చివర పళ్ళమధ్య ఆ చుట్టని గట్టిగా పట్టి పొగ పీలుస్తూ 'మంచిలంకపొగాకోయ్ ఇది! నీ కెలాగన్నా చుట్టనాణెం తెలుసును! పనికొస్తావు!!' అంటాడు అతడు. తన కెంతో నిండుగా అనిపిస్తుంది, ఈ మాటలే ఎందుకూ పనికిరాని టైపిస్టు గురుమూర్తితో కూడా అతడు చుట్ట పుచ్చుకున్నప్పుడు అంటాడని తెలిసినా.

చుట్ట పొగ పీలుస్తూ తనలో తానే నవ్వుకున్నాడు సీతారాం. టైపిస్టు గురుమూర్తి అనగానే అతని నల్లకోటు జ్ఞాపకం వచ్చి, ఆ కోటు లేకుండా గురుమూర్తిని ఈ పదేళ్ళుగా తానెప్పుడూ చూడలేదు. ఎడమవైపు కింద జేబులో ఒక షార్టుహేండ్ నోట్‌బుక్కూ, పై జేబులో ఒక పెనసలూ ఎప్పుడూ కనిపిస్తూంటాయి. రోజూ మధ్యాహ్నం తను డిక్టేషన్ ఇవ్వగా గంటసేపు ప్రాక్టీసు చేస్తాడు అతడు. మహా జోరుగా తడుముకోకుండా పేజీలకి పేజీలు నింపేస్తాడు. అయితేనేం ఏమిటి రాశావో చదవమంటే చస్తే చదవడు. 'నువ్వేమన్నా పరీక్ష చేస్తున్నావేమిటి నన్ను! నా ప్రాక్టీసుకి నేను రాసుకోవడంగాని!' అంటాడు. అది మరేం ప్రాక్టీసోగాని అతడు వెళ్ళిన ఏ ఇంటర్వ్యూలోనూ షార్టుహేండ్ టెస్టులో అతడు నెగ్గడమన్నది కనిపించదు.

అందరికన్నా ముందు ఆఫీసుకి రిసీట్

టిప్పెని క్లార్కు రామస్వామీ, ఆ తరువాత తామూ, ఆ తరువాత హెడ్ గుమాస్తా ఆ తరువాత అకౌంటెంట్ వెంకట్రావూ, తరువాత తక్కినవాళ్ళూ వస్తారు. గురుమూర్తి వచ్చేటప్పటికల్లా అందరూ ఒకసారి కళ్ళెత్తి అతనివైపు పరకాయించి చూసి చిరునవ్వు నవ్వుతారు. వెంకట్రావు అంటాడు: 'ప్రైవేట్ సెక్రెటరీగారు వచ్చారోయ్!' ఆ వెంటనే రామస్వామి అంటాడు 'విత్ బ్లాక్ కోట్ అండ్ ది కాన్ఫిడెన్షియల్ నోట్‌బుక్!' దానితో అందరూ పకపక నవ్వుతారు. అదొక స్టాండింగ్ జోక్ ఈ పదేళ్ళనుంచీ ప్రతిరోజూ! అలాటి చిరస్థాయి అయిన జోక్స్ మరికొన్ని ఉన్నాయి కాని ఇదిమటుకు ఎప్పుడూ మొదటి స్థానంలోనే ఉంటుంది.

ఈ జోకులన్నీ చాలావరకు వెంకట్రావు సృష్టించినవే! అసలు 'జిలేబీ జోక్' మటుకు! ఆఫీసర్ గదిలోంచి చివాట్లు తిని తెల్లమొహంతో ఎవడన్నా పైకి వచ్చాడంటే మటుకు ఎవడో ఒకడు అది కనిపెట్టి ఆ వ్యక్తి పేరుచెప్పి వాడికి 'నేడి జిలేబీ దొరికిందోయ్!' అంటాడు. అందరూ విరగబడి నవ్వుతారు.

రామస్వామి జేబుగడియారం జ్ఞాపకం వచ్చింది సీతారాంకి. రోజుకు ఏడెనిమిది సార్లన్నా టైం పెడుతుంటాడు దానికి అతడు. ఆఫీసులోని గోడగడియారం ఠంగు ఠంగున గంటలు కొట్టినప్పుడల్లా రామస్వామి జేబు గడియారం పైకి రావలసిందే. వెంటనే వెంకట్రావూ 'ఆఫీసు గడియారం పనిచెయ్యటంలేదు రామస్వామి ఆలిండియా ఫేం బిగ్‌బెన్నే ఆ గంటలు కొట్టింది' అనవలసిందే! టైం సరిగా పెట్టి గడియారం జేబులో పెట్టుకుంటూ 'మెచ్చుకున్నాం లేవోయ్ వెంకట్రావ్! పాతాల్‌రావ్, లెక్కల్రావ్, ఏమిరావ్!' అని రామస్వామీ ఆ వెంటనే అనవలసిందే!

కిటికీదగ్గర నిలబడి అవతలి రోడ్డుమీద దీపాన్ని చూస్తూన్న సీతారాం చుట్ట తాగడం పూర్తిచేసి ఆ పీక అవతల పారేశాడు. టేబుల్‌దగ్గరకువెళ్ళి డ్రాయర్ తీసి అందులోఉన్న ఎంగేజ్‌మెంట్ పాడ్ తీసి చూసాడు. అది ఎవరో కంట్రాక్టరు ఒకసారి తనతో పనిఉండి ఆఫీసుకి వచ్చినప్పుడు తాను 'ఎంతో బావుందండీ! ఇది! 'అంటే' కావలిస్తే ఉంచండి మీరు, నాకు మరొకటి ఉంది.' అని తన కిచ్చాడు. అప్పటికి నాలుగు నెలలు అయిపోయినా మిగిలిన ఎనిమిది నెలల కాగితాలూ వాడ వచ్చుకదా అని తను తీసుకున్నాడు. అప్పటి నుంచీ ప్రతిరోజూ రాత్రి పడుకున్నేముందు ఒకసారి తీసి మరుచటిరోజు ఎంగేజ్‌మెంట్స్ ఏమిటి ఉన్నాయో చూసుకుంటూ ఉండడం అలవాటు చేసుకున్నాడు. ప్రతి గంటకూ ఒక లైను. ఉదయం ఆరునుంచి రాత్రి తొమ్మిదివరకూ అందులో ఉంది. కాని నిజానికి ఎప్పుడో ఆఫీసర్ పొద్దున ఆఫీసుకు రమ్మన్నప్పుడు తప్పతక్కిన రోజుల్లో మామూలుగా ఆరునుంచి పది వరకూ ఏమీ ఉండవు తనకి ఎంగేజ్‌మెంట్లు. కాలకృత్యాలు నెరవేర్చుకోవడమూ, రోజు విడిచి రోజు గడ్డం చేసుకోవడమూ, స్నానమూ, భోజనమూ భోజనానంతరం ఒక పావుగంటసేపు పడకకుర్చీలో కునుకు తీయడమూ ఆ తరువాత ఆఫీసు. ఆఫీసు టైంలోనూ ఈ పాడ్‌లో రాసుకుని జ్ఞాపకం ఉంచుకోవలసినంత ముఖ్యమైనవి ఏవీ ఉండవు కాని ప్రతిరోజూ ఏదో ఒకటి రాసుకోవడంమటుకు మానడు తాను. ఆఫీసు అయ్యాక ఇంటికి రావడమూ, టిఫిన్ తిని బజారుకి వెళ్ళికావల్సిన కూరా నారా తెచ్చుకోవడమూ, ఆ తరువాత అప్పుడప్పుడు స్నేహితులతో కలిసి అడ్డాట ఒకగంటసేపు ఆడడమూ, తరువాత చిట్టికి ఒకగంట ట్యూషనూ, అమ్మ భోజనం అయ్యాక తన భోజనమూ, పేపరు చదువుకోవడమూ, ఇంగ్లీషు వార్తలు వినడమూ...

పాడ్ డ్రాయర్‌లో పడేసి పెద్దదీపం ఆర్పి సుశీల తగ్గించిఉంచిన బెడ్‌రూమ్ లైట్ కొద్దిగా పెద్దదిచేసి వెళ్ళి పడుకున్నాడు సీతారాం.

కూతురు:

పదిగంటలు కొడుతూంది గడియారం. చదువుతున్న పుస్తకం గురించి ఏదో తనని అడిగి వెళ్ళి సుశీలవదిన వేసిన మధ్య గది తలుపువైపు ఆలోచనగా చూస్తూన్న జానకి ఆ గంటల చప్పుడు విని మళ్ళీ పుస్తకం వైపు కళ్ళు తిప్పింది. తనకి తెలియకుండానే కళ్ళవెంట ఇందాకటినుంచీ నీళ్ళు కారుతున్నాయి కాబోలు మసకమసకగా అయి అక్షరాలు కనిపించక కుడిచేతి మధ్యవ్రేలితో కళ్ళు తుడుచుకుంది. ఇందాక తాను కాళ్ళు కడుగుకోడానికి నీళ్ళిస్తున్నప్పుడు అన్నయ్య అన్నది మర్చిపోదామన్నా మరపుకు రావటం లేదు.

మళ్ళీ ఎవళ్ళో వస్తున్నారు తనని చూడడానికి. వాళ్ళకి ముందే తెలిసిఉంటుంది తను చామనచాయ మనిషినని. అయినా వచ్చి ఒకసారి చూసి పెదవి విరిచి వెళ్ళిపోతేగాని వాళ్ళకి తృప్తిఉండదు. వెంటనే పెదవి విరవరు నిజానికి. మధ్యవర్తులు ఆ తరువాత అన్నయ్యతో మాట్లాడడమూ, ఎలాగూ ఇవ్వడానికి వీలుకాని రేటుదగ్గర మాటలు నిలిచిపోవడమూ, చివరకి అవతలి వైపు ఆడబడుచో, ఆ ఇంటి పెద్ద కోడళ్ళలో ఎవరో ఒకరో 'పదివేలిచ్చినా ఆ నల్లమద్దిని చేసుకోమని ఎవరు చెప్పార్రా? గతిలేకపోతేనేగాని!' అనిపెళ్ళికొడుకుతో అని నవ్వుకోవడమూ ఎలాగూ తప్పదు.

తన చిన్నప్పుడు నాన్నమీద ఎందుకో కోపంవచ్చి అమ్మ 'అడదైపుట్టేకన్న అడవిలో మానై పుడ్తే మేలు!' అని అనడం విన్నప్పుడల్లా తాను నవ్వుకునేది. కానిఎంత నిజం ఆ మాట!

తన స్కూల్‌ఫైనల్ చదువు పూర్తయ్యే వరకూ నిజానికి ఎవళ్ళన్నా ఈ పెళ్ళి సంగతి తెచ్చినా పెళ్ళిచూపుల కెవళ్ళన్నా వచ్చినా తనకి ఉపద్రవమైన కోపం వచ్చేది. 'పెళ్ళి అవుతేగాని బతుకు మరిలేదా?' అనుకునేది మనస్సులో. అన్నయ్యకి పెళ్ళిచేసి ఆ కట్నం డబ్బుతో తన పెళ్ళి సెటిల్ చేద్దామని నాన్న ఉద్దేశం. అందుకే తను స్కూలుఫైనలు చదువుతున్న సంవత్సరమే అన్నయ్యకి పెళ్ళి చేసేసారు. వదిన అప్పటికే పంతొమ్మిదేళ్ళది తనకిమటుకు ఎందుకో జాలివేసింది వదినమీద. పెళ్ళిచూపులకి అమ్మతోనూ, అన్నయ్యతోనూ తానూ వెళ్ళినప్పుడు, కొనుక్కునే ఆవుని పరీక్షగా చూసినట్లుగా అమ్మ వదినని చూస్తున్నదనిపించి, వదినా వాళ్ళ అమ్మా, అమ్మా మాట్లాడుతూండగా ఎందుకో లేచిపోయి పక్కగదిలోకి వెళ్ళిన వదినవెంట తానూ వెళ్ళి పలకరించింది. 'నీ పేరు సుశీల కదూ, ఎంతో బావుంది!' అంటూ—తన వైపు వదిన చూసినప్పుడు ఆ కళ్ళల్లో కన్నీటి చాయలు ఉన్నట్లుగా అనిపించి ఆమె భుజంమీద చేయివేసి తాను అంది.

# రేపు లేదు...

'అందుకే ఈ పెళ్ళి చూపులంటే నాకు అసహ్యం! పెళ్ళికూతురూ ఒక మనిషే అన్న సంగతి స్పృహ కుండదు వచ్చిన వాళ్ళకి! ఏమీ అనుకోకండి మా అమ్మ పూర్వకాలపు మనిషి!' జాలిగా చిరునవ్వు నవ్వి అంది వదిన. 'ఇది అలవాటైపోయింది. అందుకు కాదమ్మా.' తాను రెప్పవేయకుండా ఆమె వైపు చూసి అంది! 'మరెందుకు ఈ పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేదా మీకు' ఎక్కడో శూన్యంలోకి చూస్తున్నట్లుగా చూసి అంది వదిన. 'ఆడది పుట్టిన తరువాత పెళ్ళి చేసుకోవడం తప్పదమ్మా చిన్నపిల్లవి నీ కింకా తెలియదు.' తా నంది నెమ్మదిగా! 'అలా అని ఇష్టం లేకపోతే మటుకు ఏంతమాత్రమూ చేసుకోకండి.' జాలిగా నవ్వి తన మాటల్ని మధ్యలో ఆపి అంది వదిన. 'నీలాటిదాని స్నేహంకోసం మన్నా ఈ పెళ్ళి చేసుకోవాలని ఉంది.' వెంటనే నాలిక కరుచుకుని తొందరగా అంది. 'లేదులేదు. ఇలా అన్నావని ఎవళ్ళ తోనూ అనకు అనవు కదూ, చెప్పు. అనవు కదూ?' వదిన కుడిచేయి ముందుకులాగి ఆ అరచేతిలో తన చేయివేసి అంది తాను. 'అనను ఎవళ్ళతోనూ అనను.'

ఆ వేళ కలిసిన స్నేహం ఇవాళటివరకూ అలాగే సాగుతూంది. పేరుకుకి తగినట్లే ఎంతో మంచిది వదిన. ఇందాక వెళ్ళిపోతూ తన నుదుటిమీద పడుతున్న ముంగురులని వెనక్కి తోసి చెంపలు నిమిరింది. అప్పుడే మొదలైనట్టుంది తన కళ్ళవెంబడి నీరు కారడం. తను ఎక్కడికి వెళ్ళదు వదిన దగ్గరే ఉంటుంది చివరివరకూ. ఆఖరు రోజున కూడా తన మంచంమీద తన కొనుకుని కూర్చుని తన నుదుటిమీది ముంగురుల్ని వెనక్కి తోస్తూ చెంపలు నిమురుతుంది వదిన. ఆ విధంగా నన్నా తాను జీవితంలో ఒంటరిదాన్ని కాదు అన్న తృప్తితో కళ్ళు మూయ్యవచ్చు.

మళ్ళీ నీళ్ళు కారిపోవడం మొదలు పెట్టింది జానకికి చెంపలమీద. తుడుచుకునే ప్రయత్నం చేయలేదు ఈసారి ఆమె.

అంత మంచి వదినని అమ్మ ఎన్ని మాటలనేదో, ఆమె కాపురానికి వచ్చిన సంవత్సరంలోనే ఆ వేసవి శెలవుల్లో టైఫాయిడ్ జ్వరం వచ్చిపోయిన నాన్న, కోడలు దరిద్రంవల్లనే పోయారని!

నాన్న పోకపోతే తనకి ఆ వేసవి శెలవుల్లో పెళ్ళి అయిపోయిఉండును. కట్నం డబ్బు నాన్న జబ్బుకి కొంత ఖర్చయింది. మిగిలింది వదిన పురుళ్ళకీ, ఇంటి ఖర్చులకి చాలని జీతానికి తోడుగా సర్దుబాటు చేయడానికి ఏనాడో చెల్లయిపోయింది: 'నాన్న కోరిక ప్రకారం నా పెళ్ళికి వచ్చిన డబ్బు పెట్టి జానకి పెళ్ళిచేసితీరతాను' అని అన్నయ్య అంటాడుగాని అది సాధ్యమయ్యే పనికాదని తనకి ఎప్పుడో తెలుసును!

నిన్నగాక మొన్న చేరినట్టుగా ఉందికాని అప్పుడే అయిదేళ్ళు కావస్తూంది తాను పంతులమ్మ ఉద్యోగంలో చేరి అన్నయ్యకు ఇష్టంలేదుగాని వదిన తన బాధ కనిపెట్టి అన్నయ్యతో చెప్పి ఒప్పించింది. వచ్చిన జీతంలో తన బట్టలకీ పాతలకీ ఒక పదిహేను రూపాయలు ఉంచుకుని తక్కింది అన్నయ్యకే ఇచ్చేస్తుంది. 'జానకి పేరట వేరేగా బాంకులోవేసి ఉంచుతాను' అంటుంటాడుగాని అన్నయ్య ఏ నెల దానెలే ఖర్చయిపోతున్నదన్న సంగతి తనకి తెలుసును, నెల తిరిగేటప్పటికల్లా మాటికి పదివంతులు పెరిగిపోతున్న ధరలతో పోటీ పడలేక.

పుస్తకంమూసి దీపమార్పి మంచంమీద పడుకుంది జానకి ఉదయం లేచి ఏడు గంటలకల్లా తయారయి స్కూలుకు చేరుకోవాలి మళ్ళీ పదిగంటలకు వదులుతారు. ఇంటికి వచ్చి వదినకి పనుల్లో సాయం చెయ్యడమూ, చిట్టికి ఒక గంటసేపు పాఠం చెప్పడమూ, భోంచేసి ఒక అరగంట ఏదో చదువుకుని మళ్ళీ రెండుగంటలకి స్కూలుకు చేరుకుని అయిదు వరకూ అక్కడే గడిపెయ్యడమూ—రోజూ ఎప్పుడో ఒకప్పుడు అమ్మని ఒకసారి పలకరించాలి, — ఇప్పుడు లేదుగాని ఇదివరకు తాను పరధ్యానంగా ఉండి అమ్మతో మాట్లాడకపోతే ఆవిడకి కోపం వచ్చేది: 'నా సంగతెవరికీ అక్కర్లేదు! నేను చచ్చినదానితో సమానం!' అని గొణిగేది అందుకే అదొక అలవాటుగా పెట్టుకుంది ప్రతి రోజూ. ఆవిడ వెన్నుమీద మందు రాసి రుద్దినప్పుడల్లా 'ఈ విధంగా నీ ఋణం తీరుస్తున్నానమ్మా!' అని మనసులో అనుకుంటుంది ఆమె. తాను మటుకు అమ్మలా ఎప్పుడూ అవకూడదు. స్కూలుకు వెళ్ళి వస్తూ వస్తూ తోవలో హఠాత్తుగా గుండె ఆగి చనిపోవాలి ఆ పని సాధ్యమైనంత వేగం అయితే, బాగుండును! అదే తాను కోరుకునేది! అప్పుడు మరి

స్కూల్లో మొగవాళ్ళ కళ్ళూ దారిలో తనని చూసే మగవాళ్ల కళ్ళూ ఇప్పటిలా కౌరవ దృష్టితో 'చూడవు తన వంక! మరుచటిరోజు— ఆ మరుచటిరోజు— ఆమరుచటి రోజు-ఇలా ఎన్నిరోజులు గడ వాలో ఆ సుదినం రావడానికి! కాని అది అంత వేగం రాదు

ప్రతిరోజూ తను రాత్రిళ్ళు ఎంత సేపైనా నిద్రపట్టకుండా ఇలా ఇవే సంగతులు ఆలోచిస్తూ పడుకోవలసిందే! వదిన ప్రతీ రాత్రీ వస్తుంది, తన ముంగురులు సరుదుతుంది.. తన చెంపలు నిమురుతుంది వెళ్ళి తలుపు గడియవేసుకుంటుంది. కళ్ల వెంబడి నీళ్లు కారుస్తూ, తాను ఆ తలుపువైపు చూస్తూ వదిన మంచితనం తనకి లభించినందుకు వేయి దేవుళ్ళకి కృతజ్ఞతా భావం ప్రకటిస్తూ ఇలాగే చీకట్లో కళ్ళు తెరుచుకుని ఆలోచిస్తూ ఉంటుంది...

కోడలు :

పదకొండుగంటలు కొడుతూంది గడియారం. తలక్రింద చేతులు పెట్టుకుని వెల్లకిల పడుకున్న సుశీల ఇంటికప్పుమీద పురుగుల్ని వేటాడుతున్న రెండు బల్లులని చూస్తూంది గర్భాశయంలో పెరుగుతున్న జీవపిండం అప్పుడప్పుడు కదులుతూ తిరగబడినట్లుగా అయి అదోకరకంగా వింతగా అనిపిస్తున్నది ఆమెకు ఇదివరకు గర్భవతి అయినప్పుడు ఈ విధంగా జరిగితే తనలో తానే నవ్వుకునేది కాని ముగ్గురు పిల్లలు వరుసగా పోవడంతో ఈసారి ఏవిధమైన ఉత్సాహమూ కనిపించడంలేదు ఆమెలో ఏనాడో తాను వీళ్లకి ఋణపడింది అంతే ఆకాస్త ఋణమూ తీరగానే వెళ్లిపోతారు వాళ్ళు చిట్టి అన్నా ఒకవిధమైన నిర్లిప్తత మొదలైంది ఆమెలో

అలవాటయిపోవడంవల్ల సీతారాం పెడుతూన్న గుర్రు ఆమె ఆలోచనలకి అడ్డు రావడంలేదు. తెల్లవారుఝామున అనగా లేచిపోయి సుమారు పదహారుగంటలసేపు ఇంటిపనుల్లో సతమతమై ఎప్పుడు పడుకున్నాక వెంటనే నిద్రపడుతుంది ఆమెకు కాని భర్త తన ఆఫీసుపనులు ముగించుకుని తన దగ్గరకువచ్చి కొద్దిగా మోటుగా మేల్కొల్పగానే పోయిపోయిన నిద్ర మరి తరువాత చాలా సేపటివరకూ రాదు భర్త వదుల్తున్న ఊపిరినుండి వెడలిన లంక పొగాకు ఘాటైన వాసనకి మొదట్లో వికారంగా అనిపించేది గాని తరువాత తరువాత కొంత తనకు అలవాటయిపోయింది. అసలు ఆ వాసనవల్లనేమో ఆమె మనస్సు వర్తమానంలో ఉండడానికిష్టపడక గతానికి— తన వివాహ పూర్వపు గతానికి—వెళ్లిపోతుంది క్రమక్రమంగా. ఆ గతంలోనే అలా అలా నిద్రపోతుంది ఎప్పుడో చివరకు. మరుచటిరోజు గురించిన విషయాల గురించి ఆలోచించవలసిన అవసరం లేదు ఆమెకు. ఉదయం కళ్లు తెరిచినప్పటినుంచి అన్నీ ప్రతినిముషానికీ నిర్ణీతమైపోయి ఉంటాయి పనులు మళ్లీ రాత్రి పడుక్కునేవరకూ.

పనులు చెయ్యడానికి ఎప్పుడూ తను వెనుదీయదు, తీయలేదు. ఎందుకో అసలు పనులంటే ఎంతో సరదా తనకి నాన్న ఉన్నంతవరకూ ఇంట్లో అమ్మ ఏ పనీ చెయ్యనిచ్చేదికాదు తనని. నాన్న వెళ్లిపోయాక అమ్మతోపాటు మామయ్య ఇంటికి వెళ్లినప్పటినుంచీ ఆ అవకాశం కలిగింది కొన్నాళ్లు తనకి

అప్పటికి తనకి పన్నెండేళ్లు. నాన్న ఎక్కడో దూరదేశంలో ఉద్యోగం చేస్తూండడాన్ని తనకి బాగా జ్ఞానం వచ్చినప్పటినుండి మామయ్యనీ అత్తయ్యనీ ఎప్పుడూ చూడలేదు అందుకే మామయ్యని చూసిన ఆ మొదటిరోజున ఎందుకో భయంగా అనిపించింది, అసలు జట్కా దిగగానే తోకాడించుకుంటూ వాళ్ల డాషండ్ కుక్క తనదగ్గరికి రాగానే తనమీది ప్రాణాలు మీదనే ఎగిరిపోయాయి 'అమ్మో!' అంది తాను, కొత్తవాళ్లే కాకుండా వీళ్లింట్లో ఈ కుక్క కూడా ఉందే అనిపించి. మామయ్య ఇంతలో వచ్చి 'భయంలేదమ్మా బేబీ!' అంటూ కుక్కని లోపలికి పొమ్మన్నాడు. అంత క్రూరంగా కనిపిస్తున్న కుక్కనే—నిజానికి డాషండ్ ఎంతో ముద్దుగా ఉంటుందిగాని కుక్కల సంగతి తెలియని తనకి అప్పుడలా అనిపించింది!— మచ్చికచేసి ఉంచాడంటే అతడు మరీ క్రూరుడేమో అనిపించింది తనకి!

కాని నిజానికి మామయ్య ఎంత మంచివాడు! రెండు రోజుల్లోనే అతనిమీద ఎందుకో ఎంతో జాలిగా అనిపించడం మొదలు పెట్టింది.

ఎందుకో మామయ్య ఎప్పుడూ ఒంటరివాడిలానే కనిపించేవాడు. నిజానికి అత్తయ్య చాలా మంచిదే! కాని ఆవిడకి మామయ్య వ్యవహారాలు చూడడానికి తగిన తీరికగాని ఓపికగాని ఉండేదిలేదు. అంత పెద్ద ఆఫీసర్ అయినా ఈ సంగతులు తేలి చూసుకునేవాడు. ఆయన అసలే మతిమరుపు మనిషి కావడాన్ని ఆ చూసుకోవడమన్నది ఎప్పుడూ సవ్యంగా జరిగినట్లు లేదు. అందుకనే మొహం కడుక్కునేముందు టూత్‌పేస్ట్ కనిపించక పలుదుంపుల్లకోసం వెతుక్కోవడమూ, గడ్డం చేసుకునేటప్పుడు బ్లేడ్లు మొండివైపోవడాన నెత్తురు కారడమూ, రాత్రి సిగరెట్లు పూర్తిగా అయిపోయి 'పోనీ ఈ పూటకి మరికాల్పనులే!' అని పైకి అన్నా లోపల ఆటమటించిపోతూ అటూఇటూ తిరిగి పారేసిన పీకలు తీసి మళ్లీ పీల్చుకోవడమూ, ఇలాటివన్నీ జరుగుతూఉండేవి ఆ ఇంట్లో.

నిద్ర పట్టక మొదటిరోజున తెల్లవారుఝామునే లేచిపోయింది తాను మామయ్య లేవడమూ, రాత్రి ఎక్కడో వదిలేసిన స్లిప్పర్లకోసం వెతుక్కోవడమూ, పెరట్లోకి తానే నీళ్లచెంబు వెతుక్కుని బ్రషూ పేస్టూ మొదలైనవన్నీ తెచ్చుకుని కాలకృత్యాలు నెరవేర్చుకోవడమూ స్నానం చేసినప్పుడు తువ్వాలు పట్టుకెళ్లడం మరిచిపోయి తడిఒంటితో పైకి వచ్చి తువ్వాలు వెతుక్కుని తుడుచుకోవడమూ, గుండీలు ఒకటి రెండు చాకలి పోగొట్టినా ఆ బట్టలు అలాగే ఏదో తంటాలుపడి వేసుకోవడమూ ఇలాటివన్నీ గమనించింది తాను ఆ యింట్లో అన్నీ ఉంటాయి కాని దేనికీ పద్ధతి లేకపోవడాన్ని ఏ వస్తువు కావలసినా సమయానికి దొరకదు ఐంట్రెత్తులూ పనిమనుషులూ ఉంటారుగాని అత్తయ్య అనవసరమైన పనులు కల్పిస్తూ తాను సతమవుతూ వాళ్లని సతమతం చేస్తూ ఎవళ్లని ఏ పనులూ సరిగ్గా చెయ్యనివ్వదు ఫలితం మామయ్యలాటివాళ్లు మౌనంగా బాధపడడమే, చిరునవ్వు నవ్వుకుంటూ.

ఆ మరునాటినుంచీ సుశీల మామయ్యకు కావలిసినవన్నీ తానే చూడటం మొదలు పెట్టింది మంచం దిగగానే ఎదురుగావున్న స్లిప్పర్లదగ్గరనుంచి తనకు కావలసిన అన్ని వస్తువులూ నీటుగా ఎప్పటికప్పుడు లభించడంతో కనిపించకుండా సుశీల చేసిన పనులన్నీ కొత్తగావచ్చిన అక్కగారే చేస్తున్నదనుకుని ఆవిడని అడిగాడుకాని ఆవిడ తనకు తెలియదనీ బహుశా సుశీల చేసిఉంటుందనీ చెప్పగానే ఎంతో పొంగిపోయి తనని వెతుక్కునివచ్చి 'బేబీ, వాకోసం తెల్లవారు

**బిట్ క్విజ్ నెం. 24**

**17 శ్లోకాలకు తెలుగు అనువాదం**

**1.** కేవలం వినోదార్థం/పాప పరిహారార్థం అగ్నిపరీక్షలకు గురియగు రక్తము స్రవించే పాదముతో తీవ్రమైన అత్యుగ్ర పథములను త్రొక్కే మానవుడు ఎక్కడున్నాడు!

**2.** బాహ్య ప్రపంచమందలి అనేక విషయములందు ఆసక్తి ఉండే/ఉండగోరే జనులకు ఎప్పటికీ అంతరంగిక చింతన కలుగజాలదు.

**3.** మానవుడు దేవునివలె ప్రవర్తించే దుస్సాహసము/సామర్థ్యతను గలిగియున్నాడు.

**4.** మానవ ఆత్మ ఆసక్తిగల ప్రేమను ఆశించుచూ ఉక్కుకుతూహలం/ద్వేషంవల్ల వెనుదీయబడును.

**5.** మానవులు కేవలం స్వకీయ ప్రయోజనమునకే పాటుపడుచున్నారంటే మానవస్వభావమందును మరియు మానవుని నియతి/మానవతయందు విశ్వాసము వారికి లేదని తేటతెల్లమగుచున్నది.

**6.** మీరుదీర్ఘాయువునుమరియు స్వతంత్రమును/జ్ఞానమునుకోరేయెడల,మీకుదేవుడు తప్ప ప్రపంచంలో మరేదియున్నూ వీటిని సమకూర్చజాలదు.

**7.** జీవితమును స్తవనీయంగా/న్యాయబద్ధంగా ఉండగలిగేది ఔదార్యము, మహత్తు.

**8.** విజమైన ఆధ్యాత్మిక జీవితమును గడిపే మానవుని కృత్యములు నీతి సామర్థ్యాలను బట్టి మరియు ఐకమత్యము/నమ్రతను బట్టి గుణములు గణింపనగును.

**9.** అన్ని ప్రాణులు తానే యనియు జీవరాసు లన్నియు తనలోనే వున్నట్లు భావించే వ్యక్తి ఎట్లు ద్వేషించగలడు/హానిపరచగలడు లేక మరియొకరిని వంచిచగలడు?

**10.** స్వాతంత్ర్య భావము, మీ మాతృదేశ భక్తి భావము, మానవత్వం/సమాజము నిమిత్తం త్యాగభావము — ఇవి ఆదర్శములు.

**11.** ఆలోచనకు, సాంఘిక మరియు నైతిక/శాస్త్రీయ అభ్యుదయానికి సాధనమైన భాష ఆవశ్యకమైనది.

**12.** మనమందరము ఆకలిగొని, దప్పిగొనియున్న మరియు ఆపేక్షించే/అలసటగల జీవులము.

**13.** ఏవిషయమునుగురించియైనా సత్యమును కనుగొనేనిమిత్తం గొప్ప కవులను/యోగులను దర్శించవలెను. వారు సామాన్యమానవులకంటె ఎక్కువ దూరదృష్టి, సుజ్ఞానం గలిగియుందురు

**14.** మానవుడు వివేకం/సామాజికత గలవాడు గనుక దేశవ్యవహారములందు తెలివిగా తోడ్పడేవిధముగ అతనికి విద్యాభ్యాసమును సమకూర్చవలెను.

**15.** ముక్తి మన హక్కు అని వాదించుటకు అర్హత గలిగించే మహనీయమైన/సర్వోత్కృష్టమైన విలువ మనలో ఏమాత్రమూ లేదు.

**16.** ఎక్కువగాఅపేక్షించకుండ/అయాచితంగాఉన్న కొలది కటాక్షము మరింతగౌరవనీయముగును.

**17.** ప్రతి మతమందును విలువలు/సుగుణములు నీతులు సమానమే.

(ఇంగ్లీషు పాఠము కొరకు ఎదురు పేజీ చూడండి)

# రేపు లేదు...

కూడా లేచిపోయావా?' అని చిరునవ్వుతో అభిమానంగా అన్నాడు.

అత్తయ్య కూడా ఇదంతా గమనించి ఎంతో మెచ్చుకుని అంది ఒకనాడు కొత్తలో 'ఈ పిల్లలతో ఈ సంసారంతో ఆయన సంగతి ఏదీ చూడడానికికాదు నాకు. నువ్వొచ్చి చేసిపెడుతున్నావు అంతేచాలు.'

'ఏమిటో ఒక కలలోలా గడిచిపోయాయి ఆ రోజులు. మూడు నాలుగేళ్లపాటు తనకి చేతినిండా బోలెడంతపని ఉండేది, చదువుతోపాటు. శెలవు వచ్చిందంటే మామయ్య అందర్నీ ఎక్కడికో ఒకచోటికి ఏదో చూడడానికి తీసుకువెళ్లేవాడు. అప్పుడప్పుడు కాంపులకి కూడా వెళ్లేవాళ్లు ఒక్క అమ్మనిమటుకు ఇంట్లో వదిలేసి. అప్పుడప్పుడు పూజలూ పునస్కారాలూ అవీ, పురిటిరోజులనో అత్తయ్య రావడానికి వీలు కాకపోతే తక్కిన వాళ్లతోపాటు తానూ వెళ్లేది. అందరితోనూ అంటనట్లుగా ముట్టనట్లుగా తామరాకుమీది నీటిచుక్కలా ఉన్నా తనతో ఉన్నప్పుడలా, మాట్లాడినప్పుడూ మటుకు మామయ్య ఎంతో దగ్గరవాడిలా అయిపోయేవాడు.

అమ్మ తనని వోణీలు వేసుకోమనీ, గెంతుతూ ఆడుతూ తిరగొద్దనీ అనే వయసు వచ్చేవరకూ అలాగే జరిగిపోయింది కాలం. మొదట్లో మొదట్లో తనకి తెలిసేదికాదుగాని క్రమక్రమంగా అత్తయ్య ముభావంగా ఉండడమూ, అప్పుడప్పుడు మామయ్య కేదో సాధించడమూ, సూటిగా కాకపోయినా చాటుమాటుగా ఏదో సాకు పెట్టి వ్యంగ్యంగా మాట్లాడుతూండడమూ చివరకు ఒకనాడు తాను మామయ్యతో పిల్లలతో ఎక్కడికో కారులో వెళ్లబోతుంటే అమ్మ తనని చాటుగా పిలిచి 'నువ్వెళ్లకివాళ. అత్తయ్య వెళ్లకుండా నువ్వు వెళ్లడం బావుండదు.' అనడమూ సంభవించి తనలో హుషారూ ఆనందమూ క్రమక్రమంగా మాయం కావడం మొదలు పెట్టింది. మామయ్యకూ తనకూ పది హేడు పద్దెనిమిదేళ్లు తేడా! ఎవళ్లు ఎందుకు ఏమనుకుంటారో తనకి బోధపడ లేదు. కాని ఒకనాడు, తన పదహారోఏట, మామయ్య రుమాలు కనిపించక వెతుక్కుంటూ ఉంటే పెట్టెలోంచి తన రుమాలు తీసి పట్టుకెళ్ళి ఇవ్వబోతుండగా అత్తయ్య [illegible] అని తాను [illegible] వినింది: 'ఏ రుమాలేం ఇవ్వక్కర్లేదు — అన్నీ సంగనాచి వేషాలు సంసారాల్ని పాడు చెయ్యడానికి సిద్ధపడుతూ!' అనగానే దిగాలుపడి నిలబడిపోయింది తాను. అవతల గదిలోఉన్న మామయ్యకు ఆమాటలు విన బడే ఉంటాయి. కాని ఆయన పైకి రాలేదు. అప్పుడు తెలిసింది తనకు అత్త మనసులో ఉద్దేశం. అంతే. ఆవేళనుంచి మామయ్య ఎదుటపడలేదు తాను, ఆయన గురించి ఏ శ్రద్ధా తీసుకోవడం మానేసింది, ఎంతో బాధగా అనిపించినా. అమ్మకూడా పరిస్థితి గ్రహించడాన ఆ సంవత్సరం చదువు కాగానే తనని తీసుకెళ్లి చిన్నాయనగారింట్లో పెట్టి తానొక్కతే మామయ్యదగ్గర ఉంది రెండుమూడేళ్లపాటు. చిన్నాన్నగారింట్లో ఉన్నప్పుడే పెళ్లి స్థిరపడింది తనకి. పెళ్లికి అత్తయ్య పురిటిరోజులు కావడాన్ని మామయ్య ఒక్కడే వచ్చాడు.

బాగా నీరసంగా ఉండేవాడు మామయ్య అప్పుడు. ఎవళ్లూలేని సమయం చూసి తాను దగ్గరికివెళ్లి అడిగింది: 'అలా ఉన్నారేం మామయ్యా — ఒంట్లో బావుండటం లేదా?' ఆయన రెప్పవేయకుండా తనవైపు చూసి అన్నాడు: 'బాగానే ఉందమ్మా. మామూలుగానే ఉన్నానే నేను!' తానంది: 'లేదు మామయ్యా, బాగా నీరసించిపోయారు ఎందువల్లనో!'

జాలిగా నవ్వి తనవైపునుండి చూపులు మరల్చుకుని ఎడమచేతి వడ్రేలి గోరుమీద బొటనవేలితో రాసుకుంటూ దానివైపే స్థిరంగా చూస్తూ ఆయన ఆవేళ అన్న మాటలు ఎన్నడూ మరచిపోలేదు మాలతి. రోజూ నిద్రపట్టబోయేముందు ఆమాటలే తిరుగుడుపడతాయి ఆమె మనసులో:

'బ్రతుకులో ఏ రసమూ లేనప్పుడు అంతా నీరసమేనమ్మా. మాటికి తొంభై తొమ్మిదిమందికి అంతా నిన్నమొన్న అటు మొన్న, ఇలాగే తప్ప రేపు అన్నది మరిలేదు. వచ్చేవన్నీ మరుచటిరోజూ, ఆ మరుచటిరోజూ, ఆ మరుచటిరోజూ ... ఇంతేనమ్మా! నువ్వు మటుకు ఆ మాటోటా [illegible] ఎప్పుడూ పోయినా ఆనందంగా [illegible] రేపు గురించి [illegible] ఏ జీవితం గడిచిపోవాలని నా మనఃపూర్వకమైన కోరికా, దీవెనా తల్లీ!'

# LITQUIZ No. 24

**Rs. 27,500**

**FIRST PRIZE Rs. 13,500**

**RUNNERS-UP** UP TO 4 ERRORS Rs 8,000

**MINIQUIZ** UP TO 2 ERRORS Rs. 5,000

FAMINE RELIEF FUND: Rs. 1000

ఆఖరు ముగింపు తేది: 9—11—67.
సొల్యూషన్ భారత్ జ్యోతిలో: 12-11-67.
ఫలితాలు భారత్ జ్యోతిలో: 26-11-67.
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 6 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను *లిట్‌క్విజ్ వీక్లీ 10 సంచికలకు రు 2 పంపవలెను.* మీ ఎంట్రీలను 8-11-67 బుధవారమునాడు కూడా పంపవచ్చును. కాని వాటిని ఎక్స్‌ప్రెస్ డెలివరీలో పంపవలెను.

## లిట్‌క్విజ్ నెం. 24 అధికార ఎంట్రీ ఫారము

ADDRESS
**LITQUIZ No 24, ALANKAR, BALARAM ST, BOMBAY-7(WB)**

షరా:- (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయుండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో రెండవకూపన్ కొట్టివేయుండి (3) ఎంట్రీరుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M.O. రసీదును ఎంట్రీఫారమునకు జతపరచవలెను. M O రసీదు లేని ఎంట్రీ నిరాకరింపబడును. (4) I P O. క్రాస్ చేయవద్దు అది లిట్‌క్విజ్ నెం 24 బొంబాయి—7 వారికి చెల్లించునటు ఉండవలెను.

| 1 | Re. 1 | | 2 | Re. 1 | |
|---|---|---|---|---|---|
| 1 | AMUSEMENT | ATONEMENT | 1 | AMUSEMENT | ATONEMENT |
| 2 | ARE | DESIRE | 2 | ARE | DESIRE |
| 3 | AUDACITY | POTENTIALITY | 3 | AUDACITY | POTENTIALITY |
| 4 | CURIOSITY | HOSTILITY | 4 | CURIOSITY | HOSTILITY |
| 5 | DESTINY | HUMANITY | 5 | DESTINY | HUMANITY |
| 6 | FREEDOM | WISDOM | 6 | FREEDOM | WISDOM |
| 7 | GLORIFIES | JUSTIFIES | 7 | GLORIFIES | JUSTIFIES |
| 8 | HARMONY | HUMILITY | 8 | HARMONY | HUMILITY |
| 9 | HATE | HURT | 9 | HATE | HURT |
| 10 | HUMANITY | SOCIETY | 10 | HUMANITY | SOCIETY |
| 11 | MORAL | NATIONAL | 11 | MORAL | NATIONAL |
| 12 | NEEDY | WEARY | 12 | NEEDY | WEARY |
| 13 | POETS | SAINTS | 13 | POETS | SAINTS |
| 14 | RATIONAL | SOCIAL | 14 | RATIONAL | SOCIAL |
| 15 | SUBLIME | SUPREME | 15 | SUBLIME | SUPREME |
| 16 | UNEXPECTED | UNSOUGHT | 16 | UNEXPECTED | UNSOUGHT |
| 17 | VALUES | VIRTUES | 17 | VALUES | VIRTUES |

SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE 24

**MINIQUIZ**

10 CLUES FREE COUPON

| | | | |
|---|---|---|---|
| ARE | DESIRE | HATE | HURT |
| CURIOSITY | HOSTILITY | NEEDY | WEARY |
| DESTINY | HUMANITY | POETS | SAINTS |
| FREEDOM | WISDOM | RATIONAL | SOCIAL |
| HARMONY | HUMILITY | SUBLIME | SUPREME |

**24** (ASvP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలు, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/- ఈ పూర్తి ఎంట్రీ ఫారం ఎంట్రీ ఫీజు రు 2/- M O. రసీదు/ I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను.
వాటి నెం. ..............................

CAPITAL LETTERS
NAME. ..............................
ADDRESS. ..............................
..............................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

## 17 CLUES

1. Where is the man who would run the ordeals of fire or would tread the paths of furies with bleeding feet for sheer **Amusement / Atonement**
2. People who **Are / Desire** many things in the outside world can never **be** introspective
3. Man has the **Audacity / Potentiality** to behave like gods.
4. The human soul yearns for warm love and is repelled by cold **Curiosity / Hostility**
5. To assert that men work for personal profit alone is to assert one's want of faith in human nature **and man's Destiny / Humanity**
6. If you want life and **Freedom / Wisdom**, God alone and nothing **else** in the Universe can give you these
7. If anything **Glorifies / Justifies** life, it is nobility, greatness
8. The work of a truly religious man in active life is characterized by honesty, efficiency and **Harmony / Humility**.
9. How can a person who sees himself in all life and all living things in himself **Hate / Hurt** or exploit another?
10. The spirit of freedom, the spirit of reverence to your country, the spirit of sacrifice for the sake of **Humanity / Society** - these are inspiring ideals
11. Language as a tool for thinking **and** for social and **Moral / National** progress is indispensable
12. We are all hungry, **thirsty and Needy / Weary** souls.
13. To know the truth about **anything**, one must turn to the great **Poets / Saints** They see farther **and better** than ordinary mortals.
14. As **man** is a **Rational / Social** being, he should **be** educated **in such a** manner as to contribute intelligently to the affairs of the country.
15. There is nothing in us of such **Sublime / Supreme** value **as to** entitle **us to claim** salvation as **a matter of** right
16. Grace becomes the more graceful the more it is **Unexpected / Unsought.**
17. **Values / Virtues are the same in every religion.**

(తెలుగు అనువాదమును ఎదుటి పేజీలో చూడండి)

గమనిక : పై క్లూలు గ్రంథకర్తలు, రచయితల పుస్తకముల నుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు రచయితల పేర్లు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు లిట్‌క్విజ్ వీక్లీలో ప్రచురించబడును.

# ఆలింగనచుంబనాలవల్ల కొత్త ప్రమాదం

అమెరికాలో, పదిహేను సంవత్సరాల పిల్లలనుంచి ఇరవై అయిదు సంవత్సరాల వయసున్న యువతీయువకుల్ని "మోనో న్యూక్లియోసిస్" అనేవ్యాధి పట్టి పీడిస్తున్నది. అలసట, జ్వరం రావడం, గొంతునొప్పి, మాంద్యం మొదలైనవి ఆరోగ్య లక్షణాలనీ, కనుక ఆ వయస్సు వాళ్ళు ఒకళ్ళనొకరు కౌగలించుకోడం, ముద్దు పెట్టుకోడం వంటివి తగ్గిస్తే ఆ వ్యాధి భయంకరంగా వ్యాపించదనీ (ఫ్లోరిడా ఆరోగ్యశాఖ) మియామిలో "ఆశాఖ" వెల్లడి చేసింది. ఈ రోగానికి ప్రత్యేకించి ఏమందూ మాకూ కూడా లేదనీ, ఎవరి జాగ్రత్త వారే పడాలనీ కూడా ఆశాఖ అభిప్రాయపడింది. పరాయి దేశాలు క్రమేపీ ముద్దుకు స్వస్తి చెప్తున్నారు. అది ఆరోగ్యకరంకాదని— మరిమనం??

## లాఠీచార్జీలు

కేరళలో ఏదొచ్చినా ఒక విపరీతమే! సెయింట్ ఆల్బర్ట్స్ కాలేజి విద్యార్థులు పోలీసుల లారీల మీద, వాన్లమీదా, రాళ్ళు వేశారని, పోలీసు శాఖ వారు మొన్న 17వ తేదీన ఆ కాలేజీ మీద హఠాత్తుగా విరుచుకుపడి, కనుపించిన వారిని కనుపించినట్టే లాఠీలతో వుతికేశారు. క్లాసు రూముల్లో పాఠాలు వింటున్నవారినీ, చెప్తున్నవారినీ కూడా బాదారట. ఆ కాలేజి గోడలు, నేల అంతా భయంకరంగాను రక్తం మరకలతోటి, మడుగులతోడి నిండి పోయిందట. లాఠీ దెబ్బలు తిని, స్పృహ కోల్పోయి మృతప్రాయులుగా పడిపోయినవారి దేహాలతో కాలేజీ అంతా భయంకరంగా, అభినవ కురుక్షేత్రంగా తయారయ్యిందట. ఎవరికివారికి ఆత్మరక్షణే కష్టం అయిపోయిందనీ, తను, మరికొంతమంది లెక్చరర్లూ తలుపులు మూసుకుని, కిటికీలూ వేసుకుని ప్రాణాలు చేతుల్లో పట్టుకు కూర్చున్నామనీ ఆ కాలేజి ప్రిన్సిపాలు చెప్పి, "పోలీసులు వస్తుండగా, మేము వారించి, సమాధానపరచ ప్రయత్నించాం. వాళ్ళు వినలేదు. చాలా క్రూరంగా రాక్షసంగా ప్రవర్తించారు" అన్నారు.

ఇంకా పాలాయ్, పట్టణం తిట్ట, ఇరింజలకూడ ప్రాంతాల్లోకూడ లాఠీ చార్జీలు ముమ్మరంగా జరిగాయి, జరుగుతున్నాయి. ఈ గొడవల్లో కాలేజీలకు హాజరుకాని విద్యార్థుల సంఖ్య రెండు లక్షలట!!




## సెక్రటేరియట్ వద్ద బాంబులు

18వ తేదీన షిల్లాంగ్ సెక్రటేరియట్ భవనం ప్రాంతంలో రాత్రి పదకొండు గంటలకు 'ధనేల్ భనేల్' అనే శబ్దం దిక్కులు పిక్కటిల్లేలా కొన్నిమైళ్ళ దూరం వరకూ వినబడింది. ఆ భవనం అద్దాల తలుపులూ వగైరాలు తుత్తునియలై పోయాయట. ఆ భవనం ప్రాంతంలో చాలా శక్తికల మూడు బాంబులు ఎవరో పెట్టారనీ, అదృష్టం వల్ల అయిదంతస్తుల భవనం కూలలేదనీ దర్యాప్తు తేల్చింది.

## హల్వా విలువ పెరిగితే?

యునైటెడ్ స్టేట్స్ (అమెరికా) స్కూలుపిల్లలు మన హల్వామీద మోజుపడుతున్నారట. మొదట్లో "ఛీ. జిగురుజిగురుగా వుందేమిటి" అని ఏవగించుకున్న కుర్రాళ్ళు యిప్పుడు మనహల్వాకోసం ఎగబడుతున్నారట— భళి....యికహల్వా వివాహాలు, హల్వా నోడలూ యిండియానుంచి బయల్దేరడమే ఆలస్యం!

## మేకనుంచి మనిషి

హైదరాబాదులో మొన్న 17వ తేదీన ఒక మేకకు మానవశిశువును పోలిన ఒక విచిత్రమైన శిశువు కలిగింది. మనిషి ఆకారంలో వుందనీ, అయితే చేతులవేళ్ళకూ, కాలివేళ్ళకూ గోళ్ళకు బదులు గిట్టలున్నాయనీ, శరీరంమీద శాస్త్రానికైనా ఒక్క వెంట్రుకకూడా లేదనీ పరీక్షించి తేల్చారు. అయితే ఆ శిశువు వెంటనే మరణించింది. అదివేరే విషయం.

## శిశు హత్య

జయపూర్‌లో 13వ తేదీన ఒక భయంకర విషాదం జరిగింది. "నీ కొడుకును దక్కించుకోవాలంటే అయిదు వేలు నాకు యివ్వాలి" అని మోహన్‌లాల్ అనే ఒక వ్యక్తికి ఒక వుత్తరం వచ్చిందట. తన కొడుకు కనబట్టం లేదని చెప్తూ అతను ఆ వుత్తరం పోలీసులకు యిచ్చాడు. తత్ఫలితంగా అతని అయిదేళ్ళ కొడుకును ఆ ఆగంతకులు చంపి ఒక కర్రపెట్టెలో పెట్టి ఒక నిర్జన ప్రదేశంలో వదిలేసిపోయారట. పోలీసులు అనుమానం మీద కొంతమందిని అరెస్టు చేశారు. అయిదేళ్ల కొడుకు క్రూరంగా తన కళ్ళఎదురుగా చచ్చిపడున్నప్పుడు ఆ తండ్రి వేదన, ఆవేదన ఎవరు అంచనా కట్టగలరు? ఇది జయపూరుకే గాక దేశానికి భయంకరమైన వార్త కదా!

—రాజారావు

# బసవాచార్యుడు

'నేను శివభక్తుడిని. అదే నా కులం. బ్రాహ్మణ కులంలో పుట్టినప్పటికీ బ్రాహ్మణత్వాన్ని వదులుకుంటున్నాను. వర్ణ విభేదాలని రూపుమాపటానికే నేను జన్మించాను!' అన్నాడొక ఎనిమిదేళ్ల బాలుడు సుమారు ఎనిమిదివందల సంవత్సరాల క్రితం. ఉపనయన కర్మని నిరాకరిస్తూ. అతని పేరు బసవ. తండ్రిపేరు మాదిరాజు, తల్లిపేరు మాదలాంబిక. అప్పటికాలంలో వారి దేశాన్ని బిజ్జల మహారాజు పరిపాలిస్తూ ఉండేవాడు (క్రీ. శ. 1156 - 1167) కల్యాణ్ రాజధాని. మంత్రి బలదేవుడు తన కుమార్తె గంగాదేవిని బసవడికి ఇచ్చి పెళ్లి చేశాడు. మామగారి మరణానంతరం బసవడే రాజుగారి ప్రధానామాత్యుడయ్యాడు. ఒకసారి బసవడు రాజధనాన్ని జంగాల అన్నదానం కోసం వాడాడు బిజ్జలుడికి కోపం వచ్చి ప్రధానామాత్యుడిని శిక్షించమని ఉత్తరువు జారీ చేశాడు కాని జంగాలంతా కూడి రాజుగారి సైన్యాన్ని ఎదిరించి ఓడగొట్టటంతో ఆయన బసవడితో సంధి చేసుకోవలసి వచ్చింది.

కొందరు అనుకున్నట్లు, బసవాచార్యుడు వీర శైవమత స్థాపకుడు కాదు. ఈ మతం అంతకి ముందునుంచీ ఉండేది. బసవాచార్యుడు దానిని పునరుద్ధరించాడు. ఈ మత సిద్ధాంతం ప్రకారం శివుడు ఒక్కడే నిజమయిన దేవుడు; బ్రాహ్మణులకి ప్రమాణాలయిన వేదాలమీది వ్యాఖ్యానాలు సరయినవికావు; కుల విభేదాలు పనికిరావు; అందరు మానవులూ సమానమయినవారే; బాల్య వివాహాలు ధర్మవిరుద్ధమయినవి; విధవా వివాహాలు చెయ్యవచ్చు; విధవలకి శిరోముండనం అనవసరం; మాంసాహారం, మద్యపానం నిషిద్ధాలు. బసవాచార్యుడి నాయకత్వం కింద పై సంఘ సంస్కరణలు చాలా జరిగాయి. బసవాచార్యుల వారి శైవమత ప్రచారం 'షట్‌స్థల వచన, కాలజ్ఞాన వచన, మంత్ర—గోప్యమట చక్ర వచన, రాజయోగవచన' గ్రంధాలలో ఇమిడి ఉంటుంది. ఆయన జీవితాంత కాలంలో జైనులకీ వీర శైవులకీ పెద్ద పోట్లాట ఒకటి జరిగింది. ఈ సందర్భంలో చాలా బీభత్సం జరగటంతో బసవార్యుడి మనస్సు వికలమయి ఆయన కృష్ణ, మాలప్రభ నదుల సంగమంవద్ద ఉండే కూడల్ అనే చోటికి వెళ్లిపోయాడు. అక్కడే ఆయన లింగైక్యం పొందాడని భక్తుల విశ్వాసం.

—ఎస్.

## డాక్టర్ కబుర్లు

### నెత్తురుపోటుని అదుపులో పెట్టటమా?

ఒక వ్యక్తి రక్తపుపోటుని గమక డాక్టరు ఒక స్థాయిలో ఉంచగలిగితే ఆ వ్యక్తి రక్తపుపోటు తనంతటతానే అదే స్థాయిలో ఉండ గలుగుతుంది. దీనికి మళ్ళీ వేరే చికిత్స అనవసరం.

అంటే దేహంలో ఒకరకం 'స్విచ్' వంటి పద్ధతి ఉందన్నమాట!

అయితే, ఏ స్థాయి 'సురక్షిత' మయినది? సాధారణంగా రక్తపుపోటుని రెండు జట్ల అంకెలతో చూపిస్తూ ఉంటారు. ఉదాహరణకి 140/80. 140 గుండె పూర్తిగా కుంచించుకు పోయినప్పుడు నిర్పడే వత్తిడిని తెలుపుతుంది, 80 అంకె గుండె రెండు సార్లు కొట్టుకొనటానికి మధ్య ఉండే వత్తిడిని తెలుపుతుంది.

రక్తపుపోటు 200—120 ఉంటే ఎక్కువగా ఉందనుకోవాలి. ఇంత అధికంగా ఉండటానికి కారణం ఏమిటో కనుక్కొని తగ్గిస్తాడు డాక్టరు. మనిషి వెల్లకిల్లా పడుకున్నప్పుడు



రక్తపుపోటు 160—100 ని మించ రాదు.

హెచ్. ఎల్. హెర్షన్‌సౌన్ (కాపీరయిటు)

వంటలు:

## లైమ్ జూస్

25 నిమ్మకాయలు.

1 కిలో పంచదార.

1 స్పూను నిమ్మ ఉప్పు.

2 స్పూనులు లైమ్ ఎసెన్సు.

నిమ్మకాయలు అన్నీ రసం తీసి ఉంచుకోవాలి. ఎంతరసం ఉందో అన్ని నీళ్లుపోసి పంచదార పాకం పట్టాలి. పంచదార బాగా కరిగిపోతున్నప్పుడు రెండు చెంచాల నిమ్మరసం, ఒక చెంచా నిమ్మ ఉప్పువేసి కరగనివ్వాలి. పంచదార పాకం రావక్కరలేదు! బాగా కరిగిపోతేచాలు. ఈ పాకం దింపి చల్లారనిచ్చి, దానిలో నిమ్మరసంపోసి కలియ పెట్టాలి. ఇది నిలవఉంటుంది. ఒక గ్లాసుడు లైమ్‌జూస్ చేయడానికి రెండు మూడు స్పూనుల జూస్ చాలు. ఈ పద్ధతి లైమ్‌జూస్ చేయడం కమ్యూనిటీ సెంటరులో నేర్పిస్తున్నారు. అంతాకలిపి అరగంట పని కూడా ఉండదు.

—కె. రామలక్ష్మి


అతి త్వరలో!
సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన
ఆడపడుచు
స్క్రీన్ ప్లే.... యల్.వి.ప్రసాద్
సంభాషణలు:కె.ప్రత్యగాత్మ
సంగీతం ... టి.చలపతిరావు
నిర్వహణ... ఎ.పూర్ణచంద్రరావు
నిర్మాత-దర్శకుడు
కె.హేమాంబరధరరావు

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

**ఎస్ ఎన్, బళ్లారి**

పెళ్లి అయ్యాకగాని తెలియలేదు—పెళ్లి అంటే ముళ్లబాట అని. చేసిన నేరానికి ప్రాయశ్చిత్తం ఏమైనా ఉందంటారా?

నీకే కాదు తమ్ముడూ, ఈ కాలంలో కుర్రకారు కంతకీ తెలిసివచ్చేసత్యమే ఇది. పెళ్లి అవగానే బాధ్యత తీరిందనుకుంటారు కాని నిజానికి అప్పటినుండే కొత్త బాధ్యత ప్రారంభమవుతుంది. తనలో జీవితం పంచుకోవాలి అని వచ్చిన మనిషిని మనిషిగా చూసి, జీవితంలోని సుఖదుఃఖాలు పంచుకుంటూ నువు బాధ్యతలు వహించి ఆనందంగా జీవితం వెళ్లబుచ్చరావడమే— పెళ్లి చేసుకున్నందుకు తగిన ప్రాయశ్చిత్తం. పలాయనం చిత్తగించడం కానేకాదు.

**ఎం. ఎల్. వి. ఆర్, నిజామాబాద్**

మానవత్వానికి దైవత్వానికి తేడాఏమిటి?

మానవ చేష్టలకి లీలగా నవ్వుకుంటూ అభయహస్తం ఇచ్చేవాడు దేవతల్లో మానవుడు— నిజమైన దేవుడు. తోటిమానవుణ్ణి మానవునిగా చూసేవాడు మానవుల్లో దేవుడు— దైవత్వం కల మనిషి ఈ రెండింటినీ తనలో ఇముడ్చుకున్నవాడు — మామూలు మనిషి.

**వి. వి. ఎస్, కరీంనగర్**

పురుషుల పేరులైనా పూర్తిగా వేయించకూడదా?

పురుషులందు పుణ్యపురుషులు వేరయా అన్నారు! వీరిని మటుకు ఎలా నమ్మమంటారు స్వామిగారూ?

**వి. మ. ల, బరంపురం**

మీకో బహుమతి ఇవ్వదలిచాం. మేం విద్యార్థులం కనక మేం ఇవ్వకలది కోరుకోండి

మీరు ఇవ్వకల్గేదీ నే పుచ్చుకోకల్గేదీ—ఒక్కటే—అభిమానం. అది ఇప్పటికే ఇచ్చిపుచ్చుకున్నాంగా చిట్టి చెల్లాయిలూ!!

**కే. వి పి, హైదరాబాదు**

అహింసా పరమోధర్మః అన్న బుద్ధావతారం దేవుడే రామావతారంలో మాంసం తిన్నాడని అంటారు. ఒకసారి హింసని ఇంకోసారి అహింసని ప్రబోధిస్తాడా భగవంతుడు?

దుష్టశిక్షణ, శిష్టరక్షణ ధ్యేయంగా కల అవతారమూర్తులు ఆయా అవతారాల కాలాలకి సరిపడే ధర్మాలు బోధించారు. అహింస పరమ ధర్మమైతే, ప్రాణం రక్షించుకోవడం మానవ ధర్మం. అందుకే అహింసాపరమోధర్మః అంటూనే 'నిన్ను చంప వచ్చిన గోవునైనా నీ ప్రాణం రక్షించుకోవడం కోసం చంపు' అన్నారు.

**వి. పి, కవుతరం**

మా బాబులు హైస్కూల్లో మంచి మార్కులతో పాసు అవుతున్నారు. ఇప్పుడు ఫీజుకట్టి కాన్వెంటులో చదివించండి అంటున్నారు స్నేహితులు, ఏం చేయను?

హైస్కూలు చదువు ఎక్కడైనా ఒక్కటే. డబ్బు ఖర్చు ఎక్కువ అయితే చదువు ఎక్కువ వస్తుందని ఏముంది? హాయిగా ఎస్ ఎస్ ఎల్ సి దాకా దాటి పోనివ్వండి.

**ఎస్. వి, ప్రయాగ**

ఒకే ప్రశ్నకు ఒకే జవాబు రెండుసార్లు ఇవ్వడంలోని అంతరార్థం అగమ్యగోచరంగా ఉంది.

అగమ్యగోచరం ఏముంది? అచ్చుపొరపాటు.

**వి. ఆర్. ఆర్, ఖరగ్‌పూర్**

నిజమైన జీవితానికి నిర్వచనం ఏమిటి?

అబద్ధపు తెక్కలేగాని అబద్ధపు జీవితాలుండవు తమ్ముడూ, జీవితానికి నిర్వచనం జీవితమే.

**వై. వి ఎస్, మద్రాసు**

ఎన్నెన్నో కథలు వ్రాయాలని ఉంటూ హాలం కలం పేపరుమీద పెడితే కదలనంటుంది.

ఏ విషయం మీదగాని స్వేచ్ఛగా ఎంతవీలైతే అంత వ్రాయకల్గడం ముందు అలవాటు చేసుకోవాలి విషయం ప్రధానం కాదు. వ్రాయడం. తరువాత కథలు వ్రాయడం ప్రారంభం చేస్తేసరి వ్రాసిన ప్రతిరచనా ఉత్తమోత్తమం అవి అంచేత అచ్చువడాలని అనుకోకూడదు.

**వి. కె, మహబూబునగరు**

అయినవారు కదా వారిదగ్గర డబ్బు ఎక్కడికి పోతుందని ఊరుకున్నాము. ఇప్పుడు అడిగితే ముఖం చాటు వేస్తున్నారు...

ఇలాంటివారి సినిమా ప్రపంచంలోనే ఎక్కువ అనుకున్నాను— నమ్మిమోసపోయిన వారి మనస్సు మానవత్వంపై నమ్మకం పోగొట్టుకుంటుంది నమ్మించి మోసం చేసేవారి మనస్సెలా ఉంటుందో?

# రచయితలకి మనవి

దీపావళి కథల పోటీకి మాకువచ్చిన కథలలో బహుమతి పొందినవికాక ఈ క్రింది కథలు నామమాలు ప్రచురణకి స్వీకరించాము. ఈ కథల రచయిత (త్రు)లకి వేరే కార్డులు — తమ కథలు ప్రచురణకి స్వీకరించినట్లు—పంపటంలేదు. మిగిలిన కథలు ప్రచురణకి స్వీకరింపబడనివి. ఈ సందర్భంలో దీపావళి కథల పోటీ నిబంధనలని మరొకసారి రచయితలకి గుర్తు చేస్తున్నాము.

సంపాదకుడు,
ఆంధ్ర సచిత్ర వారపత్రిక.

అధికారి — ఆదిరాజు సీతారాఘవశ కుమారి

అన్న—కొలకలూరి.

ఆకలి—పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి.

ఆకాశగంగ—శ. సభా.

ఆత్మసాక్షి—అరుణ.

ఆశలకుంపటి — ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ

21 వ తారీఖు—విష్వల కామేశ్వరరావు.

ఇలా జరుగుతుందనుకోలేదు—దాస్ బాబు.

ఏరుదాటారు—కె. రమ.

కడుపుతీపి—రంగధామ్.

కలలో హరివిల్లు — శ్రీమతి టి. విజయలక్ష్మి విద్యాసాగర్.

కల్యాణశోభ—భమిడిపాటి వెంకట రమణ.

కాలం కదిలింది—శ్రీమతి శరణాల జయలక్ష్మి.

కాలం మించిపోయింది—పెరల్.

కెరటాలు—వై. అమృతవల్లి.

కుంకుమ—శ్రీపతి.

గంగి—ఎ. ఝాన్సి.

గుండెలమీద కుంపటి—అప్పాజీ!

గ్రహణం—వరెటినారా.

చదువుకథ — కప్పగంతుల మల్లికార్జునరావు.

చెట్టునీడ—శోభాపతి.

చెప్పులు — కావృబారు వేంకట నారాయణరావు

జయమూ—అపజయమూ—మునిపల్లె రాజు.

తీరనిబాకీ—వి. వి. యస్. రామదాసు.

తొలివిచ్చిన తెలిమబ్బులు—కుమారి కృష్ణ వాణి.

దృష్టిదోషం — జొన్నలగడ్డ రాజగోపాలరావు.

న్యాయమేది? అన్యాయమేది??—రాజేంద్ర.

నాలుగవ మజిలీ — సింగరాజు రామచంద్రమూర్తి.

నిరీక్షణ—కుమారి బి. ఉషారాణి.

నీడ—ఆడవి శివసుబ్రహ్మణ్యం.

నీడతెగిన మనిషి!—సింగరాజు లింగమూర్తి.

నీడవెనుక నిజం — వి. సత్యనారాయణ.

పన్నీటి ఊట—బొడ్డు బాపిరాజు.

పార్వతి—రొయ్యూరు శేషారత్నం.

పెన్షన్ వచ్చింది—హరికిషన్.

పైరుగాలి—యం. నరసింహారావు.

ప్రాకని తీగె—వాసివేడు సాంబశివరావు.

ప్లాటినమ్ — అబ్బూరి విశ్వేశ్వరరావు.

బాలామణి—కలువకొలను సదానంద.

మంచు కరిగినవేళ మమత నవ్వింది—శ్రీమతి వేదుల శకుంతల.

మనస్సు—పి. ఎస్. నారాయణ.

మనిషి—విహారి, శాలివాహన.

మనిషి బొమ్మ—ఇచ్ఛాపురపు రామచంద్రం.

మరణం ధ్రువమ్—మల్లాది సూరిబాబు.

మిథ్యాబింబాలు—కుమారి శ. వి. కృష్ణకుమారి.

మొగిలిపువ్వు—కొంపల్లి గౌరీశంకర్.

యాత్రికులు—తారక.

రక్తం కురిసినరాత్రి—గుండుమళ్ళ.

రచయిత—శ్రీ శర్మ.

రాళ్ళు—బి. పి. కరుణాకర్.

రైలు ప్రయాణం—పెమ్మరాజు భరతభూషన్ రావు.

లోకం పోకడ—గుళ్ళపల్లి సుందరమ్మ.

వర్షంలో మనిషి—శ్రీమతి వి. ఎస్. భారతీ మూర్తి.

వేసవిమబ్బు—యామిని.

వృత్తం—ధనంజయ.

శరణ్యం—చాగంటి తులసి.

శర్మ వంతు—కొడవటిగంటి కృష్ణమూర్తి.

శృతిమించిన అపశృతి—యత్రశెట్టి వరలక్ష్మి.

సశేషం—మా. హనుమంతరావ్,

పిగ్గలు వంగింది—సరస్వతి.

స్వార్థపరుడు—సుభద్ర.

# ప్రశ్నావళి

ఎస్. వి. యు. జి, మదనపల్లె

తన భర్త గెజిటెడ్ ఆఫీసరు కావాలని కలలు కనిన స్నేహితురాలికి భార్యని బానిస కన్నా నీచంగా చూసే ఎల్. డి. సి. భర్త అయితే ఆమె జీవితం ఏమవ్వాలి?

జీవితం అంటే మీరు చెప్పుకునే అర్థం ఏమిటి? —పెద్ద ఉద్యోగం, చిన్న ఉద్యోగం అలాగే అధికారి కోరుకున్నట్టు' గుమాస్తా 'తోచినట్టు' భార్యని ఏలుకుంటారని ఏమిటి గ్యారంటీ? జీవితపు ఉన్నత విలువలు తెలియని మీలాంటి పనివాళ్ళు—మీ జీవితాలనేకాదు, మీ దరిదాపుల ఉన్న వారి జీవితాలని కూడా విచ్ఛిన్నం చేస్తారు. మనిషి విలువ అందులోనూ, భర్త విలువ ఉద్యోగంలోనే చూసే గలస్త్రీ తనకై తాను నరకం సృష్టించుకుంటోంది. అదే మీ స్నేహితురాలికి చెప్పండి. ●







చిచ్చుబుడ్ల హడావుడి! ● (ఫొటో: వి. శ్రీ. వి. నరసింగరావు, తెల్లాపూర్)



ఎవరు గొప్ప?
రావు ఆవకాయల కొట్టు
అల్లా ఒప్పయ్య ఆవకాయల కొట్టు
చిబ్బుబుడ్లు డజను రూ|| 6/-
!
చిబ్బుబుడ్లు డజను రూ|| 6/-
చిబ్బుబుడ్లు డజను రూ|| 5/-
చిబ్బుబుడ్లు డజను ~~రూ|| 6/-~~ రూ|| 5/-
చిబ్బుబుడ్లు డజను ~~రూ|| 5/-~~ రూ|| 4/-
చిబ్బుబుడ్లు డజను ~~రూ|| 6/-~~ ~~రూ|| 5/-~~ రూ|| 3/-
చిబ్బుబుడ్లు డజను ~~రూ|| 5/-~~ ~~రూ|| 4/-~~ రూ|| 2/-
అయితే మీ కొట్లో ఉన్న చిబ్బుబుడ్లు అన్నీ ఇచ్చేయండి కొంటాను
చిబ్బుబుడ్లు డజను ~~రూ|| 6/-~~ ~~రూ|| 5/-~~ రూ|| 3/-
చిబ్బుబుడ్లు డజను ~~రూ|| 5/-~~ ~~రూ|| 4/-~~ రూ|| 2/-
అల్లా ఒప్పయ్య గుండెల్లో ఆటంబాంబు పేలింది

# ఉత్తరాలు

(4-వ పేజీ తరువాయి)

గ్రూపులో మాకు తెల్సినవాళ్ళఅబ్బాయికి పి. యు. సి (1967 మార్చి)లో జరిగిన సంఘటన ఇప్పుడు గుర్తుకు వస్తున్నది.... అతడి హాల్ టికెట్టు విశ్వాత్రం కాలేజికివచ్చింది. కాని కాలేజీకి వచ్చిన లిస్టులో అతడి నెంబరుగాని, పేరుగాని లేదు. లిస్టులో లేనిది హాల్ టికెట్ఎలా పంపగలిగారు? హాల్ టికెట్టు పంపగల్గినప్పుడు లిస్టులో పేరు ఎందుకు లేదు? ఇలా ఎలా జరిగిందో ఎవరికీ అర్థం కాలేదు. కానీ ఆ సెంటరు చీఫ్ సూపరింటెండెంటు పరిస్థితిని అర్థం చేసుకోగలిగారు కాబట్టి పరీక్షకు హాజరు కానిచ్చి యూనివర్సిటీకి టెలిగ్రాము యిచ్చారనుకోండి.

ఇంకొక సంఘటన— మాకు తెల్సినవాళ్ళలోనే.... ఆ అమ్మాయి అప్లికేషనులో 'వుమన్ కాండిడేట్' అనిపెట్టినా హాల్ టికెట్‌లో 'డబ్ల్యు' అని వున్నా ఆ అమ్మాయి పేరు 'మెన్ లిస్టు'లో కలసిపోయింది. స్త్రీలందరకూ ప్రత్యేకంగా కేటాయించబడిన గదిలో ఆ అమ్మాయి నెంబరు లేక పోవడంతో ఆఫీసులో తెలియజేసిందట. వాళ్ళు వెంటనే ఆగది లోనే నెంబరు వెయ్యడం జరిగింది గానీ లేడీస్‌రూం లిస్టులో ఆ నెంబరు చేర్చడం జరగనందున ఆ అమ్మాయి బాధపడవలసి వచ్చింది.

ఇలాంటివి ఎందుకు జరుగుతయ్యంటే చెప్పడం కష్టం. కానీ కొందరు దురదృష్టవంతులు వాటికి గురికావడం జరుగుతుంటుంది. అలాంటి దురదృష్టకరపరిస్థితిని అర్థం చేసుకోగల అధికారులు వుంటే ఫరవాలేదు. అలా జరగనప్పుడు ఆ దురదృష్టవంతులు బాధపడక తప్పదు.

నెంబరు ఎందుకు లేదో వివరంగా వ్రాయవలసింది అన్న పాఠకుని సూచనకు నా ధన్యవాదాలు. కానీ పత్రికవారు పెట్టిన పేజీల నిబంధన అడుగడుగునా భయపెడ్తుంటే కొన్నికొన్ని చిన్న సంఘటనలను విధ్యమైనంత క్లుప్తంగా ముగించక తప్పదు మరి.

'పూర్వాసంధ్య ప్రవర్తతే....' సీరియల్‌ను తమ పత్రికలో ప్రచురించిన సంపాదకులకు, సీరియల్ పై తమతమ అమూల్యభిప్రాయాలను, తమ అభినందనలను తెలిపిన విమర్శకులకు, పాఠకులకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

అధరాపురపు తేజోవతి.

## లోకంపోకడ

25-8-67 సంచికలోని 'లోకంపోకడ' పై విమర్శను 15-9-67 పత్రికలో చదివాను. ఏది విమర్శో, ఏదిజోకో, ఏదినిజమో, తెలిసికోలేని స్థితిలో ఆంధ్రపాఠకులు వుండటము చాల విచారకరము.

అసలు ఆ లోకంపోకడలోని వృత్తాంతం ఒక పాత జోకు. దాన్ని సంపాదకులో లేక వేరే రచయితో మార్చివ్రాశారు. ఏ పాతజోకైనా కొత్తగా చెప్పటంలోనేవుంది గొప్ప. అంతేకాని జోకులు చదివి ఆవేశపడటం భ్రమదండుగ. రామకృష్ణ, (వాల్తేరు)



'కాంతిరేఖలను వెదజల్లే కంటి వెలుగు' (ఫోటో: విప్పిటి గిరిధర్, మద్రాసు)

## దిబ్బు దిబ్బు దీపావళి

దిబ్బు దిబ్బు దీపావళి
రమ్ము రమ్ము దూపావళి
దివ్యమైన దీపావళి॥
దీపరుచులు చేయిసాచి
దశదిశలా నిశను త్రోసి
విశలపరచు దివ్యకాంతి॥
దివ్వెలతో ముగ్గు అలికి
రవ్వలలో పువ్వు లొలికి
జువ్వలతో నింగి తెలుపు॥
పీమ ఉపాకాయి పేలు
చిచ్చుబుడ్లు పూలురాలు
పూవులలో నవ్వుజారు॥
పూలమతాబాలు వెలుగు
పిల్ల సిసింద్రీలు చెలగు
చాల తమాషాలు జరుగు॥
మింటిమీద తారావళి
మినుకుమినుకు మంటుంది
ఇంటిలోన దీపావళి
కంటినిండ వెలుగుతుంది
తారావళి కన్న మా
దీపావళి మిన్న॥
దిబ్బు దిబ్బు దీపావళి
రమ్ము రమ్ము రూపావళి
దివ్యమైన దీపావళి॥

— సి. కనకాంబరరాజు.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.